**ప్రపంచంలోనే మొట్టమొదటి సారిగా SUGAR ను పూర్తిగా తగ్గించుటకు 100% గ్యారంటీ చికిత్స!!**

1 నెల మందు వాడి SUGAR ను పరీక్షించుకొని ఫలితాన్ని చూడండి. Type - II - 6 నెలలు, Type -I - 12 నెలలు, కోర్సు అనంతరము ఏ మందులతో పనిలేకుండా అన్నిరకముల తీపి పదార్థములు తినవచ్చును, త్రాగవచ్చును. (PER MONTH Rs 3000/-)

**నూతన యవ్వనశక్తికి : నపుంసకత్వము (IMPOTENCY) - శ్రీఘ్రస్కలనము - నరాల బలహీనత**

అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా మూడుచుకొని పోవుట - వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనక ముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత దృఢముగా, శక్తివంతముగా - వృద్యాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషదము. (Per Month Rs. 5000/-) Course : 3-6 months

**సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త !! (ఆపరేషన్‌లు లేకుండా)**

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి Per Month Rs. 5000/-) Course : 3-6 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రోలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెంట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా, తరచూ గర్భ స్రావములు జరుగుచున్న, గర్భాశయ లోపములకు (PCDO) - రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. Per month Rs. 5000/-) Course : 3-6 Months.

**సుఖవ్యాధులు : గనేరియా - సిఫిలిస్ (Per month Rs. 2000/-) Course : 3 Months. హెర్పిస్ సింప్లెక్స్ (HERPES SIMPLEX) (Herpes Zooster) హెర్పిస్ జోష్టర్ Per month Rs. 4000/-) Course : 3-6 Months.**

**HIV-AIDS ప్రాణాంతకాలు కావు !!**

HIV సోకిన వ్యక్తిని AIDS నుండి కాపాడవచ్చును. డాక్టరు సలహా మేరకు మందులు వాడి వైరల్ లోడ్‌ను తగ్గించుకొని CD-4 కౌంట్ (IMMUNITY) పెరిగి సాధారణ స్థితి (నార్మల్)కి వస్తుంది. HIV-AIDS వారు జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కహాల్ సేవించరాదు. పొగ త్రాగరాదు, మత్తు మందులు తీసుకొనరాదు. Course : 3-4 Months.

**ఆల్కహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి ! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి !! (Per Month Rs. 2000/-) Course : 2-3 months**

**21 సం॥లోపు వారు ఏత్తు పెరుగుటకు (Per month 3000/-) Course : 3 months**

**మూర్ఛ (Fits), అపస్మారకము (Epilepsy) సోరియాసిస్ (Psoriasis) - బొల్లి (Leucoderma) (Per month 4000/-) Course : 3-6 months**

**కీళ్ళు-కండరాల నొప్పులకు - నడుమునొప్పి - వెన్ను నొప్పి మెడనొప్పి (Per month 1200/-) Course : 3-6 months**

10 A.M to 8 P.M.

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

**9392355590**
**9866155109**

సప్తగిరి థియేటరు ప్రక్కన మెయిన్ రోడ్ - రెండవ బిల్డింగ్, 1వ అంతస్తు, ఆర్.టి.సి. ఎక్స్‌రోడ్స్ బస్టాప్, హైదరాబాదు -20

**మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు**

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియజేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు ఏపీలో పోస్టల్ / కొరియర్ ఛార్జీ రూ.100/-, ఇతర రాష్ట్రాలవారు రూ. 250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు KERALA AYURVEDA VAIDYASALA పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలెను. మీ ఫోన్ నెంబర్‌తో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10 A.M. - 8.P.M. Sunday 10 A.M. - 2 P.M.

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?

ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది



# విపుల చతుర



ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
గుబాళింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే పరిమళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది

అది పుట్టిన రోజయినా..
పెళ్లి రోజయినా.. పండుగయినా
మరే శుభసందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డిడి లేదా ఎంఒ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.
ఆన్‌లైన్ బుకింగ్‌కు (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)

వివరాలకు : vipula.chatura@eenadu.net

సంపుటి -34, సంచిక - 10
406వ సంచిక, పేజీలు : 132
నవంబరు 2011

# చతుర



‘ఏమిటే, అలా చూస్తున్నావ్?’ అంది పార్వతి.
‘భర్త పోయాక ఎన్నాళ్లకు నీ కళ్లల్లో సంతోషం చూస్తున్నా!’ అంది అపూర్వ.
‘అది సరే, నేను సన్నబడ్డానా?’ అంది పార్వతి కంగారుగా.
‘లడ్డూలా ఉన్నావ్. కొరుక్కు తినాలనిపిస్తుంది’ అంది అపూర్వ.
‘ముందు స్నానం చెయ్. నీతో మాట్లాడాలి’ అంది పార్వతి.
‘ఓహ్! ఏం చెప్పబోతున్నావ్? పర్సనల్లా? జనరల్లా?’ అంది అపూర్వ ఉత్కంఠగా.
‘గ్లోబల్.. స్నానం చేసొస్తే చెబుతా’ అంది పార్వతి.
ఇంతకీ పార్వతి ఏంచెప్పింది? ఆమె సంతోషానికి కారణమేంటి?
కక్షలూ కార్పణ్యాల నేపథ్యంలో ఇద్దరమ్మాయిల ప్రేమగాథల్ని అత్యద్భుతంగా చిత్రించిన
**ఎమ్వీ రామిరెడ్డి**
సమకాలీన నవల
**సగం కాలిన జీవితం**
పేజీ... 6
బొమ్మలు : రాకేశ్



# 2011లో ఇంప్రింట్‌వారి
# భారతదేశంలోని తీర్థయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6, 8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6, 19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడీ, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5, 24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్, నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6, 19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7, 19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7, 28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతిర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7, 23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సమస్యా పరిష్కార యాత్రలు

మీ జాతక రీత్యా ఎటువంటి సమస్యలకైనా పరిష్కారము పొందుటకు చేయవలసిన యాత్రలు విద్యా, ఉద్యోగ, వివాహ, వ్యాపార, ఆర్థిక, కుటుంబ , కోర్టు వ్యవహారాలు , ఆరోగ్య సమస్యలు పరిష్కారానికి ప్రత్యేక యాత్రలు

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6, 22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## నర్మదా నది పుష్కర యాత్ర - ఓం కారేశ్వరానికి

(17-5-2012 నుండి 28-5-2012 వరకు)
మధ్యప్రదేశ్‌లో కంటక పర్వత ప్రాంతంలో జన్మించింది. ఈ నదిలో స్నానం చేసి తీర్థవిధులు నిర్వహిస్తే వందతరాల తమ పూర్వీకులు పవిత్రులు అవుతారు.
టికెట్లు బుకింగ్ మొదలైనది

## ఇంప్రింట్ జ్యోతిష్య కేంద్రము

నిష్ణాతులైన జ్యోతిష్య శాస్త్ర వేత్తలచే జాతకము క్షుణ్ణంగా పరిశీలించి మీకు అవసరమైన పరిష్కార మార్గాలు సూచిస్తారు. విద్యా, ఉద్యోగము, వివాహము, సంతానము, ఆర్థిక, వ్యవహారాలు, కుటుంబ విషయాలు, విదేశీ ప్రయాణాలు, వ్యాపారాభివృద్ధి మరియు ఏ సమస్యలకైనా ఖచ్చితమైనపరిష్కార మార్గాలు సూచించగలిగిన కేంద్రము .
ముషీరాబాద్, హైదరాబాద్ నందు, బి.హెచ్.ఇ.ఎల్., ఎం.ఐ.జి. -1536 (ఫేజ్ - I) నందు
ఫోన్: 27547708 / 09, 98850 89092

వివరాలకు :

Imprint

## దంటు నాగార్జున శర్మ, వేద నిలయం. ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్

ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్, హైదరాబాద్ - 20. ఫోన్: 040 – 2754 7708/2754 7709, సెల్: 98850 89092

# సగం కాలిన జీవితం

## - ఎమ్వీ రామిరెడ్డి

మాధవయ్య, సర్పంచి నారాయణకు మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుంది. అయినప్పటికీ ఊరి ఉపకారం కోసం తన మేనకోడలు పార్వతిని వైరి పక్షంలోని అబ్బాయికిచ్చి పెళ్లి చేస్తాడు మాధవయ్య. కొద్ది కాలానికే ఆమె వితంతువయింది. దాంతో ఆయన జీవితంలో ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాటు చేయకూడదనుకున్నాడు.
కానీ పార్వతి మళ్లీ శత్రువైన నారాయణ కుమారుడితోనే ప్రేమలో పడింది. మరోవైపు మాధవయ్య కూతురు అపూర్వ ఊరు ఊరంతా అసహ్యించుకునే ఓ రౌడీని ఇష్టపడింది.
ఇంతకీ పార్వతి, అపూర్వల ప్రేమకథలు ఏ మలుపులు తిరిగాయి? ప్రేమించినవారినే పెళ్లాడారా? గ్రామరాజకీయ కక్షల నేపథ్యంలో సాగే ఇద్దరు ముద్దుగుమ్మల జీవన పోరాటం
ఎమ్వీ రామిరెడ్డి **సగం కాలిన జీవితం**
ఈనెల చతుర కానుక!



"మంటలు.. మంటలు.. అమ్మో వచ్చే సినయ్.. మీదకే వచ్చేస్తున్నయ్.. నా డియర్ కాలిపోతోంది. రక్షించండి.." రాజారావు మళ్లీ బరస్ట్ అయ్యాడు. ఆస్పత్రి వరండాలో పిట్టగోడపై కూచున్న రాజారావు హఠాత్తుగా లేచి, తల బాదుకుంటూ అరుస్తుంటే అతణ్ని వికాస్ ఓదార్చే ప్రయత్నం చేస్తున్నాడు.

ఉదయం అపూర్వను ఆస్పత్రిలో చేర్చిన దగ్గర్నుంచీ ఇదే వరస. ఆమె మంటల్లో చిక్కుపడిపోవటాన్ని ప్రత్యక్షంగా చూసిన రాజారావు షాక్ తిన్నాడు. అతణ్ని మామూలు స్థితికి తీసుకొచ్చేందుకు వికాస్ విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

ఎన్ని ఓదార్పు మాటలు చెప్పినా అతడు కోలుకోవటం లేదు. ఎంత సర్ది చెప్పినా ఆ 'ట్రాన్స్'లోంచి బయటికి రావటం లేదు.

"రాజా.. రాజా" పట్టి కుదిపాడు వికాస్.

రాజారావు కళ్లు పెద్దవి చేసి, జుట్టు పీక్కుంటూ బొంగురుపోయిన గొంతుతో "అమ్మో.. అమ్మో.. అప్పు మంటల్లో చిక్కుకుంది" అంటూ ఏడుపు మొదలుపెట్టాడు.

"రాజా ప్లీజ్! ఆమెకేమీ కాదు. ఎందుకలా చిన్నపిల్లాడిలా ఏడుస్తావ్? "

"వికాస్... నాకెందుకో భయంగా ఉందిరా. నా అప్పుకి ఏమన్నా అయితే నేనేమైపోవాలి? నా పిల్లలేమవ్వాలి? "

"మళ్లీ అలాగే మాట్లాడతావ్! ఏమీకాదని డాక్టర్ చెప్పారుగా. రా.. అలా హోటల్ దాకా వెళ్లి టీ తాగొద్దాం" బలవంతంగా రాజారావుని రెక్కపట్టుకొని లాక్కెళ్లాడు వికాస్.

ఆస్పత్రికి కొద్ది దూరంలో ఉన్న చిన్న హోటల్లోకి వెళ్లారు. రాజాను సింక్ దగ్గరకు తీసుకెళ్లి మొహం కడిగాడు వికాస్.

మధ్యాహ్నం పన్నెండు దాటుతోంది. హోటల్లో జనం పలచగా ఉన్నారు. టిఫిన్‌కు ఆర్డరిచ్చాడు వికాస్.

తల టేబుల్‌పై వాల్చి కొద్దిగా రిలాక్స్ అవుతున్నట్లు కనిపించాడు రాజారావు. అతన్ని చూస్తుంటే వికాస్‌కి కడుపు తరుక్కుపోతోంది.

ఉదయం వికాస్ బ్రష్ చేసుకుంటుండగా ఓ పిల్లాడు పరుగెత్తుకొచ్చి, "టీచర్‌గారికి స్టౌ అంటుకుంది. మిమ్మల్ని అర్జెంటుగా రమ్మంటున్నారు" అని చెప్పాడు.

హడావుడిగా పరిగెత్తుకెళ్లాడు వికాస్.

ఏం జరిగిందో కాసేపు అర్థంకాలేదు.

అపూర్వ కేకలు పెడుతోంది. తడికెలతో ఏర్పాటు చేసుకున్న ఆ గదిలో ఓ చాప మీద పడుకొని తల్లడిల్లిపోతోంది. మంచం మీద కూచున్న మూడేళ్ల విహిత అమాయకంగా తల్లివంక చూస్తోంది. ఊయల్లోని నాలుగు నెలల బాబు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఒక తడికె సగం కాలిపోయింది. వెనకవైపు గోడ పొగ చూరివుంది. కాలిపోయిన అపూర్వ శరీరం నుంచి దుస్తుల్ని వేరు చేస్తున్న రాజారావు వికాస్‌ను చూడగానే బావురుమన్నాడు. పెద్దగా రోదిస్తూ గుండెలు బాదుకుంటూ ఆమెవైపు చూపించాడు. ఏం జరిగిందో చెప్పాలని ప్రయత్నిస్తూ విఫలమవుతున్నాడు.

వికాస్‌కి విషయం అర్థమైంది. వెంటనే తేరుకొని అపూర్వను పరిశీలించాడు. మొహం కూడా బాగా కాలిపోయింది. జాకెట్టు, చీర అప్పటికే ఆమె ఒంటి నుంచి వేరు చేశాడు రాజారావు. సిల్కుచీర కావటంతో పొట్ట భాగంలో అతుక్కుపోయింది. ఆలస్యం చేయకుండా కత్తెర తీసుకొని వస్త్రాల్ని వీలైనంత వరకూ కట్ చేసి తొలగించాడు.

కాన్వెంటు ఊరి చివర్న కావటంతో చుట్టుపక్కల వాళ్లెవ్వరూ రాలేదు.

"కారు తీసుకొస్తా, ఆస్పత్రికి వెళ్దాం" అని హడావిడిగా బయటికి వెళ్లాడు వికాస్.

కారు రాగానే, అపూర్వకు ఓ దుప్పటి

చుట్టి, వెనక సీట్లో పడుకోబెట్టారు. రాజా రావు వెనక సీట్లోనే కూచొని ఆమె కాళ్లను తన ఒళ్లో పెట్టుకున్నాడు. పిల్లల బాధ్య తల్ని ఆయాకి అప్పజెప్పి వికాస్ ముందు సీట్లో కూచున్నాడు. ఊరికి ఆ చివర్న ఉన్న గవర్నమెంట్ జనరల్ ఆస్పత్రి వైపు దూసుకుపోయింది కారు.

...రెండు ప్లేట్లు ఇడ్లీ తెచ్చాడు సర్వర్.

రాజాని తట్టి లేపాడు వికాస్. అతడి కళ్లవెంట జలా జలా నీళ్లు రాలాయి.

"రాజా.. ప్లీజ్! కంట్రోల్ యువర్ సెల్ఫ్. మరీ అలా కుంగిపోతే ఎలా? ప్లీజ్... ఇడ్లీ తిను"

బలవంతంగా ఇడ్లీని లోపలికి పోని చ్చాడు రాజారావు.

టీ తాగి, బయటికొచ్చారు.

రాజా మొహం కాస్త తెప్పరిల్లింది. ఇద్దరూ ఆస్పత్రి ఆవరణలోకి ప్రవేశించి చెట్టు కింద కూచున్నారు.

"రాజా... మరి అపూర్వ బాగోగులు చూడ్డానికి ఎవరైనా ఉండాలి కదా! ఎవరికి కబురు చేద్దాం?"

మళ్లీ భోరున విలపించాడు రాజా.

"ఎవరున్నారని పిలుద్దాం? అందరినీ కాదనుకుని ఇలా బయటికొచ్చి బతుకు తున్నాం. ప్చ్... అంతా ఖర్మ!"

"రేయ్- ప్రతిదానికీ నువ్వలా ఏడవకు. ఏదొచ్చినా ఎదుర్కొనేందుకు సిద్ధమయ్యాకే గదా, ఇలా వచ్చేశారు. ఇప్పుడవన్నీ ఆలో చిస్తే ఎలా?"

రాజా అలాగే చూస్తుండిపోయాడు.

వికాస్‌కి వెంటనే రంజిత గుర్తొచ్చింది. ఆమె రాజా వాళ్ల స్కూల్లోనే టీచరుగా పని చేస్తోంది. స్కూలు వదిలాక కూడా చాలాసేపు విహితను ఆడిస్తూ, వీళ్లింట్లోనే గడుపుతుంది.

"ఆ.. ప్రస్తుతానికి రంజితకు కబురు చేద్దాం. అలాగే మీ అమ్మకు ఫోన్ చేస్తాను. రేపు ఉదయాన్నే బయల్దేరి రమ్మంటాను" అన్నాడు వికాస్.

"అమ్మా..?" నమ్మలేనట్లుగా అడిగాడు రాజారావు.

"తప్పులేదు రాజా. ఇట్లాంటప్పుడు పంతాలూ పట్టింపులూ పక్కన పెట్టాలి. అవసరం మనది. అర్థించక తప్పదు".

"నీ ఇష్టం"

"నువ్విక్కడే ఉండు. నేను ఇద్దరికీ ఫోన్జేసి వస్తా" అంటూ సెల్‌ఫోన్ తీసు కుంటూ బయటికి నడిచాడు వికాస్.

రకరకాల ఆలోచనలు వికాస్‌తో సంఘర్షి స్తున్నాయి. మొదట ప్రమాదం విషయం తెలియగానే అతని మనస్సులో అనుమాన బీజం మొలకెత్తింది. రాజారావుపై సందేహం తలెత్తింది. అంతకు ముందు రోజు రాత్రి పది గంటలకు నీరజ వాళ్లిం టికి ఫోన్జేసి తనని పిలిపించాడు.

"నాకు ఈ రాత్రికి రావటం కుదరదు. నువ్వెళ్లి అప్పుకి తోడుగా పడుకో. అసలే రాత్రిపూట ఎవరో తిరుగుతున్నట్లు అనిపి స్తోందని తనీమధ్య గొడవ చేస్తోంది. నేను ఎర్లీ మార్నింగ్ వచ్చేస్తా" అని చెప్పాడు.

తను ఆ రాత్రివేళ కాన్వెంటుకు వెళ్లి, అపూర్వకు విషయం చెప్పాడు.

"పోన్లెండి. విషయమైనా తెలిసింది. ఇప్పటిదాకా తెగ ఎదురుచూస్తున్నా. ఒక్క దాన్నే ఇంత పెద్దింట్లో బిక్కు బిక్కు మంటూ గడుపుతున్నా. రండి ప్లీజ్" అంటూ ఆమె వికాస్‌ను ఆహ్వానించింది.

విశాలమైన ఖాళీస్థలంలో ఒకవైపు రెండె కరాల పొడవున ఎప్పుడో నిర్మించిన పెంకుటిల్లు. దాన్నే ఏడెనిమిది గదులుగా విభజించి, క్లాసులు నడుపుతున్నారు. ఒక చివర్న నాలుగు తడికెల్ని అడ్డుపెట్టుకొని, ఆ రూములో ఉంటున్నారు రాజా, అపూర్వ.

ఎదురుగా విశాలమైన ఆటస్థలం, ఓ మూలన చిన్న గార్డెన్.

గదిలోంచి ఓ మంచాన్ని బయటికి తెచ్చుకొని, పక్కనే క్లాసురూములో వేసుకు న్నాడు వికాస్.

విహితను కూడా తన వద్దే పడుకోబెట్టు కున్నాడు. అపూర్వ అతనితో కాసేపు ముచ్చట్లు చెప్పి వెళ్లిపోయింది.

అప్పుడు కూడా ఆమె, తన భర్త మీద ఎలాంటి ఫిర్యాదులూ చేయలేదు.

అయినా, ఎందుకో వికాస్ మనస్సు రాజారావును శంకించింది. స్టౌ అంటుకోవ డమనేది కథేమోనని అనుమానించాడు.

> **కొత్తగాలి...**
>
> **నల్లధనం**
> **నల్లత్రాచు**
> **'బుస్' మనదు**
> **'స్విస్' మంటుంది**
>
> – భమిడిపాటి,
> చందానగర్, హైదరాబాద్

కానీ ఆస్పత్రికి వచ్చిన దగ్గర నుంచీ ఇప్ప టిదాకా రాజారావు ధోరణి చూశాక ఆ అనుమానం తొలగిపోయింది. దుఃఖ జ్వరంతో అతడు పదే పదే సుడులు తిరు గుతుంటే... రాజారావుని అనుమానించి నందుకు వికాస్‌లో పశ్చాత్తాప భావం తొంగిచూసింది.

రంజిత కంగారుగా ఆస్పత్రిలోకి వచ్చి, ఓ.పి. దగ్గర కూచున్న వికాస్‌ని "టీచర్ గారికి ఏమైంది? ఎక్కడున్నారు? " అని అడిగింది.

"రండి.. చూపిస్తా" అంటూ వెంట తీసు కెళ్లాడు.

అపూర్వ శరీరం నిండా బ్యాండేజీలు. ఆమెకింకా మత్తు వదల్లేదు. ఆమె కాళ్ల దగ్గర స్టూలుపై కూచుని, తడిదేరిన కళ్లతో నిర్వేదంగా చూస్తున్నాడు రాజారావు.

గదిలోకి రాగానే అపూర్వను ఆ స్థితిలో చూసి ఏడుపందుకుంది రంజిత.

"మేడమ్.. మేడమ్.. నేనొచ్చాను. చూడండి మేడమ్" ఏడుస్తూ అపూర్వను పట్టుకోబోతుంటే వారించాడు వికాస్.

"ఏమైందిసార్, మేడమ్‌కి? ఎందుకిలా అయింది? " అంటూ రాజాని కుదిపేసింది రంజిత.

"అంతా నా ఖర్మ.. ఖర్మ.. ఈ ఉగాది పండగ ఇలా తెలవారాలని ఉంది నాకు" రాజా చలించిపోయాడు.

"చూడండి మిస్. మీ సార్ పిల్లాడిలా ఏడుస్తున్నాడనే మిమ్మల్ని పిలిపించాను. మీరు కూడా ఇలా అయితే ఎలా? ముందు ఆమెకేం అవసరమో చూడండి. ఓసారి నర్సును కలిసి ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో అడిగి తెలుసుకోండి. పిల్లల్ని ఆయాకి అప్పజెప్పి వచ్చాం. మేం వెళ్లి వాళ్లని తీసుకొస్తాం. మీరు ధైర్యంగా ఉండండి" అని చెప్పి రాజాని తీసుకొని వెళ్లిపోయాడు వికాస్.

★ ★ ★

సాయంత్రం ఆరు కావస్తోంది.

అనంతారం గ్రామంలోని మెయిన్‌రోడ్డు సందడిగా ఉంది. పొలం పనులు పెద్దగా లేకపోవడం, పంచాయతీ ఎన్నికల హడా వుడి మొదలు కావడంతో పదిమందీ చేరి తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్నారు.

మెయిన్ రోడ్డు నుంచి చీలిన మూడో వీధిలో, చిట్టచివరి ఇల్లు రామనర్సయ్యది. విశాలమైన పెంకుటిల్లు, పెరటికి అనుకుని పెద్ద పశువుల కొష్టం, పదహారు గేదెల పాడి, పన్నెండెకరాల మాగాణి, తాతల నాడు సంపాదించిన ఆస్తికి ఏకైక వారసు డాయన.

# న్యూ ఎనర్జీ గోధుమ గ్రాస్ పౌడర్




అత్యద్భుత ఔషధ గుణములు కలిగిన గోధుమ గడ్డి ఎన్నో ఆరోగ్య ప్రయోజనాలని అందించే పోషక ఆహార, సప్లిమెంట్ & క్యూర్, గోధుమ గడ్డి ప్రకృతి ప్రసాదించిన దివ్య ఔషధం. మొలకెత్తిన లేత గోధుమ ఆకులలో అనగా ఏడు (7) రోజుల మొక్కలలో ఆరోగ్య పరిరక్షణకు అవసరమగు అన్ని పోషక విలువలు లభించును. లేత గోధుమ ఆకుల రసం మానవ రక్తాన్ని పోలి ఉంటుంది. మన రక్తంలో ఉండే "హెమిన్" పరమాణు నిర్మాణం, గోధుమ గడ్డిలో ఉండే "క్లోరోఫిల్" పరమాణు నిర్మాణం ఒకేలా ఉంటుందని పరిశోధనలలో స్పష్టమైనందున దీనిని "గ్రీన్‌బ్లడ్" (గ్రీన్ గ్రాస్)గా వ్యవహరిస్తూ, ఆరోగ్య పరిరక్షణకు వివిధ దేశాలలో విరివిగా వాడుచున్నారు.

## "గోధుమ గడ్డి మన భారతీయ ప్రాచీన వైద్య విధానం"

సంపూర్ణ ఆరోగ్య పరిరక్షణకు అవసరమగు విటమిన్స్, మినరల్స్, అమినో యాసిడ్స్, మైక్రో న్యూట్రియన్స్, ఫైబర్, విటమిన్ A, B, C, E, K ఐరన్, కాల్షియం, సోడియం, మెగ్నీషియమ్ మొదలగు ప్రకృతి సిద్ధమైన పోషక విలువల శక్తి ఇమిడి ఉంటుంది. గోధుమ గడ్డిలో క్యాన్సర్ కణాలను నిరోధించే 'లేట్రేయిల్ బి17' శక్తి ఇమిడి ఉందని మొదటి దశలోని క్యాన్సర్‌ను ఇది నిర్మూలిస్తుందని ఇప్పటికే ప్రయోగం చేసి దీని గురించి తెలుసుకున్నారు.

## ఈ పౌడర్ వాడుట వలన ఈ క్రింది వ్యాధులను నివారించవచ్చును

★ శరీరంలో రోగనిరోధక శక్తి పెరిగి అనేక రకాల అనారోగ్య సమస్యలు దూరమౌతాయి.

★ ఎన్నో వ్యాధులకు మూలమైన మలబద్ధకాన్ని పోగొడుతుంది

★ షుగరు, బి.పి.ని అదుపులో ఉంచుతుంది. ఎసిడిటి, గ్యాస్ ట్రబుల్‌ను తగ్గిస్తుంది. ఊపిరితిత్తులలో నిమ్ము, ఆస్మా, ఎలర్జీలను తగ్గిస్తుంది

★ శరీరంలో పేరుకుపోయిన కొవ్వు శాతాన్ని తగ్గించి, అధికబరువు, పొట్టను తగ్గిస్తుంది.

★ ఆకలిని పెంచుతుంది. అజీర్ణం, అధికనిద్ర, నిద్రపట్టకపోవడం సమస్యలు దూరమౌతాయి.

★ ఈ పౌడర్ ప్రతిరోజూ వాడుట వలన నరాలవ్యవస్థ బలోపేతమై లైంగిక సామర్థ్యం పెరుగుతుంది.

★ క్యాన్సర్, పక్షవాతం, చర్మవ్యాధులు, శరీర పటుత్వం కోల్పోవడం మరియు తీవ్ర హృద్రోగ సమస్యలకు, ఎయిడ్స్ వ్యాధిగ్రస్థులకు రోగనిరోధక శక్తిని పెంచుతుంది. దీర్ఘకాలంగా వాడి అధిక ప్రయోజనం పొందగలరు. జాయింట్లలో ఉప్పునీటిని తొలగించి మోకాళ్ళ నొప్పులు, కీళ్ళనొప్పులు తొలగిపోతాయి. జుట్టు రాలటం, థైరాయిడ్ సమస్యలు పోగొడుతుంది. స్త్రీలకు ఋతుసమస్యల నుండి విముక్తి, మూత్రపిండాలలో రాళ్ళు దూరమౌతాయి.

*మీకు దగ్గరలోని ప్రముఖ యోగ గురువులు, ఆయుర్వేద, మెడికల్ షాపులలో మరియు మోడరన్ సూపర్ బజార్లలో లభించును.*

**ప్రాతినిధ్యం లేని ఏరియాలలో డీలర్లు కావలెను**

## ఆర్.యస్. నేచురల్ ఫుడ్స్

ఆఫీసు : 40-16-147, ప్రశాంతి హాస్పటల్ రోడ్, కాంధారి హోటల్ దగ్గర, ఎమ్.జి.రోడ్, లబ్బీపేట, విజయవాడ-10. ఫోన్ : 0866 – 2482954, 98485 85535, 92908 20002

వరండాలో పకడక్కుర్చీలో కూచుని రామాయణం చదువుకుంటున్నాడు రామ నర్సయ్య.

పరమ ప్రశాంతమైన వాతావరణాన్ని భగ్నంచేస్తూ.. కొష్టం వైపు నుంచి ఢామ్మని పేలుడు శబ్దం వినిపించింది. రామ నర్సయ్య అమాంతం కుర్చీలోంచి కిందపడ్డాడు. ఇంట్లోవాళ్లు అయోమయంగా బయటికి పరుగులు తీశారు.

గబగబా లేచి, కిందపడిన కళ్లజోడును సరిచేసుకుంటూ, పెరటివైపు పరుగు తీశాడు రామనర్సయ్య.

పెరటి గుమ్మంలోంచి చూస్తే.. దట్టంగా పొగమేఘాలు!

> **కొత్తగాలి...**
>
> **గని గోడు విని**
> **ఖనిజం నిజం చెప్పేసింది**
> **తను తవ్వుకున్న గనిలో తానె!**
>
> – సురేష్‌కుమార్,
> ఉప్పల్, హైదరాబాద్

బాంబు పేలుడుకు బెదిరిపోయిన గేదెలు, దూడలు పెద్దగా అరుస్తూ పరుగులు తీస్తున్నట్లు లీలగా కనిపించింది.

రామనర్సయ్య నాలుగడుగులు ముందుకేసి, పొగ కమ్ముకోవడంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. దగ్గుతూ అలాగే కాసేపు నిలబడ్డాడు. కొద్దిసేపటి తర్వాత పొగ తొలగిపోయింది. దృశ్యం స్పష్టమయింది.

గేదెల తొక్కిడితో చెల్లాచెదురైన కొష్టానికి ఆవల ఓ యువకుడు నిలబడివున్నాడు.

మరోసారి కళ్లు నులుముకుని తీక్షణంగా చూశాడు రామనర్సయ్య.

ఆ యువకుడు.. 'పులి'గాడేనని నిర్ధారించుకున్నాడు.

మూగజీవాలపై బాంబు దాడి జరిపిన పులిగాడి మీద రామనర్సయ్యకు విపరీతమైన కోపం వచ్చింది. పళ్లు పటపట కొరుకుతూ గబగబా వెళ్లి, పులిగాడి చొక్కా కాలర్ పట్టుకున్నాడు. దాడుల్లో ఆరితేరిన పులిగాడు అంతే వేగంతో స్పందించి, రామ నర్సయ్యను ఒక్కతోపు తోశాడు.

ఆ ఊపుకి కుడితిగాబు పక్కన పడ్డాడు రామనర్సయ్య.

ఇంతలో, పేలుడు శబ్దం విని, పక్క ఇళ్ల జనంతో పాటు పెద్దబజారులో కబుర్లు చెప్పుకొంటున్న వాళ్లు కూడా హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చారు.

అక్కడ చేరిన వారంతా జరిగిన, జరుగుతున్న తతంగాన్ని టీవీ సీరియల్‌గా చూస్తున్నారే తప్ప ఒక్కరైనా ఆపేందుకు ప్రయత్నించలేదు.

తెలిసి తెలిసీ పులిగాడితో గొడవ పెట్టుకోవటానికి ఎవ్వరూ సాహసించలేదు.

కిందపడిన రామనర్సయ్యను రెక్కపుచ్చుకుని, పైకి లేపి "ఈ పని ఎందుకు చేశానో ఈ పాటికి నీకర్థమయ్యే ఉంటుందనుకుంటా" అన్నాడు పులిగాడు.

"ఏమిట్రా అర్థమయ్యేది? నీకు నేనేం అన్యాయం చేశానని, ఇట్టా జేశావ్? "

"అన్యాయం నాకు జేస్తే ఒకటీ, నారాయణ గారికి జేస్తే ఒకటీనా? "

"అన్యాయం చేసింది నేను కాదు.. ఆయనా, ఆయన మనుషులు. అసలు పొలం దగ్గర ఏం జరిగిందో తెలుసుకోకుండా ఇట్లా దౌర్జన్యం చెయ్యటం నీకు న్యాయమా? ఏదైనా ఉంటే పెద్దమనుషుల ముందు తేల్చుకోవాలి. అదేం లేకుండా నీకిష్టం వచ్చినట్టు ఇట్టా బాంబుల్తో దాడిచేస్తే, ఇప్పుడీ నష్టమంతా నీ బాబు కడతాడా? "

"అవన్నీ నాకు తెలవదు. నారాయణ గారి పొలంగట్టుని లోపలికంటా ట్రాక్టరుతో దున్నించావంట. అందుకే నీమీద దాడిచేయమని ఆర్డరేశాడు.. చేశానంతే"

"చేస్తావురా.. నువ్వేదైనా చేస్తావ్. డిగ్రీ చదివావన్న మాటేగానీ, ఇంగితం లేకుండా పోయింది. రేపు ఏదో ఒక కారణం చెప్పి, మీ ఇంటినే నాశనం చెయ్యమని ఆదేశిస్తాడు. చేస్తావా? "

"గ్యారెంటీగా" అనేసి, చక్కా వెళ్లిపోయాడు.

నిరాటంకంగా సాగుతున్న 'పులి'గాడి దౌర్జన్యాల సీరియల్‌లో ఉత్కంఠభరితమైన మరో ఎపిసోడ్‌ను వీక్షించిన ప్రేక్షకులు అక్కణ్నించి వెనుదిరిగారు.

రామనర్సయ్య అక్కడే కూలబడిపోయాడు నిస్సత్తువగా.

★ ★ ★

రాజారావు, వికాస్ తాటికొండ చేరుకున్నారు. అపూర్వ అదుపాజ్ఞలో రోజూ సందడిగా కనిపించే కాన్వెంటు.. అమ్మను కోల్పోయిన అనాథబిడ్డలా నిర్లిప్తంగా ఉంది. గేటు తీసి ఇద్దరూ లోపలికి అడుగు పెట్టగానే ఆయా పరుగెత్తుకొచ్చింది. ఆమె చంకలో పసిపిల్లాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

తండ్రిని చూడగానే విహిత గబగబా వచ్చి, కాళ్లను చుట్టేసింది.

"అమ్మేదీ? అమ్మేది నాన్నా? " దీనంగా అడిగింది పాప.

వణికిపోయాడు రాజారావు. పాపను ఎత్తుకొని గుండెలకు హత్తుకున్నాడు.

"మీరు పోయిన దగ్గర నుంచీ ఇద్దరూ ఏడుత్తూనే ఉన్నారు సారూ! ఎంత బుజ్జగించినా ఊరుకోటల్లేదు" అంది ఆయా.

బాబుని వికాస్ ఎత్తుకున్నాడు.

"ఆయా, నేను పిలుస్తున్నానని చెప్పి, నీరజగారిని ఓసారి రమ్మని చెప్పు" వికాస్ చెప్పాడు.

"అట్టాగే సారూ" ఆయా వెళ్లింది.

వికాస్ అద్దెకుండే ఇంటి యజమాని కూతురు నీరజ. ఆమెకు వికాస్ ద్వారానే అపూర్వ, రాజారావులు పరిచయమయ్యారు. ఎమ్మెస్సీ చదువుతోంది. ఖాళీ సమయాల్లో సరదాగా కాన్వెంటుకొచ్చి, పిల్లల కేరింతల్ని ఆస్వాదిస్తుంటుంది. వారితో కలిసి ఆడుకుంటుంది.

తండ్రినీ, వికాస్‌నూ చూడగానే పిల్లలు కాస్త కుదుటపడ్డారు.

"రాజా, పాలేమైనా ఉన్నాయా? "

"ఉదయం తను పోయించుకోవటం చూశాను. ఉండే ఉంటాయి"

"చూసి, కాగబెట్టు. బాబుకు పాలుబట్టి, కాసిని టీ పెట్టు, మనం తాగుదాం. నేను విహితకి ఏదో ఒకటి తినిపించుకు ఫస్తా" అంటూ వికాస్ పాపతో బయటికెళ్లాడు.

రాజారావు బాబుని మంచంమీద కూచోబెట్టి, ఆటవస్తువులు ముందేశాడు. తనూ నడుం వాల్చాడు. ఏం చెయ్యటానికీ చేతులు రావటంలేదు.

పది నిముషాల తర్వాత వచ్చిన వికాస్, "రాజా.. రాజా! నేను చెప్పిందేమిటి? నువ్వు చేస్తున్నదేమిటీ? " చేతిని కళ్లకు అడ్డంగా పెట్టుకొని ఏడుస్తూ పడుకున్న రాజారావుని కుదిపేస్తూ అన్నాడు.

"లే.. పాలు వేడి చెయ్యి. పిల్లాడికి ఆకలై ఏడుస్తుంటే కనిపించటంలా? "

రాజారావు లేచాడు. క్లాస్‌రూములోంచి తమ ఇంటిలాంటి తడికెల గదిలోకి అడుగుపెట్టాడు.

ఫ్రిజ్‌లోంచి పాలు బయటికి తీసి, స్టౌ వద్దకు వెళ్లాడు. అంతే.. కెవ్వున కేకేశాడు.

పరుగెత్తుకొచ్చాడు వికాస్.

"ఏమైంది రాజా? " కంగారుగా అడిగాడు.

"దెయ్యం.. దెయ్యం.." రాజారావు వణి

కిపోతున్నాడు.

"పిచ్చి పట్టిందా? " వికాస్ కోప్పడ్డాడు.

"అదుగో.. అదే.. నా అప్పుని కాల్చేసిన దెయ్యం" ఓ మూలన ఉన్న స్టౌను చూపిస్తూ అన్నాడు.

పరిస్థితి అర్థమైంది వికాస్‌కి.

"ఇదిగో.. ఈ చీరపీలిక నా అప్పుదే! అమ్మో.. ఈ గోడ కూడా కాలిపోయిం దంటే నా అప్పు శరీరం ఎంత భయంక రంగా కాలిపోయిందో!"

దుఃఖిత లోకంలో చిక్కుకుపోయి, అదే పనిగా పలవరిస్తున్న రాజారావుని చేయి పట్టుకొని బలవంతంగా బయటికి లాక్కొచ్చాడు వికాస్.

అప్పుడే నీరజ వచ్చింది.

"ఏమైంది? " అంది అయోమయంగా.

విషయమంతా క్లుప్తంగా వివరించాడు వికాస్. ఈ ఒక్కరోజు ఎలాగైనా బాబు ఆలనాపాలనా చూడాలని అభ్యర్థించాడు.

"బాబుకు పోతపాలు అలవాటేనా? " నీరజ అడిగింది.

"ఆ.. అలవాటే" వికాస్ చెప్పాడు.

"అయితే సమస్యేముంది? నేను చూసుకుంటాలే"

"థ్యాంక్సండీ. ఈ విషయం మీ అమ్మగారికి కూడా చెప్పండి"

"అలాగే. పాపను కూడా తీసుకెళ్లనా? "

"వద్దులే. వాళ్ల నాయనమ్మ గారొస్తారు. ఆమె దగ్గర ఉంటుందిలే"

నీరజ బాబును భుజాన పడుకోబెట్టుకొని వెళ్లిపోయింది. ఆమెకు చాలా ఆనందంగా ఉంది. తమ ఇంట్లోనే అద్దెకుంటున్నా ఎన్నడూ ఎలాంటి సహాయమూ అడగడు వికాస్. అతని పద్ధతులు, వ్యక్తిత్వం బాగా నచ్చాయి నీరజకు.

మూడు దుప్పట్లు, పాప బట్టలు, ఫ్లాస్క్ వంటి కొన్ని అవసరమైన వస్తువుల్ని ఓ బ్యాగ్‌లో సర్దాడు వికాస్.

విషయం తెలిసి, కాన్వెంటులో పనిచేసే ఓ టీచర్ వచ్చారు. రేపట్నుంచీ కాన్వెంటు నడిపే బాధ్యతలు ఆమెకు అప్పగించారు.

రాజారావునీ, పాపనీ, సామగ్రినీ తీసుకొని సాయంత్రానికి ఆస్పత్రికి చేరుకున్నాడు వికాస్. ఆపాటికే రాజారావు వాళ్ల అమ్మ ఆస్పత్రికి చేరుకొనివుంది.




అనంతారం గ్రామంలో పాతకాలపు బంగళాను తలపించే ఓ పెంకుటిల్లు. యజమాని మాధవయ్య, ఆ గ్రామంలో రాజ్యం చలాయించే రెండు ముఠాల్లో ఒక వర్గానికి ప్రతినిధి. ప్రతిపక్ష పార్టీ కావటంతో ప్రస్తుతం ఆయన ప్రభ దివ్యంగా వెలగకున్నా దర్పానికేమీ భంగం లేదు.

అనుచరగణం ఎప్పుడూ వెన్నంటి ఉంటుంది. నిత్యం సమాలోచనలు సాగుతుంటాయి.

విశాలమైన ఆ ఇంటిలో ఓ మూల గదిలో అసహనంగా పచార్లు చేస్తోంది పార్వతి, మాధవయ్య మేనకోడలు.

చెల్లెలు చనిపోతే, ఆమె ఒక్కాగానొక్క కూతురైన పార్వతిని మాధవయ్య సాకుతున్నాడు. మేనకోడలైన ఆమెని కూతురిలా చూసుకుంటున్నాడు మాధవయ్య. డిగ్రీ చదివించాడు. ఘనంగా పెళ్లి చేశాడు.

ప్రతి చిన్న విషయానికీ పడగ విప్పే ముఠాకక్షల్ని పక్కనబెట్టి, ఆ గ్రామ

సర్పంచి, అధికార పార్టీ నాయకుడూ అయిన నారాయణ తమ్ముడి కొడుకుని పార్వతికి భాగస్వామిగా కుదిర్చాడు.

కానీ తల్లిని వెంటాడిన దురదృష్టం పార్వతినీ విడిచిపెట్టలేదు.

ఊళ్లో పంతాలు, పట్టింపులు పెరిగిపోయి, వర్గపోరాటం తీవ్రరూపం దాల్చింది. పొలం గట్టు వద్ద మొదలైన చిన్న తగాదా చినికి చినికి గాలివాన అయింది. ఒకరోజు రాత్రి అది ఉద్ధృతంగా మారింది.

ఇరువర్గాల కార్యకర్తలూ బాంబులు, బరిసెలతో ఎదురుపడ్డారు. అక్కడో యుద్ధం బీభత్సాన్ని సృష్టించింది. విచక్షణారహిత ఆగ్రహావేశాలు చల్లారిన తర్వాత చూస్తే.. ఒక వ్యక్తి నిర్జీవంగా పడివున్నాడు.

అతను.. పార్వతి భర్త!

నిండా నాలుగు నెలలయినా భర్త సాన్నిహిత్యంలో సేదదీరలేదామె. ఇంతలోనే ఓ జీవన శరాఘాతం!

మాధవయ్య కుంగిపోయాడు. ఏ వర్గం విసిరిన బాంబు పేలిందో, ఏ కత్తి అతని కడుపును చీల్చిందో తెలియదు మరి. ఎవర్ని నిందితులుగా భావించాలి?

ఏడాది గడిచినా పార్వతి మళ్లీ మనిషి కాలేకపోయింది. మాధవయ్య విశ్వప్రయత్నం చేసినా ఆమెను మరో పెళ్లికి ఒప్పించలేకపోయాడు. పైగా "మీకు మా సుఖం ఎందుకు పడుతుంది? కక్షలు కావాలి. బరిసెలు కావాలి. బాంబులు కావాలి. చావులు కావాలి. చంపుకోండి. ఒకర్నొకరు! ఊరంతా ఖాళీ అయ్యేదాకా చంపుకోండి. కానీ మీరూ మనుషులేనన్న విషయం స్ఫురించినప్పుడల్లా నా మొహం గుర్తుకురావాలి. అది మీ గుండెల్లో మంటలు రేపాలి. ఏదో ఒకరోజు మీరీ నరమేధం ఆపాలి. అప్పటిదాకా నేను మళ్లీ పెళ్లి చేసుకునే ప్రశ్నే లేదు" అంటూ శపథం చేసింది.

పొరపాటున కూడా ఎదురు చెప్పటం చేతకాని పార్వతి.. ఇలా బద్ధలయిందంటే తను ఎంతగా కుమిలిపోతున్నట్లు? తను అన్నదాంట్లో నిజం లేదా?

గ్రామంలో రగులుతున్న కక్షలకు అధికారపార్టీ నాయకుడు నారాయణ ఒక్కడే కారణమా? తన పాత్ర లేదా? సమన్వయంతో సర్దుకుపోవటమనేది ఎక్కడో ఒక చోట ప్రారంభం అయితేనే కదా.. శాంతి సుమం వికసించేది? ఆ దిశగా తానే ఎందుకు కృషి చేయకూడదు?

మాధవయ్యలో మథనం మొదలైంది. కొన్ని రోజులపాటు ఆలోచనలతో తీవ్రంగా ఘర్షణ పడ్డాడు. చివరికో నిర్ణయానికొచ్చాడు. ముందుగా తనవర్గం మనుషుల్లో ఆలోచన రేకెత్తించేందుకు కసరత్తు ప్రారంభించాడు. ఎవ్వరూ సానుకూలంగా స్పందించలేదు. మడమ తిప్పటం అవమానమన్నారు. ఆవేశం లేకుండా బతకటం ఆత్మహత్యతో సమానమన్నారు.

మాధవయ్య రాజీ పడలేదు. ఎంత మంది రెచ్చగొట్టినా సహనం కోల్పోలేదు.

పైగా ఒకానొక శుభోదయాన.. స్వయంగా ఆయన నారాయణగారి ఇంటికి వెళ్లాడు. అడిగి మరీ కాఫీ తాగాడు. నారాయణతో కబుర్లు చెప్పాడు.

స్నేహంతో సాధించలేనిదేమీ లేదని మెల్లగా మాధవయ్యకు అనుభవంలోకి రాసాగింది.

ఎదుటివారి నుంచి కూడా తానాశించిన ఫలితాలు మొదలయ్యాయి. క్రమేపీ ఇరువర్గాల మధ్య దగ్గరితనం ఏర్పడింది. ఈ పరిణామానికి కనీసం ఆరేడు నెలల కాలం ఖర్చయింది.

ఊళ్లో ఇప్పుడు ప్రశాంత వాతావరణం వెల్లివిరుస్తోంది. గ్రామస్తుల్లో మునుపటి భయాందోళనలు తగ్గుముఖం పట్టాయి.

మాధవయ్య పార్వతిపై ఒత్తిడి తేవడం ప్రారంభించాడు. 'నా తప్పును సరిదిద్దుకున్నాను చూడమ్మా' అంటూ బతిమాలేడు. ఓ మంచివ్యక్తిని చూసి పార్వతికి పెళ్లిచేసే ప్రయత్నాల్లో నిమగ్నమయ్యాడు.

అయితే తమ మాటపై గౌరవముంచి, గ్రామ స్వరూపాన్నే మార్చేసిన మావయ్యకు పార్వతి ఆనందంగా గ్రీన్‌సిగ్నల్ ఇవ్వలేకపోయింది.

కారణం పార్వతి ప్రస్తుతం ఒక యువకుడితో ప్రేమలో పడటమే. అందుకే ఆమె అసహనంగా పచార్లు చేస్తోంది.

★ ★ ★

అపూర్వ స్పృహలో ఉందో లేదో తెలియడం లేదు. అరచేతుల్తో సహా ఒంటి నిండా కట్లు ఉన్నాయి.

అయిదేళ్ల తర్వాత తన కోడల్ని అలాంటి పరిస్థితిలో చూస్తాననుకోలేదు కళమ్మ. అయినవారందరినీ కాదనుకొని వాళ్లిద్దరూ తాటికొండ చేరుకొని కాన్వెంటు పెట్టడం.. ఇద్దరు పిల్లల్ని కనటం.. ఈ విశేషాలు ఆ నోటా ఈ నోటా తెలుస్తున్నాయిగానీ, తెగిన బంధాలు మాత్రం కలవలేదు. రాకపోకల పునరుద్ధరణ జరగలేదు.

రెండు మూడుసార్లు బస్సులో తారసపడ్డారు. దూరం నుంచే కోడలు నవ్వింది. తనూ అలాగే జవాబిచ్చింది. కోడలితోపాటు మనవరాలుంది. భుజం మీద పడుకొని నిద్రపోతుండటంతో మొహం కనిపించలేదు. కొడుకు మాత్రం అసలు తనను చూడనట్లే నటించాడు. 'వాడంతే.. మూర్ఖుడు!' అనుకొంది.

చాలాసార్లు తన భర్తకు నచ్చజెప్పాలని ప్రయత్నించింది కళమ్మ. కానీ ఆయన కొడుకు కంటే ఘనుడు. తన పట్టుదలే శాసనం!

ఇక నిస్సహాయంగా ఉండిపోయింది.

ఇన్నేళ్ల తర్వాత ఇలా.. ఈ ప్రమాదం కారణంగా కొడుకు కుటుంబంలోకి ప్రవేశించింది కళమ్మ.

'అపూర్వకు స్టౌ అంటుకుంది. ఒళ్లంతా కాలింది. ప్రాణాపాయ స్థితిలో ఉంది' అని వికాస్ ఫోన్ చేసినా భర్త ఓ పట్టాన ఒప్పుకోలేదు.

"మీ పంతాలను తగలెయ్య. మీరు మనుషులా, రాక్షసులా? దేవుడు పొరపాటున ఆ గుండె స్థానంలో పెద్ద బండేదో పెట్టినట్టున్నాడు. అవతల కోడలు చావుబతుకుల్లో ఉంది. చూసొస్తానంటే కూడా వద్దంటారు? మీ ఇష్టమొచ్చింది చేసుకోండి. నే వెళుతున్నా" అంది.

"కళా..!"

గడప దాటబోయిన కళమ్మ ఆగిపోయింది, భర్త పిలుపుతో. గతం తాలూకు కరుకుతనం లేని ధ్వని స్పష్టంగా వినిపించింది ఆ పిలుపులో.

వెనుదిరిగి చూసిందామె.

"వెళ్లాక ఫోన్జెయ్యి, డబ్బులు తీసుకెళ్లు" తలదించుకొనే అన్నాడు వెంకటేశ్వరరావు.

ఆమె కళ్లవెంట నీళ్లు జలజలా రాలుతుండగా బరువైన గుండెతో బయటకు నడిచి, బస్సెక్కి తాటికొండ చేరుకొంది.

"కూర్చోండి ఆంటీ. అలా ఎంతసేపు నిలబడతారు? " అప్పటిదాకా అపూర్వకు సపర్యలు చేస్తున్న రంజిత, కళమ్మను అభ్యర్థించింది. ఆమె మాటలతో ఈ లోకంలోకొచ్చిన కళమ్మ "మీరెవరు? " అనడిగింది.

"నా పేరు రంజిత. సార్‌వాళ్ల కాన్వెంటులో టీచర్‌గా పనిచేస్తున్నాను" వినమ్రంగా చెప్పింది.

రంజితను నఖశిఖ పర్యంతం పరిశీలించింది కళమ్మ.

"అసలెలా జరిగింది? "

"నాకూ పూర్తిగా వివరాలు తెలియవు ఆంటీ"

"డాక్టరుగారేం చెప్పారు? "

"తెలియదు"

ఇద్దరి మధ్యా మరో పది నిమిషాలు గడిచాయి.

రాజారావు, వికాస్ లోపలికి రాబోయి.. అక్కడ తన తల్లి ఉండటంతో రాజారావు బయటే ఆగిపోయాడు. వికాస్ మాత్రం లోపలికి వచ్చి, "ఎంత సేపవుతోందమ్మా వచ్చి? " అనడిగాడు.

"అరగంట"

తన భుజంపై పడుకొని ఉన్న విహితను కళమ్మకు అందించాడు వికాస్. వెంట తెచ్చిన సామగ్రిని రంజితకు ఇచ్చి, సర్ద మని పురమాయించాడు.

★ ★ ★

మాధవయ్య, పార్వతి భోంచేస్తున్నారు. మాధవయ్య భార్య భాగ్యమ్మ వడ్డిస్తోంది.

రెండుమూడు సంబంధాల గురించి తన భార్యకు చెబుతున్నట్లుగా పార్వతికి అర్థమ య్యేలా ప్రస్తావిస్తున్నాడు మాధవయ్య. అబ్బాయిల గుణగణాలు, చదువు, ఆస్తి, అంతస్తు.. ఇలా వివరించి చెబుతున్నాడు.

పార్వతికి ముద్ద మింగుడు పడటం లేదు. అసహనంగా, భయంగా ఉంది.

ఎలా చెప్పాలి తన 'ఇష్టం' గురించి?

చెబితే ఏమవుతుంది? మావయ్య ఒప్పు కుంటారా? గతంలోలా ఇప్పుడు కక్షల్లేవు కదా!

ఏమో! ఎప్పటికైనా వాళ్లు ప్రమాదకర మైన వ్యక్తులేనని అభ్యంతరం చెబితే? 'పోయి పోయి వాడే దొరికాడా నీకు? ' అంటూ గర్జిస్తే! 'బద్ధశత్రువు కొడుకే దొరి కాడా నీకు? ' అంటూ ప్రశ్నిస్తే!

అన్నీ ప్రశ్నలే. తన వద్ద సమాధానం లేదు.

మరి గట్టెక్కేదెలా?

"నాన్నా.. అమ్మా.. నేనొచ్చేశానోచ్!"

మాధవయ్య, భాగ్యమ్మ, పార్వతి గభాల్న అటు చూశారు.

అపూర్వ!!

బ్యాగ్‌ను మంచం మీద పడేసి ఇంట్లోకి పరుగెత్తుకొచ్చింది అపూర్వ.

మాధవయ్య, భాగ్యమ్మ అపురూపంగా చూశారు కూతురి వైపు. పార్వతికి పోయిన ప్రాణమేదో తిరిగొచ్చినంత సంబ రమయింది. టైట్ జీన్స్, టీ షర్ట్ ధరిం చిన అపూర్వ ఆ సమయంలో దేవతలా కనిపించింది.

తండ్రి వద్ద మోకాళ్లపై కూచొని, 'ఆ..' అంటూ నోరు తెరిచింది అపూర్వ.

మాధవయ్య, కూతురి నోట్లో ముద్ద పెట్టాడు ఆప్యాయంగా.

> **కొత్తగాలి...**
>
> **రాజకీయం**
> **ఆరిపోని రావణకాష్టం**
> **నమ్ముకున్న ప్రజలు**
> **కాలీకాలని సమిధలు**
>
> – శైలజామిత్ర,
> హైదరాబాద్

"ఏమేవ్, ఈ పల్లెటూరు వచ్చేటప్పుడైనా ఎంచక్కా చీర కట్టుకు రావచ్చు గదే? ఊళ్లో అందరూ నిన్ను వింతగా చూళ్లేదూ? " భాగ్యమ్మ చిరాకు పడింది.

"ఏమీ చూడరు. నా కూతుర్ని అబ్బు రంగా చూస్తారు. అసలు మా అపూర్వను చూడటమే వారి అదృష్టం" కూతురికి కాపు కాశాడు మాధవయ్య.

"సెలవులెన్నాళ్లమ్మా? " మాధవయ్య అడిగాడు.

"పది రోజులు నాన్నా"

"ఈ పదిరోజులైనా కడుపు నిండా తిని, కంటి నిండా నిద్రపో తల్లీ"

"అంతేగానీ, పరీక్షలెలా రాసిందో కను క్కోరా? " అంది భాగ్యమ్మ.

"నిజమే నాన్నా, ఎగ్జామ్స్ ఎలా రాశానో అడగరేంటి? "

"అక్కర్లేదమ్మా, నాకు ర్యాంకుల మీద నమ్మకం లేదు. బాధ్యత తెలిసినదానివి. శక్తివంచన లేకుండా చదువుతావన్న నమ్మకం నాకుంది"

"థాంక్యూ నాన్నా. మీ నమ్మకాన్ని వమ్ము కానివ్వను"

మాధవయ్య, భాగ్యమ్మల ఒక్కగానొక్క కూతురైన అపూర్వ హైదరాబాద్‌లో ఉండి, ఎమ్మెస్సీ చదువుతోంది.

"ఏం పారూ.. ఎలా ఉన్నావ్? " పార్వతి బుగ్గపై చిటికె వేస్తూ అడిగింది అపూర్వ.

"బానే ఉన్నా" పార్వతి ముక్తసరి జవాబు.

"అది నీకంటే పెద్దదే. ఎన్నిసార్లు చెప్పాలి, పేరు పెట్టి పిలవొద్దని? " భాగ్యమ్మ మందలింపు.

"సారీ మమ్మీ. అలవాటైపోయింది"

"పోనీలేవే. చిన్నప్పట్నుంచీ ఫ్రెండ్స్‌లా తిరిగారు. అదిమాత్రం దీనికంటే ఏమంత పెద్దది? " మాధవయ్య సమర్థింపు.

"సర్లే. డ్రెస్ మార్చుకొని, స్నానంజేసిరా. నీకిష్టమైన పప్పుపులుసు చేశాను" అంది భాగ్యమ్మ.

"అలాగే అమ్మా, అయిదు నిమిషాల్లో వస్తా"

అపూర్వ అలా వెళ్లగానే, పళ్లెంలో చేతులు కడిగేసింది పార్వతి. వడివడిగా అపూర్వ గదిలోకి నడిచింది. వెనకనుంచీ నిశ్శబ్దంగా వెళ్లి, అపూర్వ కళ్లు మూసింది. అపూర్వ పార్వతిని గభాల్న ముందుకు లాక్కొని గట్టిగా కౌగిలించుకుంది.

ఇద్దరూ పెద్దగా నవ్వుకున్నారు.

"అవునూ, నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధి రాదా? ఇక లైఫ్‌లాంగ్ ఇలాగే అఘోరి స్తావా? " అపూర్వ కోప్పడింది.

అర్థం కాలేదు పార్వతికి.

ఏమిటన్నట్లు చూసింది అపూర్వ వైపు.

"మొహాన బొట్టు లేకుండా ఉండొద్దని నీకెన్నిసార్లు చెప్పాను? ఇంకా అర్థంలేని పద్ధతుల్ని పట్టుకుని వేలాడతావేం? "

"అదా, పోన్లే అప్పూ, ఇలాగే అలవాటు"

"అలవాటా? ఆవకాయా? రేపట్నుంచి ఇలా కనిపిస్తే చంపేస్తా"

"సర్లేవే! ఏమిటి విశేషాలు? "

"నా దగ్గరేముంటాయి? ఉంటే గింటే సాహిత్యానికి సంబంధించిన కబుర్లుం టాయి. అవంటే నీకు అలర్జీ. కాబట్టి నువ్వే చెప్పాలి. మన ఊరు ఎలా ఉంది? ఏమైనా విశేషాలున్నాయా? "

"ఓ! బోల్డన్ని విశేషాలు. మన ఊరి ప్పుడు ప్రశాంతంగా ఉంది. మునుపటిలా కొట్లాటలూ, చంపుకోవటాలూ లేవు. ఏవో చిన్న చిన్న గొడవలు తప్ప యుద్ధాలకు దూరంగానే ఉంటున్నారు"

అపూర్వకు ఆశ్చర్యం కలిగింది.

గ్రామ కక్షలకు తన భర్త బలయ్యాక, పార్వతి ఊరిమీద ఒక రకంగా అసహ్యం పెంచుకుంది. గడిచిన రెండేళ్లలో అపూర్వ సెలవులకు చాలాసార్లు ఇంటికొచ్చింది. కానీ ఎప్పుడూ పార్వతి ఊరి విశేషాలను ప్రస్తావించేది కాదు. అపూర్వ ప్రస్తావిం చినా కసురుకునేది.

అలాంటిది ఇప్పుడు తనే కల్పించుకొని మరీ కబుర్లు చెబుతోందంటే.. ఏదో విశేషం ఉంది. పరిశీలనగా చూసింది పార్వతి వైపు.

"ఏమిటే, అలా చూస్తున్నావ్? "

"ఏంలేదు. నీలో ఏదో మార్పు కన్పి స్తోందే? "

కొద్దిగా కంగారు పడింది పార్వతి.

"ఏమిటి? సన్నబడ్డానా? "

## రాణిగారికి ఆపిల్ పండు!

బ్రిటన్‌లోని డెవన్ అనే ఊరిలో మోరిష్ నలభై అయిదేళ్లుగా తన తోటలో ఆపిల్స్ పండిస్తున్నాడు. పెయింటర్, డెకొరేటర్ అయిన అతను 2006లో ఓ రోజు ఎర్రటి ఆపిల్ పళ్లని చెట్టు నుంచి తన వదినకి పంప



డానికి కోస్తున్నాడు. ఆశ్చర్యంగా ఓ పండు సగం ఎరుపు, ఆకుపచ్చ రంగులో కొమ్మ నుంచి వేలాడుతూ కనిపించింది.

'బ్రిటిష్ ఇండిపెండెంట్ ఫ్రూట్ గ్రోయర్స్ అసోసియేషన్' ఛైర్మన్ జాన్ బ్రిజ్ ఆ పండును కోయక ముందే స్వయంగా వచ్చి పరిశీలించాడు. సగటున పది లక్షల ఆపిల్స్‌లో ఒక్కటి మాత్రమే అలా రెండు రంగుల్లో ఉంటుందని అతను డైలీ మెయిల్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పాడు. అయితే ఒకే కొమ్మకి కాసిన వాటిలో ఒకే ఒక్క పండు ఇలా రెండు రంగుల్లో ఉండటం అరుదనీ, కొమ్మకి కాసిన పళ్లన్నీ ఇలా రెండు రంగుల్లో ఉండటం గతంలో తను చూసానని చెప్పాడు. పండుకి ఓ వైపు ఎండ పడి, మరోవైపు పడకపోతే ఇలా రెండు రంగుల్లో కాస్తుందని వృక్ష శాస్త్రవేత్త జిమ్ ఆర్చురీ చెప్పాడు. అయితే ఇలా గీత గీసినట్లుగా సగానికి ఆపిల్ పండు రెండు రంగుల్లో ఉండటం మాత్రం అరుదైన విషయమేనని అన్నాడు. మోరిష్ ఆ పండుని తమ రాణికి బహుమతిగా తీసుకెళ్లి ఇచ్చాడు.

'ఇది రాణులు తప్ప సామాన్యుల కోసం పండిన పండు కాదు' అంటూ వినయంగా ఆవిడకి ఆ అరుదైన ఆపిల్‌ను సమర్పించాడు.

---

"కాదు లడ్డుముక్కలా ఉన్నావ్. కొరుక్కు తినబుద్ధవుతోంది"

"సర్లే, ముందు స్నానం చేసిరా. నీతో చాలా విషయాలు మాట్లాడాలి" పార్వతి.

"పర్సనల్లా? జనరల్లా? "

"గ్లోబల్. ముందు స్నానానికెళ్లవే"

తన చేతిలోని టవల్‌ను కింద పడేస్తూ, "వెళ్లనంటే వెళ్లను. నా ప్రశ్నకు సమాధానం చెబితేనే వెళతా" అంది అపూర్వ.

"అబ్బా మొండిఘటం. పర్సనలే"

"వావ్. ఎన్నాళ్లకెన్నాళ్లకి నీ కళ్లలో సంతోషం చూస్తున్నానే! చెప్పు చెప్పు.. ఎవరా రాకుమారుడు? ఏమా కథ? "

"నువ్వు స్నానం చెసొస్తే.."

"చంపేస్తా. చెబుతావా లేదా? "

"చెబుతా తల్లీ, చెబుతా"

ఇద్దరూ మంచంమీద కూచున్నారు. పార్వతి చెప్పటం ప్రారంభించబోయి, అనుమానంగా "కానీ.." అంటూ ఆగిపోయింది.

"ఏమిటి సందేహం? "

"మామయ్యకు నచ్చుతుందో.. లేదో.."

"కచ్చితంగా నచ్చుతుంది. ఆయన్ని ఒప్పించే బాధ్యత నాకొదిలెయ్" భరోసా ఇచ్చింది అపూర్వ.

ఇక చెప్పటం మొదలుపెట్టింది పార్వతి.

★ ★ ★

మనవరాలిని చేతుల్లోకి తీసుకోగానే, కళమ్మ మనసులో ఏదో కదిలినట్లయింది. ఆత్మీయ కుసుమమొకటి తన ఒడిలో అమాంతం వికసించి, దాని తాలూకు పరిమళం శరీరమంతా ఆక్రమిస్తున్నట్లుగా పులకించిపోయింది.

విహితను ముద్దుల్తో ముంచెత్తుతూ, మరీ మరీ గుండెలకు హత్తుకుంటోంది.

తన వెనకే వచ్చిన రాజారావు బయటే ఆగిపోయాడని గ్రహించాడు వికాస్.

తనూ బయటికొచ్చి, "రాజా, అమ్మ వచ్చింది" అన్నాడు.

"చూశా" రాజారావు కంఠం నూతిలో ఉంది.

"బుద్ధుందా? చూసే బయటుండిపోయావా? "

"ఏం చెయ్యను మరి? "

"లోపలికొచ్చి పలకరించు"

"ఎలా పలకరించనురా? ఏ మొహం పెట్టుకొని ఆమెను పలకరించను? " రాజారావు కుమిలిపోతున్నాడు.

వికాస్ మౌనంగా అతనివైపు చూస్తుండిపోయాడు.

"అయిదేళ్ళ తర్వాత అవసరానికి వాడుకోవటానికి నిన్ను పిలిచానమ్మా అని చెప్పనా ఆమెతో? " బొంగురుపోయిన గొంతుతో ప్రశ్నించాడు రాజారావు.

వికాస్ అతని భుజంపై తడుతూ, "ఆమె అమ్మరా! అవసరమున్నా లేకున్నా ఆత్మీయతను పంచిపెట్టగల తల్లిరా" అంటూ అతన్ని పట్టుకొని పైకి లేపాడు.

భుజం మీద చెయ్యేసి గదిలోకి నడిపించుకుపోయాడు. మొహాన్ని రెండు చేతుల మధ్య దాచుకొని, పొగిలి పొగిలి ఏడుస్తూ లోపలికొస్తున్న కొడుకుని చూసి, కళమ్మ నిగ్రహం కోల్పోయింది. మనవరాల్ని ఎడమచేత్తో భుజాన్న వేసుకొని, గబాగబా వచ్చి కొడుకుని కౌగిలించుకుంది.

"రాజా.. నా రాజా.." అంటూ ఆమె కూడా ఏడుపు మొదలెట్టింది. రాజారావు పసిపిల్లాడిలా మారిపోయాడు. వీరిద్దరినీ చూసి బెదిరిపోయిన విహిత పెద్దపెట్టున ఏడుపందుకుంది.

"అమ్మా.. రాజా.. ఊరుకోండి. మీరేడుస్తుంటే పాప కంగారు పడుతోంది. అపూర్వకు కూడా డిస్టర్బెన్స్" వికాస్ వారిని మందలించటంతో, కొద్దిగా శాంతించారు.

ఇద్దరూ నిస్సత్తువగా గోడవారన జారగిలబడి కూచున్నారు.

కొద్దిసేపటి తర్వాత-

"ఎలా ఎలా జరిగిందిరా ఈ ఘోరం? " గొంతు పెగల్చుకుంటూ అడిగింది కళమ్మ.

"మీరు మాట్లాడుతుండండి. నేను టీ తీసుకొస్తా. రంజితా మేడమ్, ఫ్లాస్క్ ఇవ్వండి."

ఫ్లాస్క్ తీసుకొని వికాస్ బయటికి వెళ్లిపోయాడు.

కళ్లు తుడుచుకొని, కష్టం మీద గొంతు విప్పాడు రాజారావు.



**3**

**మి**నపకల్లంలో పదిహేను మంది కూలీలు పని చేస్తున్నారు. మాధవయ్య దగ్గరుండి, పనులు పర్యవేక్షిస్తున్నాడు.

ఆయనకు మధ్యాహ్నభోజనం క్యారియర్ తీసుకువచ్చింది పార్వతి. ఆమె పొలం వైపు రావటం అరుదు. సాధారణంగా భాగ్యమ్మే భోజనం తీసుకొస్తుంది. ఆ రోజు ఆమెకు ఒంట్లో బాగాలేకపోవటంతో పార్వతి వచ్చింది.

పొలంలో కాసేపు అటూ ఇటూ తిరిగింది. కల్లం చేస్తున్న కూలీలను పలకరించింది. కల్లంలోంచి బాగా దుమ్ములేచి,

పార్వతి మీద పడుతుండటంతో మాధవయ్య ఆమెను ఇంటికెళ్లి పొమ్మంటూ గొడవ పెట్టాడు.

ఆమె ఇంటి ముఖం పట్టింది.

బిక్కుమళ్ల చెరువు దాటి, డొంకలోకొచ్చింది. డొంకలోంచి మెయిన్‌రోడ్డు ఎక్కాలంటే చిన్నవాగు దాటాలి. దాని మీదగా రెండు తాటి బద్దలు వేసి వున్నాయి. వాటి మీంచి నడుస్తుండగా కాలుజారింది.

అమాంతం వాగులో పడిందామె.

అదృష్టవశాత్తూ నీళ్లు తక్కువగా ఉండటంతో పడిన వెంటనే లేచి, నుంచుంది. ధైర్యం తెచ్చుకొని ఒడ్డువైపు అడుగు వేసింది. అంతే, కాలు జర్రున బురదలోకి కూరుకుపోయింది. ఊబి ఉండటంతో ఆమె కాలు తీసి, కాలు వేయలేకపోతోంది. ఆమె గుండె ఝల్లుమంది. వెన్నులో భయం మొదలైంది. కనుచూపు మేర ఎవ్వరూ కనిపించటం లేదు.

కాళ్లు రెండూ అంతకంతకూ కూరుకుపోతున్నాయి. ఎలాగైనా ముందుకు కదలాలని విశ్వప్రయత్నం చేస్తోంది.

అయిదు నిముషాలు గడిచాయి. ఒళ్లంతా చెమట్లు పట్టాయి.

ఆమెలో శక్తి సన్నగిల్లింది. నీరసం ఆవహిస్తోంది. సూర్యుడు నడినెత్తినున్నాడు.

ఆ దారివెంట ఎవరో ఒకరు రాకపోతారా, తనను రక్షించకపోతారా అన్న ఆశ అడుగంటుతోంది.

సరిగ్గా ఆ సమయంలో...

'ఏమండీ, ఎడంపక్కకి రండి. ముందు కొద్దు...' అనే మాటలు వినిపించాయి.

తలెత్తి, ఆ మాటలు వినిపించినవైపు చూసింది. తనకు కుడివైపు కొద్ది దూరంలో కావిడి కిందపడేసి పరిగెత్తుకొస్తూ కనిపించాడో వ్యక్తి.

పార్వతి ప్రాణం లేచొచ్చింది. అతను దగ్గరగా వచ్చాడు. "మీరు అరడుగు కూడా ముందుకు వెయ్యొద్దు. అక్కడ ఊబి వుంది. మెల్లగా కుడివైపు రండి"

"లేదండీ.. కాళ్లు పూర్తిగా కూరుకుపోయాయి" ఆమె గొంతు ఆమెకే కొత్తగా అనిపించింది.

"ఒక్క నిముషం.. ఇప్పుడే వస్తా" పరుగెత్తుతూ వెళ్లి, కడవ, బిందె తొలగించి, కావడి బద్ద తెచ్చాడు. తాటిబద్దలపై ఒకకాలు, వాగు ఒడ్డుపై మరో కాలు ఉంచి, కావడి బద్దను ఆమెకందించాడు.

ఆమె దాని ఊతంతో గట్టిగా ప్రయత్నించి కాళ్లు కదపగలిగింది. మెల్లగా అడుగులు వేసుకుంటూ అతను చెప్పినట్లు నడిచింది. వాగు ఒడ్డువైపు చేరుకుంది. అతను అటువైపు వచ్చి, తన చేతినందించాడు. ఒడ్డుమీదికి ఎక్కేసరికే ఆమె మొహం చెమటతో తడిసిపోయింది. విపరీతంగా గస పెడుతోంది.

"ఇలా రండి. అక్కడ రేవుంది. కాళ్లు, చేతులు కడుక్కొందురు గానీ" అన్నాడు.

అప్పుడు చూసుకుంది తన అవతారం.

చీరంతా తడిసిపోయింది. మోకాళ్ల కింద బురద పేరుకుపోయింది. ఆమె అతని వెంట నడిచింది.

రేవులో దిగి కాళ్లూచేతులు, మొహం శుభ్రంగా కడుక్కొంది. తిరిగి ఒడ్డెక్కి నడుస్తున్నప్పుడు గానీ తెలియలేదు, కాళ్లలో

## కొత్తగాలి...

**వెట్టిచాకిరిలో**
**చిట్టిచేతులెన్నో**
**పనికొలిమిలో**
**కాలుతున్న బాల్యాలెన్నెన్నో**

– పట్ల యాదగిరి,

*గుండాల, నల్గొండ జిల్లా*

దిగిన ముళ్ల బాధ.

ఆమె సరిగా నడవలేకపోతున్న విషయం గమనించి, "ముళ్లు దిగాయా?" అడిగాడతను.

ఆమె ముందుగా తల నిలువుగా ఊపి, వెంటనే అడ్డంగా తిప్పింది.

"మొహమాట పడకండి. పిచ్చిముళ్లు కదా.. విరిగుంటే వెంటనే తీసేస్తే మంచిది. ఇలా రండి, ఈ చెట్టు కింద కూచుందాం" అంటూ అతను ఆమె ప్రతిస్పందన కోసం చూడకుండా చెట్టుకిందకు నడిచాడు.

అసంకల్పితంగా అతన్ని అనుసరించింది.

"కూచోండి"

ఆమె కూచోగానే అతను నేర్పుగా ఆమె కుడికాలిని తన ఒళ్లోకి తీసుకొని, మెళ్లో ఉన్న తెల్లకండువాతో పాదాన్ని శుభ్రంగా తుడిచాడు. ఉమ్మి రాశాడు.

మొలతాడు నుంచి పిన్నీసు తీసి, ముళ్లు తీసే పనిలో నిమగ్నమయ్యాడు.

పార్వతికి ఇదంతా కలలా ఉంది. అతని స్పర్శ ఆమె లోలోపల సమాధి అయిన ఏ సున్నితభావాలకో ప్రాణప్రతిష్ఠ చేస్తోంది. మూసుకుపోయిన తలుపులేవో తెరుచుకుంటున్నట్లు వింత అనుభూతి కల్గిస్తోంది.

తనపాదం మీదుగా ఒంగి, ముల్లు తీస్తున్న అతన్ని గమనించింది. మొహంలో ఏ భావాలూ లేవు. రోగికి శస్త్ర చికిత్స చేస్తున్న వైద్యుడిలా కనిపించాడు.

మూడు ముళ్లు తీసేసి, అక్కడ మళ్లీ ఉమ్మిరాసి, చేత్తో గట్టిగా ఒత్తి, "ఒక రోజంతా కాస్త నెప్పి ఉంటుంది. అంతకు మించి బాధ ఉండదులెండి" అంటూ అతను ఆమె పాదాన్ని పక్కన పెట్టాడు.

ఆమె అతన్నే గమనిస్తూ కూచుంది.

"అవును, మీరు మాధవయ్య గారి మేన కోడలు కదూ!"

ఆమె అవునన్నట్లు తలూపింది.

"నన్ను గుర్తుపట్టారా?"

"......"

"కష్టంలెండి. మీ పెళ్లికొచ్చాలెండి. పనులన్నీ నా నెత్తినే వేశారు. దర్జాగా కుర్చీలో కూర్చొని పెళ్లి చూద్దామంటే.. కుదిరితేనా? ఇంతకీ నేనెవరో మీకు తెలియదు కదూ.. నారాయణ గారబ్బాయిని."

"నారాయణ అంటే.." ఆమె అర్థోక్తిలో ఆగింది.

"సర్పంచి లేడూ.. ఆయన చిన్న కొడుకుని. మా చిన్నాన్న గారబ్బాయినేగా మీరు చేసుకుంది. ప్చ్.. దురదృష్టం!"

"ఏం చేస్తాంలెండి.. అంతా నా ఖర్మ"

"ఆ.. ఆ.. మీ దురదృష్టం కాదు. మా నాన్న, మీ మావయ్య.. వాళ్ల తొత్తుగాళ్ల అరాచకం. అసలు వాళ్లు మనుషులు కాదండీ.." అమాయకత్వంతో కూడిన ఆగ్రహం అతని మాటల్లో!

"పోన్లెండీ, ఇప్పుడవన్నీ లేవుగా!" కొంచెం ఆగి, "మీరెప్పుడూ మా ఇంటికి రాలేదా, ఆయనుండగా?"

"లేదండీ, నాకెక్కడ కుదుర్తది? రేయింబవళ్లు ఈ పొలం పనే సరిపోద్ది" ఆ మాటలంటూ అతను చేతులు పైకెత్తినప్పుడు మెలితిరిగిన కండలు, అతని కష్టాన్ని స్ఫురింపజేశాయి.

"అవును, ఇంతకీ వాగులో ఎలా పడ్డారు?"

"మావయ్యకు అన్నం ఇచ్చి వస్తున్నా. కాలు తడబడి, గభాల్న జారిపడ్డా"

"నేనీ పక్కనే పత్తిచేనుకు మందేస్తున్నానండీ. నీళ్లకోసం వాగు కాడికి వచ్చా. మీరక్కడేదో ఇబ్బంది పడుతున్నారనిపించి, పరుగెత్తుకొచ్చా" అతని మాటల్లో సహజ పరిమళం గుబాళిస్తోంది.

అపూర్వతో ఇదంతా చెప్పటం ఆపింది పార్వతి.



"అతన్ని నేను కూడా ఎప్పుడూ చూడ లేదే" అపూర్వ అనుమానం వ్యక్తం చేసింది.

"పేద్ద.. నీకు ఊరు ఊరంతా పరిచయ మైనట్లు.."

"అతనేం చదువుకోలేదా? "

"పెద్దగా చదువుకోలేదు. సర్పంచికి మొత్తం నలుగురు పిల్లలు. ఆఖరివాడ తను. ఎందుకోగానీ, ఇతన్ని ఆ యింట్లో పాలేరులా చూస్తారు. పొద్దస్తమానూ

పొలానికే పరిమితం చేస్తారు. బహుశా తెలివి తక్కువ వాడని కావచ్చేమో!"

"పేరు? "

"మహేష్"

"ఆ తర్వాత మీరిద్దరూ కలవలేదా? "

"ఆరేడు రోజుల తర్వాత అనుకుంటా.. తాటికొండ ఆస్పత్రికి వెళ్తుంటే బస్సులో కనిపించాడు."

"పలకరించాడా? "

"లేదు. నవ్వాడు"

"సో.. అమ్మాయిగారు మొత్తానికి ప్రేమలో పడ్డారు. నీ సంగతి సరే, అతనికి నీపై ఎలాంటి అభిప్రాయముంది? "

"స్పష్టంగా తెలియదు. కానీ నేనంటే ఇష్టమే"

**కొత్తగాలి...**

**పిడుగు**
**అమెరికా నెత్తిన**
**పగుళ్లు**
**ప్రపంచమంతా**

– వి.సుబ్బారావు,
అనకాపల్లి

"ఎలా చెబుతున్నావ్? "

"మొన్న రామాలయం దగ్గర ఉత్సవాలు చూద్దామని వెళ్లాను. అతను కనిపించాడు. అక్కణ్నించి వచ్చేటప్పుడు ఎవ్వరూ చూడకుండా నాకో గులాబీ పువ్వునిచ్చాడు"

ఆలోచనలో పడింది అపూర్వ.

"అప్పూ.. నిజానికి నేనసలు మళ్లీ సుఖపడాలని కలలో కూడా అనుకోలేదు. కానీ ఏ క్షణాన మహేష్ పరిచయమయ్యాడో.. నా మనసు అదుపు తప్పింది. మమ్మల్ని కలిపే బాధ్యత నీదే. ప్లీజ్, ఈ ఒక్క సాయం చెయ్యవే" అభ్యర్థించింది పార్వతి.

నిజమే.. మొన్నమొన్నటి దాకా జడపదార్థంలా బతికిన పార్వతి, ఇప్పుడు జలపాతంలా కనిపిస్తోంది.

ఆ ప్రవాహం ఆగిపోకూడదు.

అపూర్వ ఒక నిర్ణయానికొచ్చింది.

★ ★ ★

గతానికి మాటలు పేరుస్తున్నాడు రాజారావు.

"నేనీ మధ్య కాన్వెంటు పనులపై బయట ఎక్కువగా తిరగాల్సి వస్తోంది. అయిదో తరగతి పిల్లల్ని నవోదయకు, ఏడో తరగతి పిల్లల్ని ఎ.పి.ఆర్.ఎస్.కి ఎంట్రన్స్ రాయిస్తున్నాం. అదీగాక, జిల్లా రూరల్ కాన్వెంట్స్ అసోసియేషన్‌కు నేను సెక్రటరీగా ఎన్నికయ్యాను. ఆ మీటింగుల కోసం తరచూ గుంటూరు వెళ్లాల్సి వస్తోంది. దాంతో తను కొంచెం గొడవ చెయ్యటం మొదలుపెట్టింది.." ఒక్కొక్క మాట కూడబలుక్కుంటూ చెబుతున్న రాజారావునే చూస్తోంది కళమ్మ.

"పెద్ద కాంపౌండు కావటంతో రాత్రిపూట తనొక్కతే పడుకోవాలంటే భయమేస్తోందని చెబుతూ వచ్చింది. నేను సర్ది చెప్పి, సముదాయించేవాణ్ని. అయినా తనలో అసంతృప్తి పెరిగిపోయింది. అది గమనించే ఎప్పటికప్పుడు తిరగటం తగ్గించాలని ప్రయత్నించాను. వీలు కాలేదు. అనివార్యంగా ఆరోజు గుంటూరు వెళ్లాల్సి వచ్చింది. సాయంత్రం పెందలాడే తిరిగి రాకపోతే ఊరుకోనని మరీమరీ హెచ్చరించింది. కానీ నా టైమ్ బాగోక, ఆ రాత్రి అక్కడే ఉండిపోవాల్సి వచ్చింది"

కళమ్మ కొడుకు కళ్లలోకి అనుమానంగా చూసింది. జీవితంలో చాలా ఎదురుదెబ్బలు తినివుందామె. ఏ విషయాన్నైనా నాలుగు కోణాల్నుంచీ విశ్లేషించుకోగలదు. మంచిచెడులను బేరీజు వేయగలదు.

రాజారావు కళ్లల్లో ఆవిడకు ఏ భావచి

త్రాలూ పట్టుబడలేదు.

"వెంటనే వికాస్‌కు ఫోన్జేశాను. రాత్రికి తనకు తోడుగా పడుకోవాలని చెప్పాను. 'ఏవిట్రా నీకంత రాచకార్యాలు' అంటూ వాడు కూడా నన్నే కోప్పడ్డాడు. అసోసియేషన్ పని గురించి చెప్పి, తెల్లవారే సరికల్లా ఇంట్లో ఉంటానని చెప్పాను. అన్నట్లే తెల్లారగట్టే నేను ఇంటికి చేరుకున్నా.."

"అప్పటికే ఇదంతా జరిగిపోయిందా?" రాజారావు మాటలకు అడ్డొస్తూ అడిగింది కళమ్మ. ఆమె అనుమానం వికాస్ మీదికి మళ్లింది.

"లేదు. నేను రాగానే వికాస్ వెళ్లిపోయాడు. తను గదిలో పాలు కాగబెడుతుంటే, నేను బయట కూచొని పేపరు చదువుకుంటున్నా. కాసేపట్లోనే ఒక్కసారిగా మంటలు లేచాయి.."

"అంతకుముందు ఇద్దరికీ గొడవైందా?"

"తను నాపై బాగా కోప్పడింది. ఇలాగైతే సంసారం చెయ్యటం నావల్ల కాదంటూ పెద్దగా అరిచింది. నేను మౌనంగా ఉండిపోయాను" రాజారావు మాట బలహీనపడింది.

కళమ్మ ఆలోచనలు రకరకాలుగా సాగుతున్నాయి. ఎవర్ని అనుమానించాలో తేల్చుకోలేకపోతోంది. ఆమెకు తన కొడుకు కన్నా వికాస్‌పైనే విశ్వాసం ఎక్కువ. 'జరిగిన సంఘటనలో అతని పాత్రేమైనా ఉందా' అనే దిశగా ఆలోచించటానికి ఆమె మనసు అంగీకరించటం లేదు.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలు

అనంతారం సెంటరు హడావుడిగా ఉంది. ఆ గ్రామానికి దగ్గరి పట్టణమైన గుంటూరు వెళ్లడానికి కొందరు బస్సు కోసం ఎదురు చూస్తున్నారు. తాటికొండ కాలేజీకి వెళ్లే యువతీ యువకులు కూడా అదే సెంటరులో నిరీక్షిస్తున్నారు. అమ్మాయిలంతా ఆ సెంటరులో ఓ దాత కట్టించిన బస్‌షెల్టరు లోపల కూచున్నారు. అబ్బాయిలు బయట నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు.

పార్వతిని వెంటబెట్టుకొని అపూర్వ కూడా బస్‌స్టేజీ వద్దకు వచ్చింది. ఆమెకు తెలుగు సాహిత్యమంటే మక్కువ. సబ్జెక్టు బుక్స్‌కన్నా ఆ పుస్తకాలే ఎక్కువ చదువుతుంది. అడపాదడపా కవిత్వం రాస్తుంది. ప్రస్తుతం సెలవులు కావటం.. ఇంటి దగ్గరే ఉండాల్సి రావటంతో పుస్తకాల అవసరం ఏర్పడింది.

తాటికొండలో శాఖా గ్రంథాలయం ఉంది. అక్కడికెళ్లి పుస్తకాలు తెచ్చుకోవటానికి బయల్దేరారు.

అదే సమయంలో ఓ యువకుడు పెద్ద పెద్ద అడుగులేస్తూ బస్‌షెల్టరు వైపు రావటం గమనించింది అపూర్వ. నలిగిపోయిన ప్యాంటు, మడతలు పడిన చొక్కా నడకలో నిర్లక్ష్యం, మొహంలో క్రూరత్వంతో వింతగా కనిపించాడతను.

"ఎవరతను?" పార్వతిని అడిగింది అపూర్వ కళ్లతోనే అతన్ని చూపిస్తూ.

"అమ్మో, పులిగాడొస్తున్నాడు" పార్వతి మాటల్లో భయం ప్రతిధ్వనించింది.

"అదేమిటే, అంత భయపడ్తున్నావ్?"

"నేను కాదు. ఇప్పుడీ సెంటరే హడలెత్తుతుంది చూడు"

"ఎందుకని?"

"అతనలా కోపంగా వస్తున్నాడంటే ఇక్కడెవరికో మూడినట్టే. ఇప్పుడు తుఫాను రావటం గ్యారంటీ.."

ఆమె మాటల్ని నిజం చేస్తూ.. సందడిగా ఉన్న అక్కడి వాతావరణంలో కలకలం మొదలైంది.

అతడొస్తూనే అపూర్వకు కొంచెం దూరంగా నిలబడి ఉన్న స్టూడెంటు కాలరు పుచ్చుకొని, విసిరికొట్టాడు. ఆ

కుర్రాడు దబ్బున వెళ్లి, రోడ్డుమీద పడ్డాడు.

పులిగాడు తాపీగా నడుస్తూ వెళ్లి, ఆ కుర్రాణ్ని పైకి లేపాడు. ఆ కుర్రాడు ప్యాంటుకంటిన దుమ్ము దులుపుకుంటుండగానే పులిగాడు లాగిపెట్టి దవడపై కొట్టాడు. మొదలు తెగిన చెట్టులా కుప్పకూలిపోయాడా విద్యార్థి.

జనమంతా పోగై చూస్తున్నారే తప్ప, ఎవ్వరూ పులిగాణ్ని వారించేందుకు సాహసించటం లేదు. వాడి విషయంలో కల్పించుకుంటే ఏమవుతుందో అందరికీ తెలుసు!

"ఏరా వేలెడంత లేవు. అప్పుడే నీకు ప్రేమపిచ్చి పట్టిందా? రాధిక వంక మళ్లీ ఎప్పుడైనా కన్నెత్తి చూస్తావా?" అంటూ మరో దెబ్బ వేశాడు పులిగాడు.

అపూర్వకు ఒళ్లు మండిపోయింది.

'ఆ కుర్రాడు తప్పు చేస్తే హెచ్చరించవచ్చు. మరీ హద్దు మీరితే పోలీసులకు పట్టించవచ్చు. అదేమీ లేకుండా గొడ్డును బాదినట్లు బాదితే సరిపోతుందా? అలా శిక్షించడానికి అతనికేం హక్కుంది?'

ఆలోచన్లతో పాటు ఆగ్రహం పెల్లుబికింది అపూర్వలో. అతడి ఆగడాన్ని అడ్డుకోవాలని ధైర్యంగా అడుగు ముందుకేయబోయింది. గభాల్న చెయ్యి పట్టుకొని ఆపింది పార్వతి. దయచేసి కల్పించుకోవద్దంటూ కళ్లతోనే అభ్యర్థించింది.

పార్వతి ఆలోచన వేరు.

రాధిక తండ్రి సర్పంచికి నమ్మినబంటు. దెబ్బలు తింటున్న కుర్రాడి తండ్రి మాధవయ్య వర్గంలోని మనిషి. ఇప్పుడు అపూర్వ గానీ ఆ కుర్రాడి తరపున వకాల్తా పుచ్చుకొని పులిగాడికి అడ్డుబోతే... రేపు ఈ ఘర్షణ మళ్లీ రెండు వర్గాల మధ్య చిచ్చుగా రూపాంతరం చెందవచ్చు. తద్వారా తను మహేష్‌కు దగ్గరయ్యే అవకాశాలు మూసుకుపోవచ్చు.

అపూర్వ నిస్సహాయంగా ఉండిపోయింది.

అదే సమయంలో అక్కడికొచ్చాడు వికాస్. వస్తూనే అక్కడ జరుగుతున్న గొడవను అర్థం చేసుకున్నాడు.

గబగబా వెళ్లి, పులిగాడి చేతుల్లోంచి ఆ కుర్రాణ్ని విడిపించబోయాడు. ఎవరనేది కూడా చూడకుండా వికాస్‌ను విసిరికొట్టాడు. కింద పడబోయి, తమాయించుకు నిలబడ్డాడు వికాస్. అతని చేతుల్లోని టిఫిన్ బాక్సు మాత్రం జారిపడింది. చపాతీలు, కూర నేలపాలయ్యాయి.

అప్పుడు గమనించాడు పులిగాడు. తనను అపబోయింది వికాస్ అని. కుర్రాణ్ని వదిలేసి, గబగబా వచ్చి వికాస్‌ను పట్టుకొని 'సారీ, సారీరా. ఎవరో అనుకుని కోపంతో తోసేసాను. ఏమనుకోకు' అంటూ కింద పడిన బాక్స్‌ను తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"పర్లేదు గానీ, ఆ కుర్రాణ్ని వదిలెయ్" అన్నాడు వికాస్.

"వీడు... వికాస్, వీడేం చేశాడో తెలిస్తే నువ్వు కూడా క్షమించవు. వీణ్ని నరికినా పాపం లేదు"

"పోన్లేరా. వయసలాంటిది. నువ్వు గట్టిగా గర్జిస్తే వాడు దడుచుకు చస్తాడు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రంలా నువ్వలా పిడిఘాతాలు విసిరితే ఏమైపోతాడు? చూడు... పాపం ఎలా వణికిపోతున్నాడో" అన్నాడు వికాస్.

"ఏం జెయ్యమంటావురా! మనకి ఆవేశం వస్తే ఆగదు. పైగా సర్పంచిగారు ఈ విషయం సీరియస్ అని చెప్పారు" గుమికూడిన జనాన్ని చెల్లా చెదురు చేస్తూ..

"ఇప్పుడే వస్తా" అంటూ బాక్స్‌తో పక్కనున్న హోటల్లోకి వెళ్లాడు పులిగాడు.

భయంతో సగం చచ్చిపోయిన ఆ కుర్రాణ్ని వికాస్ దగ్గరకు తీసుకున్నాడు. బట్టలకంటిన దుమ్ము దులిపి, నోటికంటిన

రక్తం తుడిచాడు. ధైర్యం చెప్పాడు.

"ఇలా కాలేజీకి వెళ్తే బాగోదు. ఇవ్వాల్టికి మానెయ్. పో, ఇంటికి వెళ్లిపో" అంటూ అతన్ని పంపేశాడు వికాస్.

జరుగుతున్నదంతా సినిమాలా అనిపించింది అపూర్వకు.

నిజంగానే తుపాను వచ్చి వెలిసినట్లయింది. ఆ ప్రశాంతతను భగ్నం చేస్తూ హారన్ కొడుతూ వచ్చి ఆగింది బస్సు. బిలబిలమంటూ మూగారు జనాలు.

అపూర్వ, పార్వతి కూడా బస్సెక్కేందుకు నిలబడ్డారు. జనం తోసుకుంటూ ఎక్కుతున్నారు. తనకేం హడావుడి లేదన్నట్లుగా అందరికన్నా వెనగ్గా నుంచున్నాడు వికాస్. అతనికి ముందు అపూర్వ ఉంది.

ఆమె మెల్లగా తల వెనక్కి తిప్పి అతన్ని చూసింది.

ఎట్టకేలకు జనం ఎక్కటం పూర్తయింది.

చిట్టచివరగా ఎక్కిన వికాస్ ఫుట్‌బోర్డ్ మీదే నిలబడి, డోర్ వేశాడు. పైమెట్టు మీద అపూర్వ నిలబడి ఉంది. బస్సు కదలబోతుండగా హడావుడిగా వచ్చాడు పులిగాడు.

టిఫిన్ బాక్సును బస్సులోని వికాస్ చేతికందిస్తూ, "వికాస్, మసాలా దోసె పెట్టించాను. మర్చిపోకుండా తిను" అని బస్సు వెంట పరిగెత్తుతూ చెప్పి, ఆగిపోయాడు.

వికాస్ నవ్వుకున్నాడు.

అపూర్వకు అంతా చిత్రంగా ఉంది.

ఇంతకీ పులిగాడు మంచివాడా? దుర్మార్గుడా? పార్వతి చెప్పినదాని ప్రకారం అతడో రాక్షసుడు. తాను పరిశీలించినంత వరకూ అతనికో మంచి మనసుంది.

ఏదైనా, అతని గురించి మరింతగా ఆరా తీయాలనుకుంది.

★ ★ ★

రాత్రి పదిగంటలు దాటింది.

అపూర్వ ఇంకా మత్తులోనే ఉంది.

హోటల్నుంచి వికాస్ టిఫిన్ తెచ్చాడు. కళమ్మ, రంజిత తినేశారు. కాస్త తేట పడటంతో రాజారావు కూడా నాలుగు ఇడ్లీ తిన్నాడు. వికాస్ హోటల్లోనే తిని వచ్చాడు.

కళమ్మ, రంజితలను అపూర్వ గదిలోనే పడుకోమని చెప్పి, ఓ చాప తీసుకొని కారిడార్‌లోకి వచ్చారు వికాస్, రాజారావు.

చాప పరిచి, పడుకోబోయేంతలో కళమ్మ వచ్చింది. "అమ్మాయికి ఏ రాత్రి కాడ మెలకువ వచ్చినా నిన్నే అడిగిద్ది. నువ్వే లోపల పడుకో" అంటూ కొడుకుని గదిలోకి పంపింది.

చాపను కళమ్మకిచ్చి తాను పాత దుప్పటి కింద పరుచుకొని పడుకున్నాడు వికాస్. కళమ్మ సాలోచనగా చాప మీద కూర్చుంది.

## 'వరద' చతురోక్తులు



అబ్బూరి రామకృష్ణారావుగారి కుమారులు వరద రాజేశ్వరరావు సమయస్ఫూర్తికి, హాస్య చతురతకు పెట్టింది పేరు. తన హాస్య సంభాషణలతో అందరినీ నవ్వించేవారు. వివిధ సందర్భాల్లో 'వరద' ఎక్కుపెట్టిన చతురోక్తులు..

### ముష్టిపూర్తి!

ప్రముఖ కథకులు పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి షష్టిపూర్తికి కొంత డబ్బును బహూకరించాలని పరిచయస్తుల వద్ద నుంచి పైకం పోగు చేసే కార్యాన్ని చేపట్టారు వరద. మాటల సందర్భంలో మిత్రుడు రావిశాస్త్రి, వరదతో 'షష్టిపూర్తి వసూళ్లు పూర్తయ్యాయా?' అన్నాడోసారి.

దానికి వరద 'ఆ.. షష్టిపూర్తి అయిపోయింది కానీ, ఇంకా ముష్టిపూర్తి కాలేదు' అని నవ్వుతూ జవాబిచ్చారు

"వికాస్.." చీకట్లోకి చూస్తూ పిలిచింది.

వికాస్ లేచి కూచున్నాడు. తనలో నిక్షిప్తమైన రహస్యాలేవైనా సరే.. అందించటానికి తాను సిద్ధమేనన్నట్లుగా "చెప్పండమ్మా" అన్నాడు బాసింపట్టు వేస్తూ.

"మావాడు అమ్మాయితో ఎలా ఉండేవాడు? వాళ్ల కాపురం సజావుగా ఉండేదా? "

"బానే ఉండేవాడమ్మా. ఎప్పుడు చూసినా ఒకరి మీద ఒకరు జోకులేసుకుంటూ సరదాగానే ఉండేవాళ్లు"

"నన్ను ఓదార్చటానికో, నీ ఫ్రెండును సమర్థించుకోవటానికో చెప్పొద్దు వికాస్. ఎందుకంటే నేను వాడి కన్నతల్లిని. దేవుడెందుకో వాణ్ని చిన్నచూపు చూశాడు.

కొత్తగాలి...

**పసిడి**
**నేడు**
**మాయలేడి**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

పిసరంత వక్రబుద్ధినిచ్చాడు. డిగ్రీ చదివినా వాడికి పెడపోకడలే అబ్బాయి. మమ్మల్ని కాదని వెళ్లిపోయినా, ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు కాబట్టి బాగుపడతాడనుకున్నా, దానికి తోడు అపూర్వ చిన్నప్పట్నుంచీ తెలుసు. మావాణ్ని మంచిగా తీర్చిదిద్దగలదనే నమ్మకంతో ఉన్నాను. అందుకే వాళ్ల జోలికి వెళ్లలేదు. నాకు తెలిసినంతవరకూ కాన్వెంటు నడుపుకుంటూ మర్యాదగానే బతుకుతున్నారని విన్నా.."

శ్రద్ధగా ఆలకిస్తున్నాడు వికాస్.

"వాళ్లకి నువ్వు కొండంత అండగా ఉన్నావని ఇంకాస్త భరోసాగా ఉన్నా. సంసారంలో చిల్లర పేచీలు ఏమైనా ఉన్నాయని ముందు తెలిసుంటే, మా ఆయన్ని ఎదిరించైనా సరే నా కొడుకు కాపురంలో కలగజేసుకొని ఉండేదాన్ని. ఉన్నట్టుండి కోడలు ఇంత అఘాయిత్యానికి పూనుకుందంటే వాళ్లిద్దరి మధ్యా కచ్చితంగా పెద్ద అగాధమే ఉండి ఉండాలి.."

ఆవిడ ఉద్దేశం అంతుబట్టలేదు వికాస్‌కి.

"కనీసం రోజుకోసారైనా నేను వాళ్లింటికి వెళ్లేవాణ్ని. అపూర్వ చాలా ఆనందంగా ఉండేది. అయితే ఈమధ్య ముభావంగా కనిపిస్తోంది. అడిగితే, ఏమీ లేదనేది"

"అది చాలదా? నా అనుమానమే నిజమైతే వాడు అపూర్వను చిత్రహింసలు పెట్టుండాలి.."

"ఛఛ.. మీరు దారుణంగా ఆలోచిస్తున్నారమ్మా"

"దారుణం కాదు.. నా కొడుకు పెడసరితనం మీద నాకెప్పుడూ అనుమానమే"

"ఆమెని వేధిస్తున్నాడేమోనని మీరెలా అనుకుంటున్నారు? "

"ఏముంది? మగవాడికుండే సహజ దుర్లక్షణం అనుమానమేగా!"

"అంటే.." అర్థం కానట్లు చూశాడతను.

"పెళ్లాం శీలం మీద వాడికేదో అనుమానపు జబ్బు పుట్టుంటుంది. హింసించటం మొదలు పెట్టుంటాడు"

"తప్పమ్మా! రాజా నీకు కన్నబిడ్డే అయినా నాకు ప్రాణంలాంటి స్నేహితుడు. వాడి మనసు నాకు బాగా తెలుసు. అపూర్వను వాడు ఆ దృష్టితో ఎన్నడూ చూడడు. అలా భావించేవాడే అయితే ముందుగా నన్నే అనుమానించాలి. వాడు ఉన్నా లేకున్నా అపూర్వతో చాలా సన్నిహితంగా ఉంటాను. ఎప్పుడన్నా మెస్ మూసేస్తే అపూర్వను అడిగి మరీ అన్నం పెట్టించుకు తింటాను. వాడు నిజంగా

అనుమానించేవాడే అయితే నన్ను వాడింటి ఛాయలకుక్కూడా రానివ్వడు. పైగా ఆ రోజు రాత్రి తాను రాలేకపోతున్న విషయం చెప్పి, నన్ను వెళ్లి తన భార్యకు తోడుగా పడుకోమని చెప్పాడంటే.. వాడి మనసెలాంటిదో ఆలోచించమ్మా..” అన్నాడు వికాస్. అతని మాటల్లో నిజాయితీతో కూడిన ఆవేదన ధ్వనించింది.

ఆమె ఒక్కక్షణం వికాస్ మొహంలోకి పరిశీలనగా చూసింది. వరండాలో వెలుగుతున్న లైటు వెలుతురులో అతని మొహం అస్పష్టంగా కనిపించిందామెకు.

“అలాగైతే, ఒకవేళ వాడే ఇంకేదైనా..”

“అమ్మా.. అలా లేనిపోని అనుమానపుటాలోచనల్తో బుర్ర పాడు చేసుకోకు. అంతా సవ్యంగానే ఉంది. అపూర్వకు ప్రాణప్రాయం లేదని డాక్టరు చెప్పారు. జరిగిందంతా దురదృష్టకర సంఘటనగా మర్చిపోదాం” అంటూ సర్ది చెప్పాడు వికాస్, ఆమె మాటలకు అడ్డుకట్ట వేస్తూ.

“ఎన్నాళ్లుండాలి ఆస్పత్రిలో?”

“కనీసం నెల రోజులు”

“డబ్బులు చాలా అవుతాయిగా!”

“ప్రాణంకంటే ఎక్కువ కాదు గదమ్మా”

“అలా అని కాదు.. ఎంత అవసరమవుతాయో కనుక్కొని తనకు ఫోన్ చెయ్యమన్నారు రాజావాళ్ల నాన్నగారు. అందుకే అడుగుతున్నా..”

“ఏమిటి నాన్నగారు అంతమాట అన్నారా? అంటే మా అందరి మీద ఆయనకి కోపం పోయినట్లేనా?”

“మా రాజా మీదయినా ఉంటుంది గాని, నీ మీద ఆయనకు కోపం ఉండదు వికాస్. డబ్బులు తనే తీసుకొస్తానన్నాడు”

“పోన్లేమ్మా, ఇలాగైనా అందరం కలవబోతున్నాం” అన్నాడు వికాస్ ఆనందంగా.

నవ్వింది కళమ్మ.

“ఇప్పుడిక హ్యాపీగా నిద్రపోతానమ్మా, గుడ్‌నైట్” అంటూ నిద్రలోకి జారుకున్నాడు వికాస్.

కళమ్మకు మాత్రం నిద్ర పట్టలేదు.

ఆలోచనల్లు ఆమెపైకి కెరటాల్లా దాడి చేస్తున్నాయి.

నేరగాడెవరో పసిగట్టేందుకు స్వపర భేదం లేకుండా ఆలోచించే పోలీసు అధికారిలా ఆమె దృష్టి అన్ని కోణాల నుంచీ స్కానింగ్ తీస్తోంది.

పెంచి, పెద్ద చేసిన ఓ ముసలమ్మ తప్ప ఇంకే బంధుత్వమూ లేని వికాస్, రాజారావు కలిసి చదువుకున్నారు. రాజాతో కలిసి తిరుగుతూ కళమ్మ కనుసన్నల్లో పెరిగాడు వికాస్. అయితే, పెద్దవాడయ్యాక జరిగిన ఓ కీలక పరిణామం వికాస్ కలల్ని తారుమారు చేసింది. అదో రహస్యంగా అతడి గుండెల్లోనే సమాధి అయింది. ఆ విషయం తెలిసిన ఒకే ఒక వ్యక్తి కళమ్మ.

### కొత్తగాలి...

**కాసులతో కొనలేనిది**
**త్రాసులతో తూచలేనిది**
**అవనిలో అమ్మ ఒక్కటే**

– జి. సూర్యనారాయణ,
బందలాయిచెరువు, కృష్ణాజిల్లా

కలలోనైనా కీడు తలపెట్టని వ్యక్తిత్వం వికాస్ సొంతమని కళమ్మకు తెలుసు. అయినా మరపుతెరల వెనక ఒదిగిపోయిన ఆ రహస్యం ఇప్పుడు పదేపదే బయటికి తొంగిచూస్తుండటంతో... వికాస్‌ను కూడా అనుమానపు కళ్లతో చూసింది. కానీ, అది తప్పని నిర్ధారించుకుంది.

ఆమె అనుమానం కొడుకును దాటి,

వికాస్‌ను దాటి, మరో 'వ్యక్తి'పైకి మళ్లింది. అర్ధరాత్రివేళ తన అనుమానాన్ని ధ్రువీకరించుకునేందుకు ఆమె ప్రయత్నించిన విషయం... గాఢనిద్రలో ఉన్న వికాస్‌కు తెలిసే అవకాశం లేదు!



తాటికొండలో బస్ దిగాక, ముందుగా తన పాత ఫ్రెండును పలకరిద్దామని బయల్దేరింది అపూర్వ. దారిలో పార్వతిని కొన్ని వివరాలడిగింది.

"ఆ పులిగాణ్ని అడ్డుకున్నాడే.. అతనెవరు? "

"వికాస్! అతనికి బెస్ట్ ఫ్రెండ్"

"ఎవ్వరు చెప్పినా వినని పులిగాడు అతన్ని చూడగానే అలా అయిపోయాడేమిటి? "

"ఈ ప్రపంచంలో పులిగాడు ఎవర్నికైనా భయపడతాడు అంటే.. అతను వికాస్ ఒక్కడే. ఎందుకో తెలియదుగానీ అతని మాటంటే పులిగాడికి వేదం"

"వికాస్ ఏం చేస్తుంటాడు? "

"పీజీ చదివాడు. ఈ మధ్యనే ఏదో ఉద్యోగం వచ్చిందట. అదేంటో తెలీదుగానీ రోజూ తాటికొండ వస్తుంటాడు"

ఫ్రెండు ఇంట్లో లేకపోవటంతో వాళ్ల అమ్మానాన్నలతో కాసేపు మాట్లాడి, గ్రంథాలయానికి చేరుకున్నారు అపూర్వ. పార్వతి. బయట రిజిస్టర్‌లో ఇద్దరూ సంతకం చేసి, లోపలికి నడిచారు.

లైబ్రరీ నీటుగా ఉంది. ఒక్కటే పొడవైన హాలు.. ఒకవైపు బుక్‌రాక్స్ ఉన్నాయి. మరో చివర్న పెద్ద బల్ల. చుట్టూ కుర్చీలు. బల్లమీద దినపత్రికలు, కొన్ని మేగజైన్లు ఉన్నాయి. జనం పలచగా ఉన్నారు. దృశ్య మాధ్యమం తననెంతగా దెబ్బ తీసిందో ఆ లైబ్రరీ మూగగా చెబుతున్నట్లనిపించింది అపూర్వకు.

అపూర్వ, పార్వతి బుక్‌రాక్స్‌లోని ఒక్కో పుస్తకాన్నీ పరిశీలించటం ప్రారంభించారు.

ఇరవై నిమిషాల తర్వాత ఇద్దరూ చెరో రెండు పుస్తకాలతో బయటికొచ్చారు. వరండాలో కుడివైపున చిన్న రూము ఉంది. వాకిలి పైభాగంలో గోడపై 'గ్రంథాలయాధికారి' అని రాసి ఉంది. ఇద్దరూ ఆ గదిలోకి తొంగి చూశారు.

'అధికారి' సీటు ఖాళీగా ఉంది. వరండాలో నిలబడి ఉన్న ఓ యువకుడ్ని అడిగారు. 'లైబ్రేరియన్ ఎక్కడ? ' అని.

అతను సమాధానమిచ్చాడు.

గ్రంథాలయ భవనం పక్కనే విశాలమైన అవరణ ఉంది. అపూర్వ, పార్వతి అటుగా నడిచారు. రెండు వేపచెట్ల నీడలో పాతిక మంది పిల్లలు సీరియస్‌గా ఏదో గీస్తున్నారు. వారి మధ్యలో ఓ యువకుడు అటూఇటూ తిరుగుతున్నాడు.

దగ్గరగా వెళ్లి పరిశీలించారు. ఆ పిల్లలు బొమ్మలు గీస్తున్నారు. వాటికి రంగులు వేస్తున్నారు. అందరూ పదీ పన్నెండేళ్ల లోపు పిల్లలే. చాలా ఆసక్తిగా, ఎంతో ఇష్టంగా బొమ్మలు గీస్తున్నారు.

అటూఇటూ తిరుగుతున్న యువకుడు వికాస్! అతన్ని అక్కడ చూసి ఆశ్చర్యపోయారిద్దరూ. అక్కడెందుకు ఉన్నాడో, ఏం చేస్తున్నాడో వారికి అర్థం కాలేదు.

వాళ్లు బుక్స్ తీసుకువెళ్లేందుకు తనకోసమే చూస్తున్నారన్న విషయం అర్థమై,

"రండి మేడమ్" అంటూ వారి సమాధానం కోసం చూడకుండా, తన గదివైపు అడుగులు వేశాడు. వారిద్దరూ పిల్లల్నీ, వారి బొమ్మల్నీ మార్చి చూస్తూ నెమ్మదిగా వికాస్‌ను అనుసరించారు.

వికాస్ గ్రంథాలయాధికారి గదిలోకి అడుగుపెట్టాడు. అప్పటికర్థమైంది వారిద్దరికీ, అతనే లైబ్రేరియన్ అని.

వికాస్ తన సీట్లో కూచుని "డిపాజిట్ ఉందా మేడమ్? " అడిగాడు.

"లేదండి. ఇప్పుడు తీసుకుంటాం" అంది అపూర్వ.

"ప్లీజ్, బీ సీటెడ్" అభ్యర్థించాడతను.

అతని టేబుల్‌కు ఎదురుగా ఉన్న రెండు కుర్చీల్లో కూచున్నారిద్దరూ.

వికాస్ కొత్త కార్డు రాస్తుండగా అడిగింది అపూర్వ "ఆ పిల్లలెవరు? ఇక్కడ డ్రాయింగ్ వేస్తున్నారేమిటి? "

"వాళ్లంతా ఈ ఊరి స్కూళ్లలో చదివే పిల్లలు. వాళ్లకి డ్రాయింగ్ పోటీలు నిర్వహిస్తున్నాను" అన్నాడు వికాస్.

"గ్రంథాలయం తరఫునా? " అడిగింది అపూర్వ.

సన్నగా నవ్వాడు వికాస్. అలా నవ్వినప్పుడు అతని మొహంలో ఏదో ప్రత్యేకత కనిపించింది అపూర్వకు.

"ముఖ్యమైన దినపత్రికలు, మేగజైన్లు కొనడానికే డబ్బులివ్వటం లేదు ప్రభుత్వం. ఇంకా ఇలాంటి కార్యక్రమాలు కూడానా? " నవ్వుతూనే అన్నాడతను.

"మరి? "

"నేనే నిర్వహిస్తున్నాను, నా సొంత ఖర్చుతో"

"ఎందుకలా? "

"ఎందుకేంటి మేడమ్! అదో ఆనందం" అంటూ కార్డు రాయటం పూర్తి చేసి, తలెత్తి అపూర్వ మొహంలోకి చూశాడు.

కళ్లు తిప్పుకోలేకపోయాడు. అసలే అందమైన మొహం.. దానికి తోడు 'ఆశ్చర్యం'

## టింగురంగా.. రింగురంగా?

ఓసారి అబ్బూరి రామకృష్ణారావుకు తుంటి ఎముక విరగడంతో ఢిల్లీలో కొడుకు ఇంట్లో మంచంపైనే విశ్రాంతి తీసుకుంటున్నారు. అయితే నిరంతరం బెడ్‌పైన పడుకుని వుండటం వల్ల ఆ రాపిడికి ఆయనకు మొదటి వారంలోనే బెడ్‌సోర్స్ (పుండ్లు) ప్రారంభమయ్యాయి. ఆయన చాలా బాధపడసాగారు.



దీంతో డాక్టరుగారు ఆయన నడుం కింద రబ్బరు రింగు పెట్టారు. కొన్ని నెలల తర్వాత, 'ఇక రింగు తీసేయవచ్చు. ఎలాంటి సమస్యా ఉండదు. పుండ్లు మానిపోయాయి' అన్నాడు డాక్టరు.

అబ్బూరివారు, 'ఇంకొన్నాళ్లు ఉండనీ. ఇలాగే బాగుంది' అన్నారు కొడుకు వరదతో.

దానికి వరద, 'ఏం.. రింగురంగా అని పడుకుందామనా? ' అన్నారు తను ఎంతగానో ప్రేమించే తండ్రితో ఛలోక్తిగా.

ఆమె మొహంలో కొత్త కాంతిని ప్రవేశపెట్టింది. ఆవిడింకా తనను నమ్మటం లేదని అర్థమైంది వికాస్‌కి. అందుకే వివరణ ఇవ్వాలనుకున్నాడు.

"ఇవ్వాళ్ల పిల్లలకు దక్కకుండా పోతున్న పదం ఒకటుంది. అదే సృజనాత్మకత. ఆంగ్లంలోనే అక్షరాభ్యాసంతో మొదలవుతున్న చదువు వారి నెత్తిన గుదిబండలా మారుతోంది. ఆటలేదు, పాటలేదు. ఆనందంగా విహరించే అవకాశమే లేదు. ఇంట్లో కాసేపు ఖాళీ దొరికితే బొమ్మల పెట్టె ముందు కూచుంటారు"

చిత్రంగా చూశారిద్దరూ.

"అది పిల్లల తప్పు కాదులెండి. ఇవ్వాళ ప్రతి ఇంట్లోనూ వాతావరణమే అలా మారిపోయింది. ఇంటాబయటా పిల్లల్ని వెంటాడేపదం చదువు.. చదువు! ఇంగ్లీషు కాన్వెంట్లు పిల్లల్ని సాయంత్రానికి ఉతికి ఆరేస్తున్నాయి. ఈ స్థితిని నేనొక్కణ్నే బద్దలు కొట్టాలని కాదుగానీ ఏదో నా వంతు ప్రయత్నంగా వారికి ఆటవిడుపు కోసం ఏం చేయగలనా అని ఆలోచించాను. అందులో భాగంగానే ఈ పోటీ నిర్వహిస్తున్నాను"

"అంటే.. ఇప్పుడే ప్రారంభించారా? "

"లేదండి. తొమ్మిది నెలల నుంచీ ప్రతి నెలా మూడో ఆదివారం ఒక్కో అంశంలో పోటీలు నిర్వహిస్తున్నా. ఈ పోటీ నిర్వహిస్తున్నట్లు ఓ సర్క్యులర్ తయారుచేసి, అన్ని ప్రభుత్వ, ప్రయివేటు స్కూళ్లల్లోనూ అనౌన్సు చేసి వస్తా. మొదట్లో నలుగురైదుగురు మాత్రమే వచ్చేవారు. రానురాను వాళ్ల సంఖ్య బాగా పెరిగింది"

"బహుమతులవీ..? "

"డ్రాయింగ్, గేయాలు పాడటం, కుర్చీలాట, తాడాట.. ఇలా ఏ అంశంలో పోటీ నిర్వహిస్తే, ఆ అంశానికి సంబంధించి కొద్దో గొప్పో పరిజ్ఞానం ఉన్న ఇద్దరు పెద్దలకు న్యాయనిర్ణయ బాధ్యతలప్పగిస్తా. మొదటి అయిదు స్థానాల్లో నిలిచిన పిల్లలకు బహుమతులిప్పిస్తా. పాల్గొన్న వారందరికీ పెన్నో పెన్సిలో ఇస్తాను, వారు డిసప్పాయింట్ కాకుండా ఉండటానికి. ప్రతి నెలా నా శాలరీలో ఇరవైశాతం ఇందుకు కేటాయిస్తున్నాను"

అతని మొహంలో గొప్పలు చెప్పుకుంటున్న ఫీలింగ్ ఎక్కడా కనిపించలేదు అపూర్వకు. అబ్బురంగా ఉంది. ఎంత చిన్నవ్యక్తి అయినా తన పరిధిలో తాను చేయగల ఒక మహత్కార్యం ఉంటుందన్న మాట అబద్ధం కాదనిపించింది.

"వెరీగుడ్ సర్, మీరు చాలా మంచిపని చేస్తున్నారు"

"థ్యాంక్యూ మేడమ్"

డిపాజిట్ డబ్బులందించింది అపూర్వ.

వికాస్ వాటినందుకుంటూ "మీరు మాధవయ్యాగారమ్మాయి కదూ!" అని అడిగాడు.

"అవునండీ. నేను మిమ్మల్ని ఎప్పుడూ చూళ్లేదు"

"ఎలా చూస్తారు చెప్పండి. మీరు చిన్నప్పట్నుంచీ హాస్టళ్లలోనే ఉండి చదువుతుంటిరాయె.."

పెదవులు విప్పకుండానే నవ్వింది అపూర్వ.

"మీకు కవిత్వమంటే ఇష్టమా? "

అపూర్వ తీసుకున్న 'రైతుకవిత' పుస్తకాన్ని చూస్తు అడిగాడు వికాస్.

"ఇష్టమేంటి? ఇది కవిత్వం రాస్తుంది కూడా" నిశ్శబ్దంగా కూచున్న పార్వతి గభాల్న అందుకుంది.

"అబ్బెబ్బే! అదేం లేదండీ.. చదువుతానంతే" పార్వతి వైపు కోపంగా, వికాస్ వంక సిగ్గుగా చూస్తూ అంది అపూర్వ.

"తప్పేండీ.. మనలో ఉన్న కళను చెప్పుకోవటానికి సిగ్గు పడకూడదు. నన్ను చూడండి.. నేను పెడుతున్న పెన్సిల్ సైజు పోటీల గురించి పెద్ద పోజుకొ

## కొత్తగాలి...

**ఆ అబ్బాయికి**
**పనిష్మెంట్ బాగా ఇచ్చారు**
**ఇంగ్లీషు కాన్వెంట్‌లో**
**తెలుగులో ఏడ్చాడు మరి**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ.గో. జిల్లా

డుతూ చెప్పుకోలేదూ!" అన్నాడు పెద్దగా నవ్వుతూ.

అపూర్వ, పార్వతి కూడా నవ్వేశారు.

అతని నిరాడంబరత్వం అపూర్వకు బాగా నచ్చింది.

అపూర్వ అందమే కాదు, అభిరుచి కూడా వికాస్‌కి విపరీతంగా నచ్చింది.

★ ★ ★

ఆ గదిలో కలకలం మొదలైంది.

మత్తు ప్రభావం తొలగిపోవటంతో అపూర్వకు మెలకువ వచ్చింది. పెద్దగా కేకలు వేయటం మొదలుపెట్టింది. గదిలో పడుకొని వున్న రాజారావు, రంజిత ఉలిక్కి పడి లేచారు. భయంతో పరుగెత్తుకుంటూ వెళ్లి వికాస్‌ను, తల్లినీ లేపాడు రాజారావు.

వాళ్లు కంగారుగా గదిలోకి వచ్చారు.

అపూర్వ ఆర్తనాదాలు చేస్తోంది.

మంచంలో నిలవలేకపోతోంది.

"మంట.. మంట! అమ్మో తట్టుకోలేను.. చంపెయ్యండి.. నన్ను చంపెయ్యండి.." అంటూ అరుస్తోంది.

పై అంతస్తులో ఉన్న డాక్టరు దగ్గరకు పరుగు తీశాడు వికాస్.

మూడోసారి కూడా కాలింగ్ బెల్లు మోగాకగానీ తలుపులు తెరుచుకోలేదు. నిద్ర కళ్లతో చూస్తూ ఏమైందని అడిగాడు డాక్టర్.

"అపూర్వకు స్పృహ వచ్చింది సార్. నొప్పి భరించలేకనో ఏమో.. తల్లడిల్లిపోతోంది. ప్లీజ్ సర్! ఒక్కసారి మీరొచ్చి చూస్తే ధైర్యంగా ఉంటుంది" అభ్యర్థించాడు వికాస్.

డాక్టర్ వాచీ చూసుకున్నాడు.

తెల్లవారుజామున నాలుగు దాటింది.

"అయిదు నిముషాల్లో వస్తా, పద" అన్నాడు.

వికాస్ గదికి చేరుకున్నాడు.

రాజారావు రెండు కాళ్లమధ్య తలపెట్టుకొని, గది బయటే కూచుని ఏడుస్తున్నాడు. కళమ్మ, రంజిత ఆందోళన చెందుతూనే తోచిన సపర్యలు చేస్తున్నారు. ఏమాత్రం ఉపశమనం కనిపించలేదు.

డాక్టర్ వచ్చాడు. పల్స్ చెక్ చేశాడు. ఏవో పరీక్షలు చేశాడు.

వికాస్‌కు గుండెదడ పెరిగింది. ధైర్యంగా ఉంటుందన్న ఉద్దేశంతో అపూర్వకు ప్రాణాపాయం లేదని కళమ్మతో చెప్పాడే గానీ - వాస్తవానికి ఇరవైనాలుగు గంటలు గడవందే ఏమీ చెప్పలేనని చెప్పాడు డాక్టర్. అపూర్వకేమీ కాకూడదని మనసులోని భగవంతుణ్ని ప్రార్థించాడు వికాస్.

కాలిన గాయాల బాధకు పేషెంట్ తట్టుకోలేకపోతోందని గ్రహించాడు డాక్టర్. తప్పనిసరి పరిస్థితుల్లో మళ్లీ మత్తుగా పడుకునేందుకు ఓ ఇంజెక్షన్ ఇచ్చాడు.

డాక్టర్ వెనకే వికాస్ కూడా వడివడిగా నడిచి, "ప్రమాదమేమీ లేదుగా డాక్టర్? " అన్నాడు తన ప్రశ్నే సమాధానం కావాలన్న ఆరాటంతో.

"అప్పుడే ఎలా చెప్పగలను? బర్నింగ్ కేసులు ఓ పట్టాన అర్థంకావు. చూద్దాం.. ఇప్పటివరకైతే ఇంకా హోప్స్ ఉన్నాయి" చెబుతూనే సాగిపోయాడాయన.

"థ్యాంక్యూ సర్" నిరాశను దిగమింగేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు వికాస్.

★ ★ ★

అనంతారం గ్రామంలో పంచాయతీ ఎన్నికల వేడి మొదలైంది. రెండు పార్టీలూ రంగంలోకి దిగాయి. పదవీకాలం ముగిసిపోయిన నారాయణే మళ్లీ బరిలో ఉన్నాడు. ప్రతిపక్ష పార్టీ తరపున మాధవయ్య వర్గానికి చెందిన వెంకటేశ్వర్లు పోటీకి దిగాడు. వ్యూహ ప్రతి వ్యూహాలు సిద్ధమవుతున్నాయి. రాత్రి రాజకీయం మొదలైంది.

రాత్రి తొమ్మిది గంటల వేళ...

మాధవయ్య గారింట్లో భేటీ! ఇరవై మంది దాకా చుట్టూ కూచున్నారు. మధ్యలో మాధవయ్య!

నిజానికి మాధవయ్యకు ఈసారి ఎన్నికలు జరగటం ఇష్టం లేదు. ఎం.పి.టి.సి.ల ఎన్నికలకే ఏకంగా మూడు శాల్తీలు లేచిపోయాయి. కాళ్లు, చేతులు విరిగి ఎనిమిది మంది మంచాన పడ్డారు. ఇక పంచాయతీ ఎన్నికలంటే 'హింస'కు కొదవే ఉండదు. ఇప్పుడు మళ్లీ ఊరు విచ్ఛిన్నమైతే పార్వతి జీవితం మోడుగానే మిగిలిపోతుందేమోనని... ఆయన భయం!

అందుకే ఏకగ్రీవ ఎన్నిక కోసం ఆయన చొరవ తీసుకొని ప్రతిపాదించాడు. నారాయణ ఒప్పుకో లేదు. ఇక తప్పనిసరై తన వారితో మంతనాలు జరుపుతున్నాడు.

అపూర్వ, పార్వతి భోజనం చేసి, డాబా మీదికి ఎక్కారు. వెన్నెల్లో తిరుగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దరి ఆలోచన్లలోనూ మరో ఇద్దరు కదలాడుతున్నారు.

అపూర్వ యథాలాపంగా డాబా పైనుంచి క్రిందికి చూసింది. ఆ డాబాకు అనుకొని ఓ పూరిగుడిసె. అందులో వీరయ్య కుటుంబం నివసిస్తోంది.

గుడిసె బయట వాల్చిన మంచంపై ఓ వ్యక్తి కూచొని ఉన్నాడు. ఆయనకెదురుగా కింద కూచొని ఉన్నాడు వీరయ్య. ఏదో విషయమై తలబాదుకుంటూ చెబుతున్నాడు. పక్కనే పులిగాడు నుంచొని ఉన్నాడు. అతని చేతిలో దుడ్డుకర్ర ఉంది. పార్వతిని పిలిచి, ఆ మంచంపై కూచున్న వ్యక్తి ఎవరని అడిగింది.

"ఏమిటే, ఆయన్ని గుర్తు పట్టలేదా? ప్రెసిడెంట్ నారాయణ" అంది పార్వతి.

ఇద్దరూ జాగ్రత్తగా వారి మాటల్ని ఆలకించారు.

"ఏరా అయ్యగారంటే నీకంత వెటకారమా! తీసుకున్న డబ్బులు తిరిగివ్వమంటే లేవు పొమ్మంటావ్.. పోనీ ఓటెయ్యమంటే నేను మీపార్టీ కాదంటావ్! ఏంరా, నీ ఒక్కడి ఓటుతోనే మీ పార్టీ గెలిచిద్దనుకుంటున్నావా? " పులిగాడు వీరయ్యని కాలితో గట్టిగా తన్నాడు.

వీరయ్య ఉండలా చుట్టుకొని కింద పడిపోయాడు. పులిగాడికాలు డొక్కల్లో తగలడంతో ప్రాణం అన్నా పట్టింది. నిమిషం తర్వాత అతని ఆక్రందన ఆ వీధిలో ప్రతిధ్వనించింది.

ఆ కేక వినగానే, మాధవయ్య గారింట్లో జనం గబాగబా వీరయ్య గారి ఇంటివైపు పరుగులు తీశారు. వాళ్లని చూడటంతోనే పులిగాడు అలర్ట్ అయ్యాడు. కర్రను గుండ్రంగా తిప్పుతూ "మా విషయంలో కల్పించుకున్నారో పుచ్చెలెగిరిపోతాయ్ జాగ్రత్త" అంటూ గర్జించాడు.

"అంటే, మా పార్టీవాళ్ల ఇంటిపై దాడి చేసినా చూస్తూ ఊరుకోటానికి మేమంత చాతగాని వాళ్లమనుకున్నావా? " మాధవయ్య వర్గంలోంచి ఎవరో అన్నారు.

ఇద్దరి మధ్యా గొడవ ముదిరింది.

కాసేపు అరుపులు, కేకలు ఆ చుట్టుపక్కల ఇళ్లలో మార్మోగాయి. చివరికి ఒక్కడే అయినా, పులిగాడిదే పైచేయి అయింది. తన స్వామిభక్తిని ఘనంగా చాటుకుంటూ నారాయణని సురక్షితంగా ఆ వలయం నుంచి బయటికి తీసుకువెళ్లగలిగాడు.

అపూర్వకిదంతా చిత్రంగా ఉంది.

మాధవయ్య వర్గీయులు తిరిగొచ్చారు. మాధవయ్యతో గొడవకు దిగారు.

"శాంతి... శాంతి అంటూ మీరేమో మా చేతులు కట్టేశారు. ఇప్పుడు వాళ్లు చూడండి.. ఎలా రెచ్చిపోతున్నారో" అంటూ ఆయనను తప్పుబడుతున్నారు.

"నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి. ప్రస్తుతానికి వదిలెయ్యండి... రేపు రండి,

## అంధత్వానికి సవాల్!

చతుర ప్రపంచం

జిమ్‌స్టోవెల్‌ను పదిహేడో ఏట పరీక్షించిన డాక్టర్ అతని చూపు మందగిస్తోందనే నిజాన్ని చెప్పాడు. అయితే ఆశావాది అయిన జిమ్ కాలేజీలో చేరి బాగా చదువుకున్నాడు. డిగ్రీ సంపాదించాడు. ఓ వ్యాపారి దగ్గర అప్రెంటిస్‌గా పనిచేసిన అతడు మంచి వ్యాపారి కావాలని ధ్యేయంగా పెట్టుకున్నాడు. అంధుడు కాబోయే ముందే తన కెరీర్‌ని, జీవితాన్ని చక్కగా మలచుకునేందుకు బాటలు వేసుకోవాలనుకున్నాడు. పూర్తిగా చూడలేని రోజు రావడానికి ముందే దానికి మానసికంగా సిద్ధపడ్డాడు.




జిమ్ అంధుడయ్యాక 'నెరేటివ్ టెలివిజన్ నెట్ వర్క్' (ఎన్‌టిఎన్)ను స్థాపించి, వ్యాపారస్తుడవ్వాలనే తన కోరికని తీర్చుకున్నాడు. అంధుల కోసం ప్రత్యేకించిన ఆ టీవీ ప్రోగ్రాంలలో దృశ్యాలని వివరించే వర్ణనను సౌండ్‌ట్రాక్‌తో జతచేస్తారు. దీని వల్ల తాము చూసే ఆ టీవీ కార్యక్రమాల్ని అంధులు మరింత స్పష్టంగా అర్థం చేసుకోగలరు. అమెరికాలో ఎన్‌టిఎన్ రెండుకోట్ల ఇళ్లకు చేరువయింది. ప్రేక్షకుల్లో అరవై శాతం కళ్లున్న వారే కావడం ఆశ్చర్యకరం!

జిమ్ స్టోవెల్‌కి టెలివిజన్ రంగంలో లభించే అత్యున్నత పురస్కారం 'ఎమ్మీ అవార్డ్'ను దాన్ని స్థాపించిన మొదటి సంవత్సరమే బహూకరించారు.

'యూ డోంట్ హేవ్ టు బి బ్లైండ్ టు సీ' పుస్తకం రాసిన జిమ్ దాని పరిచయ వాక్యాల్లో 'పరమాత్ముడు నా అంతర్ దృష్టికి ఈ కొత్త ఆలోచన అందించాడు తప్ప ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు' అని రాసుకున్నాడు.

---

మాట్లాడదాం" అన్నాడాయన నింపాదిగా.

వాళ్లంతా వెళ్లిపోయారు. వెళ్లిపోతున్న జనాన్ని వింతగా చూస్తూ వికాస్ మాధవయ్య గారింట్లో అడుగు పెట్టాడు.

వరండాలోని కుర్చీలో ఒంటరిగా కూచొని ఉన్న మాధవయ్యగారికి రెండు చేతులూ జోడించి "నమస్తే సార్" అన్నాడు వికాస్ వినయంగా.

మాధవయ్య ఆలోచనల్లోంచి బయట పడి, "ఏం బాబూ, బాగున్నావా? ఎలా ఉంది ఉద్యోగం" అడిగారు నవ్వుతూ.

"బాగున్నానండి. ఉద్యోగం కూడా బాగుంది. ఇప్పుడు నాకు ఆకలిబాధ లేదు. పదో పరకో దాచుకొంటున్నా"

"మంచిదయ్యా. అవును, ఏమిటి ఎప్పుడూ రాని వాడివి... ఈ వేళప్పుడు ఇలా మా ఇంటికొచ్చావ్?"

"మీతో ఓ ముఖ్యమైన విషయం గురించి మాట్లాడదామని వచ్చా సార్"

"అలాగా! చెప్పు" - మంచి కుర్రాడిగా వికాస్‌పై మాధవయ్యకు గౌరవం ఉంది.

వికాస్ తన ఇంట్లోకి రావటం పైనుంచి పార్వతి, అపూర్వ గమనించారు. అతని రాక ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. ఇద్దరూ గబగబా కిందికి దిగి వచ్చారు.

తమను దాటుకుంటూ ఇంట్లోకి వెళ్లబోతుండగా మాధవయ్య వారిని ఆపి, "వీళ్లు మా అమ్మాయిలు. అపూర్వ, పార్వతి" అంటూ పరిచయం చేశాడు.

ఇద్దరూ ఒకేసారి "నమస్తే" అన్నారు. ప్రతి నమస్కారం చేశాడు వికాస్.

"ఇతను వికాస్. మంచి కుర్రాడు. తల్లి దండ్రులు లేకపోయినా కష్టపడి చదువుకొని, పైకొచ్చాడు" మాధవయ్య కితాబు.

పార్వతి తన బెడ్‌రూంలోకి వెళ్లిపోయింది. అపూర్వ తలుపు పక్కనే నిలబడి, వికాస్ ఏంమాట్లాడతాడోనని ఎదురు చూస్తోంది.

"భోజనం అయిందా? " మాధవయ్య అడిగాడు వికాస్‌ని.

"అయిపోయింది సార్".

"ఆ.. చెప్పు. ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలన్నావ్"

అపూర్వకెందుకో టెన్షన్ మొదలైంది.

"అదే సార్.. పంచాయతీ ఎన్నికల గురించి.."

"ఏమైంది? " అర్థం కానట్టు చూశాడు మాధవయ్య.

"ఈ మధ్య గొడవలు తగ్గిపోయాయి. ఊరంతా ప్రశాంతంగా ఉంది. సర్పంచి ఎన్నికనూ ఏకగ్రీవం చేసుకుంటే అన్ని విధాలా బాగుంటుంది. పైగా ఏకగ్రీవ పంచాయితీలకు ప్రభుత్వం నజరానా ఇస్తోంది. దాంతో మనూళ్లో మంచినీటి సమస్యను శాశ్వతంగా పరిష్కరించవచ్చు"

అపూర్వ ఊపిరి పీల్చుకుంది.

"నిజమే. అందరూ కలిసి రావాలిగా!"

"అందుకు మీరే ఎందుకు కృషి చేయకూడదు? కక్షలూ కార్పణ్యాల వల్ల ఊరెంతగా నాశనమవుతుందో మీకు తెలియదా? బరిసెలూ, బాంబులూ తప్ప ఊరికి జరిగిన ఉపకారం ఏమైనా ఉందా? కంప్యూటర్ యుగంలోనూ మనం మంచి నీటిని కావిళ్లతో మోసుకొచ్చుకుంటున్నాం. ఇప్పుడైతే ఆ చెరువు కూడా ఎండిపోయింది. చూస్తున్నారుగా... బొట్టుబొట్టుగా జల ఊరే ఆ ఒలువుల్లోంచి అర్ధరాత్రి వేళ గంటల తరబడి వేచివుండి నీటిని తెచ్చుకుంటున్నాం. ఇంత దుర్భర పరిస్థితి మనూరి చుట్టుపక్కల ఎక్కడైనా ఉందా? పేరుకేమో మేజర్ పంచాయతీ. పీహెచ్‌సీ లేదు. పశువైద్యశాల లేదు. పట్టుమని పదెకరాలు తడిసే నీటి వసతి లేదు. ఇన్నిటికీ కారణం ఈ రాజకీయాలు కాదంటారా? " అడిగాడు వికాస్ ఏమాత్రం ఆవేశపడకుండా.

"నువ్వనేదంతా నిజమే వికాస్. నీ ఆవేదనను అర్థం చేసుకోగలను. ఏకగ్రీవ ఎన్నిక కోసం నేను ముందే ప్రపోజ్ చేశాను. నారాయణ ససేమిరా ఒప్పుకోలేదు.." మాధవయ్య మాటలు పూర్తి కాక ముందే ఒక వ్యక్తి హడావుడిగా వచ్చాడు. బాగా పరిగెత్తినట్టున్నాడు.

"వాళ్లు మనపార్టీ మనిషిని చావగొడ్తున్నారు. మీరు యమఅర్జెంటుగా రావాలి" అన్నాడు వగరుస్తూ.. ముద్దగా. మాధవయ్య చెంగున లేచాడు. దండెం మీదున్న పైపంచెను భుజాన వేసుకొని, పరుగులాంటి నడకతో వెళ్లిపోయాడు. వికాస్ ఓ నిట్టూర్పు విడిచి, బయటికి రాబోతుండగా అపూర్వ వచ్చింది. తండ్రి లేచివెళ్లిన కుర్చీలో తను కూచుంది.

"వెళ్లొస్తానండీ" లేచాడు వికాస్.

"ఏం, నాతో మాట్లాడకూడదా? " అంది అపూర్వ.

"అదేంలేదు, చెప్పండి"

"ఈ ఊరిపట్ల నిజంగా మీకంత ఆవేదన ఉంటే.. ముందు మీ ఫ్రెండు పులిగాడి ఆగడాల్ని ఆపొచ్చుగా? "

"మీరు పొరపాటు పడుతున్నారు. సమస్యకు మూలం వాడుకాదు"

"ఊళ్లో జరిగే అనేక దౌర్జన్యాలకు అతనే కారణం"

"వాడిదంతా పైకి కనిపించే హడావుడి మాత్రమే. అసలు విధ్వంసానికి కారకులు ముసుగుల్లో ఉన్నారు"

"అయితే అతను మంచివాడేనంటారు"

"నిస్సందేహంగా!"

"మరెందుకలా మారిపోయాడు? "

"అదో అర్భకత్వం. ఇంకా చెప్పాలంటే

అమాయకత్వం. వీడికా నారాయణ గారేదో ఉద్యోగం ఇప్పిస్తానని హామీ ఇచ్చాడు. మాయమాటలు చెప్పాడు. 'నాకు నమ్మినబంటువి నువ్వే'నంటూ వాణ్ని లోబర్చుకున్నాడు. వాడు ఒక్కసారి కమిట్ అయ్యాడంటే.. అదెలాంటి పనైనా సరే చేసి తీరుతాడు. దాన్ని అలుసుగా తీసుకొని ఆ నారాయణ వాడిచేత అడ్డమైన పనులూ చేయిస్తున్నాడు"

"ఈ విషయాన్ని వివరించి చెప్పి, మీ ఫ్రెండును సంస్కరించవచ్చుగా" అడిగింది అపూర్వ.

"చాలాసార్లు చెప్పి చూశానండి. ప్చ్.. లాభం లేదు. వాడా మత్తులో పీకల్దాకా మునిగిపోయాడు" నిట్టూర్చాడు వికాస్.

"మీరిద్దరూ కలిసి చదువుకున్నారా? "

"అవును"

"మీ గురించి.."

"చెప్పుకోటానికేమీ లేదు మేడమ్. నాకు ఊహ తెలియకముందే అమ్మానాన్నా పోయారు. మా పనుల్లోకి వచ్చే దళిత మహిళ నన్ను పెంచుకుంది. ఆమెకీ నా అనేవారూ లేరు. నాన్న సంపాయించిన రెండెకరాలూ అమ్మి.. ఆమె రోజూ కూలికి వెళ్లి నన్ను చదివించింది. ప్రస్తుతం ఆమె మంచాన పడివుంది" వికాస్ కళ్లలో నీటి పొర కదలాడింది.

"సారీ.." ఇబ్బందిగా చూసింది అపూర్వ.

"ఛఛ.. ఎందుకు సారీ చెబుతారు? ఒక రకంగా ఈ పరిస్థితే నా జీవిత పాఠశాల అయింది. అనేక అనుభవాలు, దుఃఖాలు నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. అమ్మానాన్నలూ, అన్ని సౌకర్యాలూ ఉండుంటే నేను కూడా బహుశా నా ఫ్రెండులానో లేక ఈ గ్రామస్తులందరిలోనూ ఒకడిలానో నిస్సారంగా జీవించేవాణ్నేమో అనుకుంటాను"

వికాస్ విశ్లేషణ బాగా నచ్చిందామెకు. అయితే కావాలని అతగాడు తన గురించి గొప్పలు చెప్పుకొంటున్నాడేమోనన్న సందేహం తలెత్తింది.

అందుకే అతను మాట్లాడుతున్నంత సేపూ నిశితంగా గమనించింది. అతని మొహంలో అలాంటి భావాలు కనిపించ లేదు.

వికాసే మళ్లీ అందుకున్నాడు.. "ఎడారి లాంటి జీవితంలో వాడి కుటుంబం నాకో ఒయాసిస్సులాంటిది. వాళ్లమ్మ వాడికన్నా నన్నే ఎక్కువగా ప్రేమిస్తుంది. ఆప్యాయంగా పలకరిస్తుంది. నాకు సంబంధించిన ఏ విషయాన్నైనా ఆమెతోనే పంచుకుంటాను. స్కూల్లో చదువుకునే రోజుల నుంచీ వాడితో కలసి వాళ్లింటికి వెళ్లేవాణ్ని. ఆకలైతే అడిగి మరీ అన్నం పెట్టించుకు తినేవాణ్ని.."

"మీకు పెళ్లయిందా? " ఠక్కున అడిగింది అపూర్వ.

సిగ్గు పడ్డాడు వికాస్.

"వస్తానండి" లేచాడు వికాస్.

వికాస్ వెళ్లిపోయిన వైపే చూస్తూ.. ఆలోచనల్లో మునిగిపోయింది. అపూర్వ. ఆ ఆలోచనలు తన జీవితం గురించి కాదు.. పార్వతి గురించి. తీవ్ర మథనం అనంతరం 'మహేష్' విషయాన్ని రేపు తన తండ్రి వద్ద ప్రస్తావించాలనుకుంది.

### కొత్తగాలి...

**రక్తికడుతున్న**
**అవినీతి రాగానికి**
**రాజకీయం**
**వాద్యసహకారం**

– తల్లాప్రగడ ప్రభాకర్,
మదీనాగూడ, హైదరాబాద్



సరిగ్గా అదే సమయంలో..

గ్రామంలో ఓ మూలన నాటుబాంబు పేలిన శబ్దం ఊరంతా ప్రతిధ్వనించింది.

ఆ వెంటనే నాలుగైదు విస్ఫోటాలు.

మాధవయ్య ఇంకా ఇంటికి రాకపోవటంతో భాగ్యమ్మ, పార్వతి, అపూర్వ ఇంట్లోకి, బయటికి తిరుగుతున్నారు.

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలవుతుండగా చేతిలో పార్శిల్‌తో వచ్చాడు వికాస్. అప్పటికే కళమ్మ, రంజిత గదిని శుభ్రం చేశారు. పాపకు పాలు పట్టారు. రాత్రంతా నిద్ర పోకపోవటంతో రాజారావు అలిసిపోయి వరండాలోని బెంచీపై పడుకొని నిద్రపోతున్నాడు.

పార్శిల్ విప్పి కళమ్మకూ, రంజితకూ టిఫిన్ అందించాడు వికాస్. వాళ్లు తింటుండగా తను వరండాలోకొచ్చి రాజారావుని లేపాడు. బయటికెళ్లి ఫ్రెషప్ అయి, టిఫిన్ చేసి రమ్మని చెప్పాడు.

"అప్పాకీ మళ్లీ మెలకువ వచ్చిందా? " బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ అడిగాడు



రాజారావు.

"లేదు"

వికాస్ బతిమాలితేగానీ రాజారావు టిఫిన్ చేసేందుకు బయటికెళ్లలేదు. నిజానికి అతనికి కూడా పార్శిల్ తీసుకొద్దామనుకున్నాడు వికాస్. కానీ కాస్త బయటికెళ్లి వస్తే రాజారావు రిలాక్స్ అవుతాడన్న ఉద్దేశంతో తేలేదు.

వికాస్ అక్కడే బెంచీమీద కూచొని పేపరు చదువుకుంటున్నాడు.

టిఫిన్ తినడం పూర్తి చేసి, కళమ్మ వికాస్ వద్దకు వచ్చింది. తన మనసులో రూపు దిద్దుకున్న సంస్కరణలను ప్రారంభించే ప్రక్రియలో భాగంగా "బాబూ వికాస్.." అంది.

"రండమ్మా! కూచోండి.." బల్లపై తానో పక్కకు జరుగుతూ కళమ్మకు చోటు చూపాడు వికాస్.

"అసలు ఈ రంజిత ఎవరు? " అందామె కూచుంటూ.

"మన కాన్వెంటులోనే టీచరమ్మా. చాలా మంచి అమ్మాయి. స్కూలు పనితోపాటు..

టయానికి వీడు ఇంట్లో ఉన్నా లేకున్నా మన అపూర్వకు కొండంత అండగా ఉంటుంది. వాళ్లమ్మ తప్ప తనకింకెవరూ లేరు కాబట్టి.. స్కూలు అయిపోయాక కూడా చాలా సేపూ అక్కడే ఉండిపో తుంది. బాబును ఆడిస్తుంది. పాప పను లన్నీ తనే చూస్తుంది. ఆమె లేకపోతే, అపూర్వకసలు వెసులుబాటే ఉండేది కాదు. ఇప్పుడు కూడా చూశావా.. నిన్న ట్నించీ ఎన్ని సేవలు చేస్తుందో? "

"చాల్చాలు.. ఇక ఇంటికి పంపించెయ్"

"అదేంటమ్మా! నీకు సాయంగా ఉంటుంది కదా!"

"అక్కర్లేదు, వెళ్లిపొమ్మను"

"పోనీ, మళ్లీ సాయంత్రం రమ్మననా? "

"వద్దు, ఇంకెప్పుడూ రావద్దని చెప్పు" స్థిరంగా అందామె.

అయోమయంగా చూశాడు వికాస్.

"నీకు మొహమాటమైతే నేనే చెప్పేస్తా" అంటూ విసవిసా గదిలోకి వెళ్లిందామె.

అయిదు నిముషాల తర్వాత రంజిత వెళ్లిపోయింది. ఆమె మళ్లీ ఆస్పత్రి వైపు రాలేదు. కాదు.. రానివ్వబడలేదు!

★ ★ ★

ఉదయం పదిగంటల వేళ..

మాధవయ్య తీరిగ్గా కూచుని పేపరు చదువుతున్నాడు.

తన గదిలో అపూర్వ అటూ ఇటూ తిరు గుతోంది. మొదట పార్వతి- మహేష్ల గురించి తండ్రితో మాట్లాడాలో, వద్దో తేల్చుకోలేకపోయింది. రాత్రి చాలా సేపు ఆలోచించాక ఈ విషయాన్ని ఆయనతో ప్రస్తావించాలనే అనుకుంది.

కానీ మాధవయ్య అర్ధరాత్రి దాటాక ఇంటికొచ్చాడు. బాంబుల పేలుళ్లు వినిపి స్తుండటంతో ఏమయ్యారోనని కంగారు పడిన ఇంట్లోవాళ్లు ఆయన తిరిగి రాగానే ఊపిరి పీల్చుకున్నారు. అసలేం జరిగిందని ప్రశ్నించారు. "ఏముంది మామూలే. మళ్లీ ఊళ్లో గొడవలు మొదలయ్యాయి" అంటూ పైపంచెను దండెంమీద వేసి, కాళ్లు కడు క్కొని నిద్రకుపక్రమించాడు.

ఈ పరిస్థితుల్లో ఇక వాళ్లతో మనువు కలుపుకోవటం సాధ్యం కాదంటాడేమోనని అపూర్వ ఆందోళన!

ఏమన్నాసరే, కుటుంబ పెద్దగా ఆయనకీ విషయం తెలియాలి. ఆ మాటకొస్తే రిస్కు తీసుకొనైనా సరే, పెళ్లి చేయాల్సిన బాధ్యత ఆయనపై ఉంది.

ఇలా ఆలోచించగానే ధైర్యమొచ్చేసింది అపూర్వకు. మర్నాడు వరండాలోకి వచ్చి తండ్రికెదురుగా కూచుంది.

"నాన్నా.." పిలిచింది ఉపోద్ఘాతానికి సిద్ధమవుతూ.

పేపరులోంచి తలెత్తిచూసి, "ఏంటమ్మా? " అన్నాడు మాధవయ్య.

"నీతో కొంచెం మాట్లాడాలి"

"ఊ.. చెప్పు" అన్నాడాయన పేపరు పక్కన పడేసి, కళ్లజోడు తీస్తూ.

"అదే, పార్వతి పెళ్లి సంగతేం చేశారు? "

"సంవత్సరం నుంచీ ప్రయత్నిస్తూనే ఉన్నానమ్మా. ఓ పట్టాన కుదరటంలేదు. ఈ సమాజానికి మనమనుకునేంత విశాల హృదయం లేదమ్మా. భర్త చనిపోయిన అమ్మాయిని పెళ్లి చేసుకోవటానికి గభాల్న ఎవరూ ముందుకు రావటంలేదు. తెలిసిన వారందరికీ చెబుతూనే ఉన్నా. కావాలంటే ఇంకో ఎకరం ఎక్కువైనా ఇస్తానని చెబు తున్నా. ప్చ్.." మాధవయ్య మాటల్లో నిర్వేదం కనిపించింది.

"మీరేమీ అనుకోనంటే.. నేనో అబ్బాయి గురించి చెబుతా. మీరు పెళ్లికి ఒప్పుకొం టారా? "

"ఎంతమాట! ఘనంగా పెళ్లి చేస్తా"

"ఆ కుర్రాడు చదువుకోలేదు. ఉద్యోగం లేదు. కానీ గొప్ప సంస్కారం ఉంది,

మంచి హృదయం ఉంది" గత వారం రోజులుగా తన 'ఛానల్' ద్వారా మహేష్ గురించి ఎంక్వైరీ చేసి, నిర్ధారణ చేసుకున్న విషయాన్ని తండ్రి దగ్గర స్పష్టంగా చెప్పింది అపూర్వ.

"అంతకన్నా ఇంకేం కావాలమ్మా? ఎవరతను? "

"కానీ మీరు నాకు మాటివ్వాలి"

"అతను మంచివాడని స్వయంగా నా కూతురే సర్టిఫికేట్ ఇచ్చాక, నేనెలా కాదంటాను? ఇంతకీ ఎవరమ్మా అతను? మనూరేనా? ఏం చేస్తుంటాడు? " ఆత్రంగా అడిగాడాయన.

"ఈ ఊరే నాన్నా. మహేష్. సర్పంచి గారి చిన్నబ్బాయి"

ఒక్కసారిగా ఆయన మొహంలో రంగులు మారాయి. ప్రశాంత వదనం కాస్తా గంభీరంగా మారింది. కళ్లలోకి క్రోధం తన్నుకొచ్చింది.

"కుదరదు.." గట్టిగా అరిచాడాయన.

"ఎందుకు కుదరదు? ఏమైందతనికి? "

"ఒకసారి ఆ నారాయణ తరపువారితో బంధుత్వం కలుపుకొనే, దెబ్బతిన్నాం. మళ్లీ అదే రొంపిలో దిగమంటావా? "

"ప్రతిసారీ అలాగే ఎందుకవుతుంది? "

"కాదని చెప్పగలవా? ఇప్పటికే పాతకక్షలు మళ్లీ రాజుకున్నాయి. ఈ పంచాయితీ ఎన్నికలయ్యేలోగా ఎంతమంది బలవుతారో తెలియదు. పోయిపోయి మళ్లీ విద్వేషాలు రేపుకోవటమెందుకు? "

ఇక్కడ తండ్రీకూతుళ్ల మధ్య ఇలా వాదన జరుగుతుండగా..

ఇంటికి వెనకవైపు పెరట్లో పార్వతి ఇంటిపనిలో నిమగ్నమై ఉంది. తననెవరో పిలుస్తున్నట్లనిపించి, తల పైకెత్తి చూసింది.

పెరటి గోడను ఆనుకొని ఓ డాబా ఉంది. దాని మీద ఓ వ్యక్తి నిలబడి తనకేవో సైగలు చేస్తున్నట్లు గమనించింది. కళ్లు చిట్లించి చూసి, ఆ వ్యక్తిని మహేష్‌గా గుర్తించగానే ఆమె పెదవులు విచ్చుకున్నాయి. డాబాకు దగ్గరగా వెళ్లింది.

ఇద్దరూ కాసేపు చూపుల్తోనే మాట్లాడుకున్నారు.

కానీ పార్వతికి భయంగా ఉంది.. తమనెవరైనా గమనిస్తారేమోనని. చుట్టూ చూస్తూనే అతనికి సంకేతాలు పంపింది.

కాసేపటి తర్వాత ఉండగా చుట్టిన కాగితాన్ని అతను విసిరేశాడు. ఆత్రంగా వెళ్లి అందుకుందామె.

విప్పి చూస్తే అందులో ఓ గులాబీ ఉంది. కాగితాన్ని విసిరేసి, పువ్వును

> ## కొత్తగాలి...
>
> **పాప పడుతూ లేస్తూ**
> **నడుస్తోంది**
> **కొత్త గుమాస్తా రాసే**
> **గవర్నమెంట్ డ్రాఫ్ట్‌లా**
>
> – వి.వి.ఎస్. ప్రసాద్,
> నవులూరు, గుంటూరు జిల్లా

గుండెలకు హత్తుకుంది.

మహేష్ సంజ్ఞల్తోనే కృతజ్ఞతలు చెప్పి వెళ్లిపోయాడు.

తండ్రి వద్ద తన మాట నెగ్గకపోవటంతో లేచి పెరటి వైపు వచ్చిన అపూర్వకు పార్వతి ముసిముసిగా నవ్వుకోవటం కనిపించింది. ఆమె చేతుల్లో పువ్వును చూసి ఆశ్చర్యపోయింది.

'ఏమిటి సంగతి? ' కళ్లతోనే అడిగింది.

ఆ డాబా మీదికి మహేష్ వచ్చి వెళ్లాడని పార్వతి కూడా సైగల్తోనే చెప్పింది.

నవ్వింది అపూర్వ. ఆ చిన్న విషయానికే అంత సంతోషపడిపోతున్న పార్వతి..

మహేష్‌కు భార్య కాగలిగితే ఇంకెంత బావుంటుందో అనుకుంది.

"అమాయకుడేమో అనుకున్నా.. అల్లరి వాడే" అంటూ అపూర్వ పార్వతిని ఆటలు పట్టించింది.

"వేళాకోళానికేం గానీ, ఏమన్నారు నాన్న గారు? "

"ఏమంటారు? మనం ముందే ఊహిం చాంగా.."

"ఒప్పుకోలేదా? " నిరాశగా అడిగింది పార్వతి.

"అవును" అపూర్వ నోటినుంచి జవాబు పూర్తిగాకముందే పార్వతి కళ్లవెంట నీళ్లు తిరిగాయి.

"అదుగో.. ఆ ఏడుపే వద్దన్నాను. ఇప్పు డేమైందని? ఆయన్నెలా ఒప్పించాలో నాకు తెలుసు. అదంతా నేను చూసుకుం టాలే గానీ.. నీకు వికాస్‌గారి ఇల్లు తెలుసా? " అడిగింది అపూర్వ.

"అంత బాగా తెలియదు. కానీ చెరువు కింద రెండో వీధిలో అని మాత్రం తెలుసు"

"ఆ మాత్రం తెలిస్తే చాలు.. అక్కడికెళ్లి కనుక్కోవచ్చు"

వికాస్ ఇంటి గురించి ఎందుకడుగు తుందో అంతుబట్టలేదు పార్వతికి. తాటి కొండ లైబ్రరీకి వెళ్లొచ్చిన రోజునుంచే పార్వతికి అనుమానం.. అపూర్వ వికాస్ అంటే ఇష్టపడుతోందని. రాత్రికూడా అత నితో తమ ఇంట్లోనే చాలాసేపు మాట్లా డింది. ఇప్పుడు ఏకంగా ఇంటికే వెళ్దామం టుందంటే.. అనుమానం బలపడుతోంది. 'బహుశా స్నేహం పెంచుకోవాలని ఆశి స్తుందేమో' అని కూడా అనుకుంది.

కానీ పార్వతి అనుకున్నంత తేలిగ్గా ఒక వ్యక్తిపై ఇష్టం పెంచుకునే అమ్మాయి కాదు అపూర్వ. అసలామె ఆలోచనే వేరు. ఓ సాహసోపేత నిర్ణయాన్ని అమలు చేసేం దుకు వేసిన పథకంలో భాగంగా వికాస్ సాయం తీసుకోనుంది!

★ ★ ★

అపూర్వపై మత్తు ప్రభావం తొలగిపో యింది మెల్లగా కళ్లువిప్పి చూసింది. 'నాకే మైంది? నేనెక్కడన్నాను? శరీరమంతా తాళ్లతో కట్టేశారేమిటి' ఏదో అడగాలను కుని ఏమీ అడగలేక చుట్టూ చూసింది.

పైన ఫ్యాను స్పీడుగా తిరుగుతోంది.

ఆ సమయంలో కళమ్మ బాత్‌రూములో ఉంది. రాజారావు బయటికెళ్లి ఇంకా రాలేదు. వికాస్ ఒక్కడే గోడకు అనుకుని కూచుని, పత్రిక చదువుకుంటున్నాడు.

సన్నగా మూలుగు వినిపించటంతో పత్రిక పక్కకు తొలగించి చూశాడు. అపూర్వ కళ్లు విప్పి తననే గమనిస్తోంది. దిగ్గున లేచాడు వికాస్.

"ఎలా ఉంది మేడమ్? ఆర్ యూ ఆల్ రైట్? " మంచం మీద వంగి, తన మొహంలోకి చూస్తూ అడుగుతున్న వికాస్ వంక చిత్రంగా చూసిందామె.

"రాజా.. రాజా బయటికెళ్లాడు. వస్తాడు, ఇప్పుడే వస్తాడు మేడమ్. వాడు రాత్రి నుంచీ.."

వికాస్ మాటల్ని అడ్డుకుంటూ బలవం తంగా గొంతు విప్పిందామె "బా..బు.. బాబెలా ఉన్నాడు? పాప ఏదీ? "

కొద్దిగా కంగారు పడ్డాడు వికాస్.

"బాబు బానే ఉన్నాడు. ఇంటి దగ్గరు న్నాడు. పాప ఇక్కడే ఉంది. మీ అత్తయ్య గారు స్నానం చేయిస్తున్నారు"

"అ...త్త...య్య... అత్తయ్య గారొ చ్చారా? " అంత బాధలో సైతం ఆమె కళ్లలో మెరుపు!

"అవును."

కళమ్మ పాపతోపాటు అక్కడికి చేరు కుని, అపూర్వ మాట్లాడుతుండటం గమ నించి, వడివడిగా మంచం సమీపించింది.

# ఆ విమానంతో ఆటకట్టు!

చతుర ప్రపంచం

పైలట్ కాక్‌పిట్‌లో కూర్చోకుండానే వేల కిలోమీటర్ల దూరంనుంచే విమానాన్ని నడుపుతారంటే నమ్మశక్యం కాదు. వీడియోగేమ్ తరహాలో ఎదురుగా మానిటర్‌ను చూస్తూ జాయ్‌స్టిక్‌తో ఆపరేట్ చేస్తూ నడిపే పైలెట్ రహిత విహంగాలను డ్రోన్ విమానాలు అంటారు. వీటిలో ఎంక్యూ-1 ప్రిడేటర్, ఎంక్యూ-9 రీపర్, ఏజీఎం- 114 హెల్‌ఫైర్ రకాలున్నాయి. వీటిని యుద్ధాలు చేయడానికి, సమాచార సేకరణకు ఉపయోగిస్తారు. నియంత్రణ కేంద్రం నుంచి పైలెట్, సెన్సర్ ఆపరేటర్లు వీటిని నడుపుతారు. జాయ్‌స్టిక్‌కి ఉన్న ఎర్రమీటని నొక్కితే హెల్‌ఫైర్ క్షిపణి దూసుకెళ్లి లక్ష్యాన్ని ఛేదిస్తుంది.



డ్రోన్ విమానాలు ఆఫ్ఘనిస్తాన్‌లోని అమెరికా సైనికులకు రోజుకు నాలుగు వందల గంటల కంటే ఎక్కువ నిడివి గల వీడియో దృశ్యాలు అందిస్తున్నాయి. ఆల్‌ఖైదా, తాలిబన్ ఉగ్రవాదులు లక్ష్యంగా ఈ విమానాలు చాలా దాడులు చేశాయి. 2010లో అమెరికా రక్షణ బడ్జెట్‌లో వీటికోసం 350 కోట్ల డాలర్లు కేటాయించింది.

ఒక ఉగ్రవాదిని చంపడానికి సగటున డ్రోన్‌లవల్ల పది మంది పౌరులు మరణిస్తున్నారని, దానికి కారణం తాలిబన్లు పౌరుల మధ్య దాక్కుంటున్నారని, దాంతో పౌరుల రక్షణ విషయంలో అమెరికా విఫలమయిందని ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల మండలి ఆరోపించింది. అత్యాధునిక ఎఫ్-16 యుద్ధ విమానంతో దాడి చేసినా, డ్రోన్‌లతో దాడిచేసినా ఫలితం ఒక్కటే. సంక్లిష్ట ప్రాంతాలలోకి దిగాల్సిన అవసరాన్ని డ్రోన్‌లు తప్పించి సైనికుల ప్రాణనష్టాన్ని పూర్తిగా నివారిస్తున్నాయి. ఆల్‌ఖైదా అగ్రనేత ఇలియాస్ కష్మీరీని మట్టుపెట్టింది డ్రోన్ విమానమే.

"ఏమ్మా, లేచావా?" ఏం మాట్లాడాలో అర్థం కాలేదు కళమ్మకు. నీళ్లు నిండిన కళ్లతో కోడలి మొహంలోకే చూస్తుండిపోయింది. పాప భయం భయంగా తల్లి వంక చూస్తోంది.

అపూర్వకు నోటి వెంట మాట రావటం లేదు. అత్తను, కూతుర్ని మార్చి మార్చి చూస్తోంది. ఆమెకు తెలియకుండానే కళ్ల వెంట నీరుబికి, చెవుల మీదగా కిందికి జారుతోంది. రెండు చేతులూ జోడించి, అత్తగారికి నమస్కారం చేయబోయి, విఫలమైంది.

"ఛఛ.. అదేంటి అపూర్వా ఏడుస్తావ్? తప్పు" అంటూ తన కొంగుతో కోడలి కళ్లు తుడిచింది.

"చూశారా అత్తయ్యా నీ కోడలికి ఎలా అయ్యిందో..." అంటూ మళ్లీ ఏడుపందుకుంది అపూర్వ.

"మేడమ్.. మీరలా ఏడవకూడదు. అమ్మా.. ఇప్పుడు నువ్వు వేరే పనులు మానేసి, అపూర్వనే చూసుకో. ముందామెకు ధైర్యం చెప్పు. మీరిద్దరూ ఏడిస్తే పాప ఏడుస్తుంది. అపూర్వకు స్పృహ వచ్చిన విషయం డాక్టర్‌గారికి చెప్పి వస్తా. ఆయనొచ్చి చూస్తే బాగుంటుంది" పాపను తన చేతుల్లోకి తీసుకున్నాడు.

వెళ్లబోయేవాడల్లా ఆగి, "చెప్పటం మార్చిపోయా. రాజారావు కాన్వెంటు దగ్గరికెళ్లి వస్తానన్నాడు. అరగంటలో వస్తాడట.. ఫోన్ చేశాడు" అని వెళ్లిపోయాడు.

మంచానికి దగ్గరగా స్టూలు లాక్కొని కూచుంది కళమ్మ. అపూర్వ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది. ఆప్యాయంగా స్పృశించింది.

"ఏమిటమ్మా.. ఏమిటీ ఘోరం? " ఎంత ప్రయత్నించినా నిగ్రహంతో ఉండలేకపోతోందామె.

"ఖర్మ.. ఖర్మ అత్తయ్యా.."

ఇద్దరూ దుఃఖంలో మునిగిపోయారు.

ఆ స్థితి నుంచీ కళమ్మ కోలుకొని, కళ్లు తుడుచుకుంది. కోడలికి ధైర్యం చెప్పింది. మరేం ఫర్వాలేదంటూ భరోసా ఇచ్చింది. తాను తోడుగా ఉంటానంది.

వికాస్ డాక్టర్ని తీసుకొచ్చాడు.

డాక్టర్ అపూర్వని రకరకాల ప్రశ్నలు వేశాడు. ఆమెకెలా సేవలందించాలో కళమ్మకు వివరించాడు.

వెళ్లేటప్పుడు వికాస్‌తో "షి యీజ్ ఆల్ రైట్" అని చెప్పాడు. నెత్తిమీంచి భారం దిగిపోయినట్లు ఫీలయ్యాడు వికాస్.

★ ★ ★

పాతకాలపు డాబా. ఇంటి ముందు కొద్దిగా మెల్లా. ఓ పక్కన ఇంటికి పెద్దదిక్కులా వేప చెట్టు.

సాయంత్రం ఐదున్నర గంటలవుతుండగా అపూర్వ, పార్వతి ఆ ఇంట్లో అడుగు పెట్టారు.

చెట్టు కింద నులకమంచంపై ఓ వృద్ధురాలు కూచొని ఉంది. అనారోగ్యంతో మూలుగుతోంది.

వారిద్దరూ ఆమెకు దగ్గరగా వెళ్లి "వికాస్ ఉన్నాడా? " అని అడుగుతుండగానే అతను ఇంట్లోంచి బయటికొచ్చాడు.

"రండి మేడమ్, రండి. మీ కోసమే చూస్తున్నా" అంటూ ఆహ్వానించాడు. ఇద్దరూ గబాగబా లోపలికి నడవబోతుండగా వికాస్ కంగారుగా "జాగ్రత్తండీ.. మా ఇంటి చూరుకి సిగ్గెక్కువ.. తల దించుకొని ఉంటుంది" అన్నాడు.

ఇద్దరూ అర్థం కానట్టు చూశారు.

"అదేంటండీ.. దీని భావమేమి తిరుమలేశ అన్నట్లు చూస్తూ నిలబడిపోయారు... మరేం లేదు, మా చూరు తగుల్తుంది, ఒంగి నడవమని చెప్పానంతే" అన్నాడు నవ్వుతూ.

వాళ్లు కూడా తేలిగ్గా నవ్వేసి, ముందు గదిలోకి వెళ్లారు.

"హమ్మయ్య, నవ్వారా! మీ ఫేసుల్లోని సీరియస్‌నెస్ పోగొట్టాలనే అలా మాట్లాడా"

అపూర్వ కళ్లతో వికాస్‌ను ఏదో అడగటం.. అతను సైగల్తోనే సమాధానమివ్వటం పార్వతి చూపుల్నుంచి తప్పించుకోలేదు.

"పార్వతీ, నువ్వు లోపలికి వెళ్లు" అంది అపూర్వ లోపలికి దారి చూపిస్తూ.

పార్వతికంతా అయోమయంగా ఉంది. ఎందుకన్నట్లుగా చూసింది. 'వెళ్లమన్నానా' అన్నట్లు కళ్లతోనే ఆదేశాలు జారీ చేసింది అపూర్వ.

పార్వతి లోపలి గదిలోకి వెళ్లింది. ఆ గది కొంచెం చీకటిగా ఉండడంతో ముందు ఏమీ కనిపించ లేదు. కొన్ని సెకన్లు గడిచే సరికే.. ఆ గదిలో ఓ మంచం.. దానిపై కూచున్న ఓ వ్యక్తి ఆకారం.. ఆ ఆకారం తన మహేష్‌దేనని గ్రహించటం.. మరుక్షణమే పరుగున వెళ్లి అతన్ని అల్లుకుపోవటం.. ఆమె ప్రమేయం లేకుండానే జరిగిపోయాయి.

వికాస్ ఇంటికి వెళ్దామని అపూర్వ అడగ్గానే తన మదిలో మెదిలిన ఆలోచన తప్పన్న విషయం.. అప్పటిగ్గానీ పార్వతికి అర్థం కాలేదు.

అంతేకాదు.. ఓ గడుగ్గాయి ద్వారా- సాయంత్రం అయిదు గంటలకల్లా మీ ఇంటికొస్తామని.. ఆ పాటికి మహేష్‌ను కూడా అక్కడికి రప్పించే బాధ్యత మీదేనని- వికాస్‌కు రాయబారం పంపిన విషయం కూడా పార్వతికి తెలియదు.

కోరుకున్న ప్రియుడి కౌగిట్లో కరిగిపోతున్నా.. ఆ క్షణం ఆమె మనసంతా అపూ

ర్వపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

వారిద్దరి మధ్యా ప్రేమైక క్షణాలు గడ్డ కట్టి పోగా..

బయట - అపూర్వ, వికాస్‌ల మధ్య సీరియస్‌గా సంభాషణ సాగుతోంది.

అప్పటికే పార్వతికి పెళ్లయిన విషయం.. భర్తను కోల్పోయిన వైనం... ఆమె చేసిన ప్రతిజ్ఞ.. దురదృష్ట దినాలన్నీ కరిగిపోయి, మళ్లీ మహేష్ రూపంలో వసంతం చిగురించటం.. వారి కలయికకు అడ్డుగా ఉన్న పరిస్థితి.. అన్నీ వివరంగా చెప్పింది అపూర్వ.

"ఈ పరిస్థితుల్లో కాస్తయినా మానవత్వంతో ఆలోచించగల వ్యక్తి ఈ గ్రామంలో మీరొక్కరే. ఏ క్షణాన మీరు పరిచయమయ్యారో గానీ మాకు బాగా కావాల్సిన వ్యక్తిలా అనిపించారు.."

ఆమె మాటలు వికాస్‌ని పులకింపజేశాయి. అతని మనసు దూదిపింజలా తేలిపోసాగింది. తాను అపూర్వపై ఆశలు పెంచుకోవటంలో తప్పేమీ లేదని నిశ్చయించుకున్నాడు. ఆరాధనగా చూశాడామె కళ్ళల్లోకి.

ఆమె చెబుతూనే ఉంది..

"అడిగితే తప్పక సాయం చేస్తారనిపించి, ధైర్యంగా మీకా లెటరు పంపాను"

"భలే వారండీ. ఇదో పెద్ద సాయమా? ఇంతకీ వీళ్లిద్దరినీ కలపడానికి ఏం చేయాలనుకుంటున్నారు?" అడిగాడు వికాస్.

"ఏదో ఒకటి మనమే చేయాలి. ఇటు మా నాన్నగారు గానీ, అటు నారాయణ గానీ ఈ పెళ్లికి ససేమిరా ఒప్పుకోరు. ఏదో ఒకటి తెగింపు చేస్తేనే పరిష్కారం"

"రహస్యంగా పెళ్లి చేద్దామంటారా?"

"దాదాపు అంతే! మరో దారి లేదు"

"రహస్యంగా పెళ్లయితే చేస్తాం. అదేమంత కష్టం కాదు. కానీ ఆ తర్వాత వీరి బతుకేమిటి?"

"ఆ విషయమూ ఆలోచించానండి. పైకి కఠినంగా కనిపించినా, మా నాన్న చాలా మంచివాడు. ఆయనది జాలిగుండె. పెళ్లయ్యాక తప్పకుండా వారిని చేరదీస్తాడు. ఎందుకంటే ఆయనకు నాకన్నా పార్వతి పైనే ప్రేమ ఎక్కువ. నారాయణను ఎదిరించైనా సరే అల్లుడ్ని తెచ్చి ఇంట్లో పెట్టుకోగలడు. వారికో దారి చూపగలడు"

"మీరేమీ అనుకోనంటే చిన్న డౌటు. పార్వతి మీ నాన్నగారికి మేనకోడలు కదా?"

"అవును."

"మరప్పుడు మహేష్ అల్లుడెలా అవుతాడు?"

> **కొత్తగాలి...**
>
> **ఓటుకి**
> **నోటు**
> **అందుకే దేశంలో**
> **అన్నిటికీ లోటు**
>
> - ఎన్.కె. నాగేశ్వర్,
>
> పెనుగొండ, ప.గో. జిల్లా

పెద్దగా నవ్వేసింది అపూర్వ..

"నిజమే. చూశారా.. అది మా నాన్న చెల్లెలి కూతురన్న విషయమే నాకు గుర్తు లేదు. ఇప్పటికీ అది ఆయనకి పెద్దకూతురనే అనుకుంటాను.."

"అదృష్టవంతులండీ!"

"ఎందుకు?"

"అంతమంచి నాన్న మీకున్నందుకు!"

"నిజమే"

"ఒక్క నిమిషంలో వస్తాను.. ఈ మ్యాగజైన్ చూస్తుండండి" అంటూ ఓ వీక్లీని చేతికందించి, కిచెన్‌లోకి వెళ్లాడు.

అయిదు నిమిషాల్లో నాలుగు కప్పుల్లో

టీ నింపుకొని, ట్రేలో పెట్టుకొని వచ్చాడు.
ముందు లోపలి గదిలోకి వెళ్లబోతూ, గడప దగ్గరే ఆగి, తలుపుపై కొట్టాడు. మహేష్ గడప దగ్గరకు వచ్చాడు. రెండు కప్పుల్ని అతనికందించాడు.

ఒక కప్పు అపూర్వకిచ్చి, ఒకటి తను తీసుకున్నాడు.

"అవును, ఈ పత్రికలో వికాస్ పేరుమీద కథ వచ్చింది. కొంపదీసి మీరుగానీ కాదు గదా!" టీ సిప్‌చేస్తూ అడిగిందామె.

"కొంపదీయకుండా ఆ వికాస్‌ని నేనే"

"నిజమా! అంటే మీరు రచయిత కూడా అన్నమాట!" ఆశ్చర్యంగా, ఆనందంగా అడిగిందామె.

"సీరియస్ రైటర్ని కాదు. ఏదో.. అప్పుడప్పుడూ చెయ్యి చేసుకుంటుంటా. రాయకుండా ఉండలేని సందర్భం నా మనసును ఉక్కిరిబిక్కిరి చేసినప్పుడు నిస్సందేహంగా కథ రాసి తీరుతా" అతని మాటల్లో ఆత్మ విశ్వాసం తొణికిసలాడింది.

అప్పటికర్థమైంది ఆమెకు, ఎదురుగా అలమరా నిండా ఉన్న షీల్డులన్నీ అతని సాహితీ ప్రతిభకు కొలమానాలని! అతనిపై ఆమెకు మరింత గౌరవం పెరిగింది.

"ఇంతకీ మనం రూటుమారినట్లున్నాం"

"అవును కదూ" అంది నవ్వుతూ.

"మరి వాళ్ల పెళ్లికి ఏమిటి మార్గం?"

"వచ్చే సోమవారమే వాళ్ల పెళ్లి. మీరూ, నేనే పెద్దలం, సాక్షులం"

"ఎక్కడ? ఎలా?"

"ఆరోజు ఉదయం పది గంటలకల్లా నేను పార్వతిని తీసుకొని గుంటూరులో రిజిస్ట్రార్ ఆఫీసు దగ్గరికొస్తాను. మీరు మహేష్‌ని తీసుకొని అక్కడికొచ్చెయ్యండి"

వెంటనే ఓకే చెప్పలేదు వికాస్.

"ఏమిటి, భయపడుతున్నారా?" అడిగింది అపూర్వ.

"ఛఛ.. భయం కాదు. ఆలోచిస్తున్నాను. అక్కడ పెళ్లి వరకు ఓకే. పెళ్లి చేసుకొని ఊళ్లోకి వచ్చాక వీరిద్దరూ ఎక్కడుంటారు? ఎలా ఉంటారు?"

"అంతా అయిపోయాక, ఇంక వాళ్లు మాత్రం ఏంచెయ్యగలరు? అప్పుడు చూద్దాంలెండి, కొత్తజంట ఉంటానికి నీడే దొరక్కపోతుందా?"

"ఒక పని చేద్దాం.."

ఏమిటన్నట్లు చూసిందామె.

"మా ఇంట్లోనే ఉంచుదాం" అన్నాడు వికాస్.

అపూర్వ మొహం వికసించింది. తాను ఏం ఆశించి వచ్చిందో ఆ ఫలితం లభించినందుకు సంతోషపడింది.

అసలీ వ్యవహారంలో వికాస్ సాయం కోరటం వెనక అపూర్వ గొప్ప వ్యూహ రచన చేసింది.

పార్వతి-మహేష్‌ల పెళ్లికి నారాయణ సుతరామూ ఒప్పుకోడని అపూర్వ నిర్ధరించుకుంది. కాబట్టి వీరి పెళ్లి ప్రస్తావన అంటూ ఏదైనా వచ్చిందంటే, దాన్ని అడ్డుకోవడానికి తన బలగాన్ని ఉసిగొల్పుతాడు. ప్రధానంగా పులిగాడ్ని రంగంలోకి దించుతాడు. అతడు తలలు తెగ్గోయటానికైనా వెనుకాడడు.

అదే జరిగితే పులి గాడికి చెక్ పెట్టగల సమర్థుడు వికాస్ ఒక్కడే. అంత దూరం ఆలోచించే, వికాస్‌ను తెరమీదకి తేవాలని నిశ్చయించుకుంది అపూర్వ.

ఇప్పుడు వికాస్ నోటివెంటే ఆ మాట రావటంతో కొండంత ధైర్యం వచ్చేసింది. ఆనందంగా లేచి, వికాస్ చేతినందుకుని "థ్యాంక్సండీ. థ్యాంక్యూ వెరీమచ్" అంది.

అపూర్వ చేతి స్పర్శతో వికాస్ పరవశించిపోయాడు. గాలిలో తేలిపోయాడు.

అదే తన ప్రేమకు బలమైన పునాదిగా భావించాడు.

"ఈ పెళ్ళి అయ్యేంత వరకూ మీకే

సాయం కావాలన్నా సిద్ధంగా ఉంటా. ఎలాంటి ఇబ్బందులెదురైనా కలిసే భరిద్దాం. మనసులు కలిసిన ఆ ఇద్దరి జీవితాలను కలుపుదాం అపూర్వగారూ"

"ఇదిగో చూడండి. సినిమాల్లోనూ నవ లల్లోనూ రోటీన్ డైలాగే అయినా.. నేను కూడా అదే చెప్పక తప్పటం లేదు. మీరు నన్ను 'గారూ' అని గీరటం మానెయ్యండి' ' అంది నవ్వుతూ.

"సరే అపూర్వ"

ఇద్దరూ నవ్వుకున్నారు.

పార్వతి, మహేష్ బయటికొచ్చారు.

"పార్వతీ వెళ్దామా?" అడిగింది అపూర్వ.

సరేనంటూ ఆమె బయల్దేరింది.

"అపూర్వగారూ.." వెళ్లబోతున్నదల్లా గభాల్న ఆగి, వెనక్కి తిరిగి చూసింది.

మహేష్!

రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ నిలబడి ఉన్నాడు. అతని కళ్లలో తడి స్పష్టంగా కనిపిస్తోంది.

అపూర్వ ప్రతి నమస్కారం చేసి, గబ గబా బయటికి నడిచింది, పార్వతితో పాటు.

★ ★ ★

అరగంటలో వస్తానని చెప్పిన రాజా రావు గంటన్నర గడిచాక వచ్చాడు. అతని కోసమేనన్నట్లు వరండాలో బల్లమీద కూచొని, ఎదురు చూస్తున్న వికాస్, రాజా రావు రాగానే "ఇంత సేపేంటి? అపూర్వకి స్పృహ వచ్చింది. బాగానే మాట్లాడు తోంది. వెళి చూడు" అన్నాడు ఎదురొచ్చి.

రాజారావు గదిలోకి వచ్చేసరికే కోడలికి కళమ్మ స్పూనుతో పాలు తాపిస్తోంది. కొడుకుని చూడగానే గ్లాసు పక్కన పెట్టి, లేచి బయటికొచ్చింది.

"అప్పూ.. అప్పూ.. ఎందుకింత పని చేశావ్? నువ్వే ఇలా అయితే నేనేమైపో వాలి? మన పిల్లలేమవుతారు?" ఏడుస్తూ

## తొలి నవల ఇదే!



**ముప్వా వెంకటరామిరెడ్డి**

పుట్టింది, పెరిగింది గుంటూరు జిల్లా తుళ్లూరు మండలం పెదపరిమి గ్రామంలో. సోషల్‌వర్క్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశాను. పదకొండేళ్లపాటు ప్రముఖ దినపత్రిక 'ఈనా డు'లో సబ్-ఎడిటర్‌గా విధులు నిర్వహిం చాను. ప్రస్తుతం 'రామ్‌కీ ఫౌండేషన్'లో హెడ్ ఆపరేషన్స్‌గా దేశవ్యాప్తంగా స్వచ్ఛంద సేవా కార్యక్రమాలను పర్యవేక్షిస్తున్నా. రచనా వ్యాసంగంపై నా మక్కువను వదులు కోలేదు. ఇప్పటికే 'బిందువు', 'మనిషిజాడ' అనే రెండు కవితా సంపుటాలు, 'వెన్నలో లావా' అనే కథాసంపుటిని తీసుకొచ్చాను. నాకు అత్యంత సంతృప్తినిస్తున్న మరో అంశం మా నాన్నగారి స్మృత్యర్థం 'ముప్వా చినబాపిరెడ్డి మెమోరియల్ ట్రస్ట్'ను స్థాపించి, పద్నాలుగేళ్లుగా దాని తరపున వివిధ సామాజిక కార్యక్రమాలు చేపట్టడం. 'సగం కాలిన జీవితం' నా తొలి నవల. దీన్ని ప్రచురణకు స్వీకరించి, ప్రోత్సహిస్తున్న 'చతుర' సంపాదకవర్గానికి కృతజ్ఞతలు.

**చిరునామా : ఎమ్వీ రామిరెడ్డి,**
102, శ్రీకోట రెసిడెన్సీ
పోలీస్ స్టేషన్ దగ్గర,
మియాపూర్, హైదరాబాద్-49

తన రెండు చేతుల్లోకి ఆమె మొహాన్ని ఇముడ్చుకొంటూ అన్నాడు.

అపూర్వ మాట్లాడలేదు. నిర్వికారంగా

కాసేపు అతని వైపు చూసి, తల మరోవైపు తిప్పుకుంది.

"నేనేదైనా తప్పు చేశాననుకుంటే నన్ను శిక్షించు. కానీ నువ్విలా అఘాయిత్యాలకు పాల్పడటం న్యాయమా? "

దుఃఖంతో తల్లడిల్లుతున్న భర్తను చూసి చలించిపోయింది. ఆమె కళ్ల వెంట జల జలా నీటిబొట్లు రాలాయి.

"వద్దు.. వద్దు అప్పూ.. ఇక నువ్వు ఏడ వద్దు. జరిగిందేదో జరిగిపోయింది. ఇకపై నిన్ను నా గుండెల్లో పెట్టుకొని చూసు కుంటా. కంటికి రెప్పలా కాపాడుకుంటా"

అపూర్వ కళ్లలో కొద్దిగా మెరుపు!

> **కొత్తగాలి...**
>
> **తల్లిదండ్రులు వృద్ధాశ్రమంలో**
> **పిల్లలు హాస్టళ్లలో**
> **భార్యాభర్తలు ఆఫీసుల్లో**
> **ఇదీ నేటి పరిమితకుటుంబం**
>
> – కాళ్ల గోవిందరావు,
> ఆముదాలవలస, శ్రీకాకుళం జిల్లా

ఆమె చేతిలో చెయ్యి వేశాడు రాజారావు.

బయట.. అదే సమయానికి..

"బాబూ.. డాక్టరుగారేమన్నారు? " అడి గింది కళమ్మ.

"ప్రాణాపాయం లేదన్నారమ్మా. అయితే తను కోలుకోవాలంటే చాలా కాలం పడు తుందని చెప్పారు. కొన్ని నెలలపాటు తన పని తాను చేసుకోలేదంట. చిన్న పిల్లలా చూసుకోవాలంట. గాయాలు మానేదాకా చాలా శ్రద్ధ తీసుకోవాలంట"

నిట్టూర్చింది కళమ్మ.

"ఇంతకీ నువ్వు డబ్బుల సంగతి చెప్ప లేదు. ఆయన ఫోనుకోసం చూస్తుంటారు"

"తొందరేం లేదులెమ్మా. ప్రస్తుతానికి నా దగ్గర ఉన్నవాటిని వాడదాం. వీలైనం తవరకూ నాన్న ఇక్కడికి రాకుండా చూద్దాం"

"అదేంటి? " అడిగిందామె ఆశ్చర్యంగా.

"ఏం లేదమ్మా.. నాన్న వచ్చాడంటే ఆయనవెంట నారాయణ వస్తాడు. ఈ సంగతి నలుగురికీ తెలుస్తుంది. ఊళ్లో రక రకాలుగా చెప్పుకుంటారు. కాస్త నయమ య్యాక చెబుదాం. సరే, నేను కాస్త లైబ్రరీ దాకా వెళ్లొస్తాను. ఇవ్వాళ కూడా తెరవక పోతే బాగోదు. మధ్యాహ్నం వస్తా. ఏదైనా అవసరముంటే ఫోన్జెయ్యి" వెళ్ళిపోయాడు వికాస్.

★ ★ ★

ఆ రోజు బస్ స్టేజీ దగ్గర జరిగిన బాంబుదాడిలో నారాయణ వర్గానికి చెందిన మనిషి గాయపడ్డాడు. అతను మరుసటి రోజు గుంటూరులో ఆస్పత్రిలో మృతి చెందాడు.

ఈ కబురు ఊరికి చేరగానే నారాయణ అగ్గిమీద గుగ్గిలమయ్యాడు. మాధవయ్య మనుషులు విసిరిన బాంబులవల్లే అతను చనిపోయాడనీ, వాళ్లను తేలిగ్గా వదలేయ కూడదనీ తన అనుచరుల ఎదుట ఆగ్రహం వ్యక్తం చేశాడు.

వాళ్లంతా ఆవేశంతో ఊగిపోతూ ప్రతీ కారం తీర్చుకుంటామంటూ ప్రతిజ్ఞ చేశారు. మాధవయ్య వర్గానికి చెందిన నలుగురి పశువుల కొట్టాలకు, గడ్డివాము లకు నిప్పంటించారు.

చాలా నష్టం వాటిల్లింది. మాధవయ్య మనుషులు నారాయణ వర్గంపై తాటి కొండ పోలీస్ స్టేషన్లో కేసు పెట్టారు.

ఊళ్లో శాంతిభద్రతలకు విఘాతం కలగ టంతో గ్రామంలో ఒక పోలీస్‌పోస్ట్ ఏర్పాటు చేశారు. 144 సెక్షన్ అమల్లో పెట్టారు. పోలీసుల పహారాలో ఊరు బిక్కుబిక్కుమంటూ కాలం గడుపుతోంది.

గుంటూరు రిజిస్ట్రార్ ఆఫీసులో పార్వతి-మహేష్‌ల పెళ్లి జరిపించటానికి ఒకరకంగా ఊళ్లోని పరిస్థితి సహకరించింది. అపూర్వ, వికాస్‌లు ఊపిరి పీల్చుకున్నారు.

కొత్తజంటను వికాస్ ఇంట్లో దిగబెట్టి, పొద్దుగూకుతుండగా ఇంటికి చేరుకుంది అపూర్వ.

ఆమె బాత్‌రూము కెళ్లి, కాళ్లూమొహం కడుక్కొని బయటికొచ్చేసరికే మాధవయ్య కూడా ఇంటికి చేరుకున్నాడు. ఆయన కాలుకాలిన పిల్లిలా పచార్లు చేస్తున్నాడు.

ఏమైందో అంతుబట్టలేదు అపూర్వకు.

ఆమెను చూడగానే ఠక్కున ఆగిపోయి, అంతెత్తున లేచాడు మాధవయ్య.

"బుద్ధుందా నీకు? మాట మాత్రం నాకు చెప్పొద్దూ! అప్పుడే అంత పెద్దదానివైపోయావా?" నిప్పులు కక్కాడు.

తలొంచుకు నిలబడిందే తప్ప సమాధానమివ్వలేదు అపూర్వ.

"ఇప్పుడు చూడు.. ఏమైందో! ఈ విషయం ఆ నారాయణగాడికి తెలిసిపోయింది. కొడుకని కూడా చూడకుండా మహేష్‌నీ, మన పార్వతినీ చంపెయ్యమంటూ మనుషుల్ని పంపాడు. ఇవ్వాళ అసలేం జరుగుతుందో ఏమో? ఈ పెళ్లి నేనే చేయించాననుకుంటున్నాడు. ఇప్పటికైనా అర్థమైందా నువ్వెంత ఘోరమైన తప్పు చేశావో?" అంటూ పైపంచె విదిల్చి, భుజాన వేసుకుని బయటికెళ్లబోయాడు.

మళ్లీ ఆగి, "ఇప్పుడిక ఆయుధాల్ని బయటికి తియ్యక నాకూ తప్పదు. ఎందుకంటే మన పార్వతినైనా నేను కాపాడుకోవాలిగా" అనేసి ఆవేశంగా వెళ్లిపోయాడు.

అపూర్వ గుండెల్లో రాయి పడింది. చెమట్లు పట్టాయి.

ఇప్పుడెలా?

ముందు అర్జెంటుగా వికాస్ ఇంటికెళ్లాలని నిర్ణయించుకుంది.

చేతుల్లో టీ కప్పుతో వెనక నుంచీ తల్లి పిలుస్తున్నా వినకుండా పరుగులాంటి నడకతో బయటికెళ్లింది.

నేరుగా వికాస్ ఇంటికి చేరుకుంది. అక్కడెవరూ జనం లేకపోవడంతో ఊపిరి పీల్చుకుంది.

"పార్వతీ.. పార్వతీ.."

అపూర్వ పిలుపు విని కొత్త దంపతులు బయటికొచ్చారు.

"వికాస్ ఏడీ?" ఆమె కంగారును చూసి భయపడ్డారిద్దరూ.

"ఏవో కొనుక్కురావటానికని బయటికెళ్లాడు. ఏమైందే, అలా వణికిపోతున్నావ్?" అడిగింది పార్వతి.

"మహేష్, పెళ్లి విషయం మీ నాన్నకు తెలిసిపోయిందట. ఆయన చాలా కోపంగా ఉన్నాడట. మీ కోసం వెతుకుతున్నాడని.." ఆమె మాటలు పూర్తి కాకముందే బయట కలకలం వినిపించింది.

చేతిలో పొడవాటి కత్తితో ఆవేశంగా ఆ ఇంటివైపే వస్తున్నాడు పులిగాడు. అతని వెనక పదిమంది దాకా ఉన్నారు. అందరి చేతుల్లోనూ మారణాయుధాలున్నాయి.

బెంబేలెత్తిపోయింది అపూర్వ.

ఎలా ఈ మారణహోమాన్ని ఆపటం?

సమయానికి వికాస్ కూడా లేడే!

అనుచరులు బయటే ఆగిపోగా, పులిగాడు ఒక్కడే లోపలికి వచ్చాడు.

అపూర్వకు మొండి ధైర్యం వచ్చేసింది. గభాల్న దంపతుల్ని లోపలి గదిలోకి పంపించి, గడియ పెట్టింది. లోపల్నుంచీ గడియ వేసుకోమంటూ అరిచింది.

తలుపులకడ్డంగా అమ్మోరులా నిలుచుంది.

దగ్గరగా వచ్చి పులిగాడు "నువ్వేనా వీళ్లకి పెళ్లి చేసి వీరనారివి?" అన్నాడు వెటకారంగా.

"అవును" అందామె తడారిన గొంతుతో.

"నారాయణగారి గురించీ, నా గురించీ తెలిసే ఈ పని చేశావా? " అతడి గొంతు కరకుగా ఉంది.

"మీ గురించి నాకు బాగానే తెలుసు. కానీ మీకేం తెలుసు? ప్రేమ అనే పదం ఎప్పుడైనా విన్నారా? "

"పనికిమాలిన పదాలతో మాకేం పని? "

"అవున్లే.. రాక్షసులకు ప్రేమతో పనేముంటుంది? "

"ఏయ్.. పిచ్చి పిచ్చిగా వాగకు. మర్యాదగా చెబుతున్నా. మీ అమ్మాయిని నువ్వు తీసుకెళ్లు. మహేష్‌గాణ్ని మాకప్పగించు"

"లేకపోతే.. "

## కొత్తగాలి...

**తనకేమీ తెలియదనే సంగతి**
**తెలుసుకోవడానికి**
**మనిషికి**
**ఒక జీవితకాలం పడుతుంది**

*– రాజ్‌త్రి ఎడ్వర్డ్,*
*కల్యాణ్‌నగర్, హైదరాబాద్*

"పుచ్చెలెగిరిపోతాయ్. వాళ్లిద్దర్నీ నిలువునా నరికేస్తాం. ఊళ్లో రక్తపుటేరులు పారతాయి"

"వాళ్లిద్దరూ చట్టబద్ధంగా పెళ్లి చేసుకున్నారు. ఇప్పుడు వాళ్ల మీద మీకెలాంటి హక్కులేదు" ధైర్యంగా వాదనకు దిగింది.

"చట్టాలు, పోలీసులు.. ఇవన్నీ గాలిమాటలు. చదువుకున్న దానివి.. బుద్ధిగా నేను చెప్పింది చెయ్"

"వీల్లేదు.. "

ఆమెమాట పూర్తిగాక ముందే పులిగాడు మెరుపులా కదిలాడు. ఆమె రెక్క పుచ్చుకొని పక్కకు తోశాడు. అపూర్వ గిర్రున తిరిగి, దబ్బుమని నేలపై పడిపోయింది.

పులిగాడు తలుపుల్ని బద్దలు కొట్టడం ప్రారంభించాడు.

అపూర్వ వెన్నులో వణుకు మొదలైంది. కాలూచెయ్యీ ఆడటం లేదు.

సరిగ్గా ఆ సమయంలో ఆపద్బాంధవుడిలా వచ్చాడు వికాస్. బయట అంత మంది ఎందుకున్నారో తెలియకపోయినా లోపలికి రాగానే విషయం అర్థమైంది.

చేతుల్లోని స్వీట్లు, పూలు విసిరేసి, పులిగాణ్ని అడ్డుకొని, పట్టి కుదిపేశాడు.

అపూర్వ మనసు కుదుటపడింది.

"వికాస్! ఏమైందిరా నీకు? వీళ్లని నీ ఇంట్లో ఎందుకుంచుకున్నావ్? పంపెయ్.. అర్జెంటుగా బయటికి పంపెయ్.. " అన్నాడు పులిగాడు కోపంగా చూస్తూ.

"నాకు నచ్చిన పని నేను చేశా"

"ఈ పని నారాయణగారికి నచ్చలేదు" గంభీరంగా అన్నాడు పులిగాడు.

"అందుకని..? "

"ఎవ్వరడ్డొచ్చినా లెక్కచేయకుండా వీళ్లని తీసుకొచ్చేయమన్నాడు"

"నా ఇంటినే బద్దలు కొడతావా? "

"తప్పదు"

"నేను తప్పు చేశాననే నమ్ముతున్నావా? "

"లేదు. ఈ ప్రపంచంలో తప్పు చెయ్యని మనిషి ఎవడైనా ఉన్నాడూ అంటే అది నువ్వే. నాకా నమ్మకముంది"

"అయితే నా మాట విను. వెళ్లిపో"

"సారీ, ఆ ఒక్కటీ అడక్కు"

హఠాత్తుగా వికాస్ రెండు చేతులూ జోడించి పులిగాడికి నమస్కరిస్తూ "రేయ్.. ఇంకెప్పుడూ నిన్నేమీ అడగను. ప్లీజ్, ఈ ఒక్క విషయంలో సాయం చెయ్యి. వాళ్లిద్దరూ కోటి ఆశలతో ఒక్కటయ్యారు. విడదీయటం భావ్యంకాదు" అంటూ పులిగాడి కాళ్లు పట్టుకోబోయాడు.

తన మిత్రుడు ఏం చేయబోతున్నాడో పసిగట్టిన పులిగాడు గభాల్న వికాస్‌ను




# ఆహారం.. పరిహారం!

అమెరికాలో 'షిపోట్లే మెక్సికన్ గ్రిల్' అనే ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్ల గొలుసు ఉంది. అన్నం లేదా చపాతీతో పాటు మనం కోరే వెజిటేరియన్ లేదా నాన్ వెజిటేరియన్ ఐటమ్స్ సరఫరా చేస్తుంది. 'పింటో బీన్స్' అనే కూర కూడా ఇస్తారు. ఆగస్ట్ 2011లో కాలిఫోర్నియాలోని వెజిటేరియన్ లాయర్ కెవిన్ షెంక్‌మన్ ఆ రెస్టారెంట్ మీద కోటిడాలర్లకు నష్టపరిహారం కేసు వేసాడు. కారణం పింటో బీన్స్‌లో ఎద్దు, పంది మాంసం కలుపుతారు. రెస్టారెంట్ ఆరంభించిన పద్దెనిమిదేళ్ల చరిత్రలో ఎన్నడూ పింటో బీన్స్‌లో మాంసాహారం కలుస్తుందనే బోర్డు ఎక్కడా ఉంచకపోగా, వారి వెబ్‌సైట్ మెనూకార్డులో దాన్ని వెజిటేరియన్‌గా పేర్కొన్నారు. శాకాహారి యూదు అయిన కెవిన్ షెంక్ తమ మతాచారం ప్రకారం పందిమాంసం తినడం నిషిద్ధం. అందుకని నష్టపరిహారానికి కేసు వేసాడు. దాంతో కళ్ళుతెరిచిన షిపోట్లే, 'మా దగ్గర లభించే బ్లాక్ బీన్స్‌లో ఏ మాంసాహారం కలవదు. ఇక మీదట కొత్త మెనూకార్డు ప్రింట్ చేసి, పింటోబీన్స్‌లోనే మాంసం కలుస్తుందని పేర్కొంటాం' అని చెప్పింది.



ఇలాగే మెక్‌డొనాల్డ్స్ రెస్టారెంట్ 'నేచురల్ ఫ్లేవర్డ్ ఫ్రైస్' అన్న ప్రకటన ఇచ్చి ఇబ్బందుల్లో పడింది. ఎందుకంటే మాంసం కొవ్వుని ఉపయోగించి వారు ఫ్రెంచ్ ఫ్రైస్ చేసారని ఓ హిందూ మతస్తుడు కేసు వేశాడు. దాంతో మెక్‌డొనాల్డ్స్ వివిధ హిందూ సంస్థలకు కోటి డాలర్లను నష్టపరిహారంగా ఇచ్చుకుంది విదేశాల్లో ఫాస్ట్ ఫుడ్ తినబోయే ముందు జాగ్రత్తగా విచారణ చేయాలి మరి!

పట్టుకొని, పైకి లేపాడు. చేతిలోని కత్తిని విసిరికొట్టాడు. అంతటి కఠిన హృదయమూ కరిగిపోయింది.

"సరేరా.. నీ మాట విని వెళ్లిపోతున్నా. అలాగే వారిద్దరికీ ఏ హాని జరగబోదని హామీ ఇస్తున్నా. నీ భరోసాతో జరిగిన పెళ్లి కాబట్టి వారిని క్షమించేస్తున్నా.."

వెనుదిరిగి వెళ్తున్న మిత్రుడివైపు కృతజ్ఞతాభావంతో చూస్తూ నిలబడిపోయాడు వికాస్.

అపూర్వ మొహం వికసించింది. మహేష్-పార్వతిల పెళ్లి తంతులో వికాస్‌ను తెరపైకి తేవటంలో తానూహించిన పరిణామం సంభవించటం.. అదేవిధంగా రక్షణ లభించటం.. అంతా కలలా అనిపించింది. వికాస్‌పై ఆమె హృదయం నిండా గౌరవం తొణికిసలాడింది.

ఇద్దరూ కలిసి తలుపులు తెరవమని మహేష్‌ను అడగబోతుండగా హడావుడిగా వచ్చాడు పులిగాడు. వారిద్దరూ కంగారు పడ్డారు. మళ్లీ ఎందుకొచ్చాడో అర్థం కాలేదు. పులిగాడు రొప్పుతూ,

"వికాస్.. అర్జెంటుగా తలుపులు తెరవమని చెప్పండి. వాళ్లు.. వాళ్లు ఊరుకోవటం లేదు.." అని వారితో అంటుండగానే బయటున్న పదిమందీ కత్తులు, కర్రలతో బిలబిలమంటూ దూసుకొస్తుండటం కనిపించింది.

ఏం జరిగిందో క్షణాల్లో ఊహించిన వికాస్ గబాగబా తలుపులపై బాదుతూ, మహేష్‌ను పిలిచాడు.

తలుపులు తెరుచుకోవటమూ.. ఆగంతకులంతా అక్కడికి చేరుకోవటమూ ఒకేసారి జరిగిపోయాయి.

పులిగాడు రివ్వున కదిలి, అపూర్వను గదిలోకి నెట్టాడు. తనూ వెళ్లి వికాస్‌ను గదిలోకి లాగబోతుండగానే వాళ్లు అతడ్ని పట్టుకున్నారు. విధిలేని పరిస్థితిలో పులిగాడు లోపల గడియ బిగించాడు.

బయటి నుంచి వాళ్లంతా తలుపుల్ని బాదుతున్నారు. వికాస్ వారిని అడ్డుకునేందుకు విఫలయత్నం చేస్తున్నాడు. అప్పటికి రాత్రి ఎనిమిది గంటలు దాటింది.

గది లోపల పార్వతి, మహేష్, అపూర్వ అయోమయస్థితిలో ఉన్నారు. ఏం జరుగుతుందో, ఏం జరగబోతుందో అర్థంకాక ఆందోళన చెందుతున్నారు.

పులిగాడు మాత్రం ధైర్యంగా ఉన్నాడు. చేయాల్సిన పని గురించి ఆలోచిస్తున్నాడు.

ఇప్పుడతని ముందున్న కర్తవ్యం.. తన మిత్రుడికి ఇచ్చిన హామీని నిలబెట్టుకోవటం. బయటున్న తన మనుషుల గురించి తనకు బాగా తెలుసు. వాళ్లు మొండి ఘటాలు. ఓ పట్టాన వదలరు. ఎలాగైనా తలుపులు బద్దలు కొడతారు.

అప్పుడు తానొక్కడే అంతమందిని ఎదుర్కోవటం అసాధ్యం. అనివార్యంగా దంపతుల్ని వారికి అప్పగించాల్సి వస్తుంది. అదే జరిగితే.. వాళ్లిద్దరికీ భూమ్మీద నూకలు చెల్లినట్లే!

ఆ గదిలోంచి బయటపడి, తప్పించుకోవటమే మార్గం. తానొక్కడే అయితే తప్పించుకోవటం సమస్యకాదు. కానీ అక్కడ మరో ముగ్గురు ఉన్నారు. వారిని కూడా సురక్షితంగా ఇంకెక్కడికో చేర్చాలి.

గదిని నిశితంగా పరిశీలించాడు.

వెనకవైపు వాడుకలో లేని ద్వారం ఒకటి కనిపించింది. దాని పక్కనే ఉన్న కిటికీ లోంచి బయటకు చూశాడు పులిగాడు. ఆ ఇంటి వెనక రెండు ఇళ్లు.. ఆ తర్వాత చెరువుకట్ట కనిపిస్తున్నాయి.

ఆ ద్వారమే మార్గాంతరమని భావించాడు. ఇనప కడ్డీలతో బిగించివున్న ఆ తలుపుల్ని గట్టిగా పట్టి లాగాడు. అతని ప్రయత్నాన్ని గమనించి అపూర్వ కూడా సాయం పట్టింది. ఎట్టకేలకు కడ్డీలు ఊడివచ్చి తలుపులు తెరుచుకున్నాయి.

"ఊ.. పదండి! పదండి.. ముందు మనం ఇక్కడి నుండి బయటపడాలి" అంటూ తొందరపెట్టాడు.

ముందుగా మహేష్‌నీ, పార్వతీని బయటికి పంపాడు. అపూర్వ అభ్యంతరం చెప్పింది. వికాస్ లేకుండా తాను రానంది. పులిగాడు కోప్పడ్డాడు.

"చూడండీ.. వికాస్ సంగతి మా వాళ్లందరికీ తెలుసు. అతని మీద ఎవ్వరికీ కోపంలేదు. అతన్నేమీ చేయరు. ఎటొచ్చీ మిమ్మల్ని చూస్తేనే వాళ్లు వదిలిపెట్టరు. ప్లీజ్.. నా మాట విని మాతో రండి.." అంటూ సమాధానం కోసం చూడకుండా ఆమె చేయి పట్టుకొని లాక్కెళ్లాడు.

అప్పటికి బయటున్నవాళ్ల ప్రయత్నం ఫలించి తలుపులు ఊడొచ్చాయి.

పులిగాడు ముగ్గురినీ తీసుకుని వెనకవైపు నుంచి పారిపోయాడని గ్రహించారు.

మూకుమ్మడిగా వారిని వెంబడించారు.

వారి వెనకే వికాస్ కూడా పరిగెత్తాడు.

మహేష్, పార్వతి, అపూర్వలను 'వెనక్కి తిరిగి చూడకుండా వేగంగా పరిగెత్త'మని పులిగాడు హెచ్చరించాడు. తాను వెనక వెంబడించేవారిని గమనిస్తూ పరిగెత్తుతున్నాడు.

వెంబడిస్తున్న వారిలోంచి ఒకడు జేబులోంచి నాటుబాంబు తీసి, నోటితో కొరికి, చేతి సత్తువ కొద్దీ విసిరాడు.

అది సరిగ్గా పులిగాడి వెనక పడి పేలటం, ఆ పేలుడు వెలుగులో అతను ఎగిరిపడటం మాత్రమే కనిపించాయి వికాస్‌కి.

వికాస్ నిస్సత్తువగా అక్కడే కూలబడిపో

యాడు.

వాళ్లు మాత్రం మారణాయుధాలతో వెంబడిస్తూనే ఉన్నారు.

★ ★ ★

మధ్యాహ్నం లైబ్రరీ మూసేసి, మెస్‌లో భోంచేసి కళమ్మకు భోజనం పార్శిల్ తీసు కొని, ఆస్పత్రికి వచ్చాడు వికాస్. అతను రాగానే డాక్టరు గారు ఓ సారి కలవమన్నా రని చెప్పిందామె.

వికాస్‌కు ఎందుకో భయం వేసింది.

ఓపీ సమయం కాకపోవటంతో డాక్టరు గారు ఖాళీగా ఉన్నారు. నర్సు అతన్ని చూసి, లోపలికెళ్లి మళ్లీ బయటికొచ్చి "రమ్మంటున్నారు" అని చెప్పింది.

అదురుతున్న గుండెతో లోపలికి నడిచి, డాక్టరుగారికి నమస్కరించాడు. ఆయన కూచోమని సైగ చేశాడు.

"వికాస్, పేషెంట్ నీకేమవుతుంది? " ప్రశ్నించాడు డాక్టర్.

"ఫ్రెండు.. ఫ్రెండు భార్య సార్" సమా ధానం చెప్పేముందు కొద్దిగా తడుముకు న్నాడు వికాస్.

"ఏం లేదు.. పేషెంటు గురించి కొన్ని వివరాలు చెప్పాలి. అందుకనీ.."

"పర్లేదు.. చెప్పండి సార్!"

"ఆమెకు ప్రాణాపాయం లేదని ఉదయం మీకు చెప్పానే గానీ.. నిజానికి నాకే నమ్మకం లేదు. అందుకే ఆమెకింకా అస లైన చికిత్స మొదలు పెట్టలేదు"

'నిజమా? ' అన్నట్లు చూశాడు వికాస్.

అతని సందేహాన్ని గమనించిన వాడిలా "అవును వికాస్. ఎందుకంటే ఆమె బతుకు తుందన్న ఆశ నాకు ఏమాత్రం లేదు. టిష్యూలు కూడా కాలిపోయి ఉంటాయని అనుమానించాను. అయితే ఇందాకే మళ్లీ టెస్ట్ చేయిస్తే, అదేం లేదని తేలింది. నౌ షి ఈజ్ అవుటాఫ్ డేంజర్"

"అసలైన చికిత్స అంటే.."

"అంటే ఆమెనలా జనరల్ వార్డులో ఉంచకూడదు, ఇన్‌ఫెక్షన్ సోకుతుంది. ఆమె సూపర్‌ఫీషియల్ బర్న్ కేటగిరీలోనే ఉంది కాబట్టి గుంటూరు వెళ్లే పనేమీ లేదు. మనవద్దే ట్రీట్‌మెంట్ ఇవ్వవచ్చు"

"థ్యాంక్యూ డాక్టర్. అయితే అపూర్వకు ప్రాణాపాయం లేనట్లేగా!"

"కచ్చితంగా.."

"ఇక ట్రీట్‌మెంట్ స్టార్ట్ చేస్తారా? "

"ఇమ్మీడియెట్‌గా"

"మీరిందాక సూపర్‌ఫీషియల్ బర్న్ కేటగిరీ అన్నారు.. అంటే? " అడిగాడు వికాస్.

చెప్పటం ప్రారంభించాడు డాక్టర్.

★ ★ ★

## కొత్తగాలి...

**నువ్వు కలలోకొస్తే**
**కల.. నాకు.. వరం**
**నువ్వు కనిపించకపోతే**
**నాకు.. కలవరం**

– బేతంచర్ల శ్యామ్‌సుందర్,
వినుకొండ

బాంబుదాడి నుంచి త్రుటిలో తప్పించు కున్నాడు పులిగాడు. బోర్లా పడిపోయి, లేచేటప్పుడు రెండు గుప్పిళ్ల నిండా మట్టి తీసుకున్నాడు.

ఆ వ్యవధిలోనే వాళ్లంతా అతన్ని సమీ పించారు.

స్వామిద్రోహం చేసినందుకు నువ్వు శిక్ష అనుభవించాల్సిందేనన్నట్లుగా.. నలుగురు అతన్ని చుట్టుముట్టారు. పులిగాడు మరో క్షణం ఆలస్యం చేసినా.. పెద్దమూల్యం చెల్లించుకోవాల్సి వచ్చేది.

కానీ ప్రతీకార దాడుల్లో ఆరితేరి ఉండ

టంతో పులిలా పైకి లేచి, నలుగురి కళ్ల లోనూ దుమ్ముకొట్టాడు. అతన్ని నరికేం దుకు ఎత్తిన కత్తులు, గొడ్డళ్లు వాళ్ల చేతుల్లోంచి జారిపోయాయి.

పులిగాడు నిమిషం వ్యవధిలో ఆ నలుగురినీ మట్టి కరిపించాడు.

పార్వతి, మహేష్ కొంత ముందుగా పరిగెత్తటంతో, ఈ పోట్లాటను గమనించే అవకాశం లేకపోయింది. అవకాశం ఉన్నా పరిగెత్తకుండా ఆగిపోయి, అక్కడి బీభత్సాన్ని కళ్లారా చూసింది అపూర్వ.

శిలా ప్రతిమలా నిలబడి చూస్తున్న అపూర్వ చేయి పట్టుకొని "కమాన్, క్విక్! వాళ్లు తేరుకోకముందే మనం వెళ్లిపోవాలి" అంటూ మళ్లీ పరిగెత్తించాడు.

నలుగురూ చెరువుకట్ట వెంట ఆగకుండా పరుగులు తీశారు. అరగంట గడిచేసరికి అలుపొచ్చేసింది. పార్వతి ఇక తన వల్ల కాదంటూ అక్కడే కూలబడింది. చిమ్మచీకట్లో వాళ్లు ఎటువైపు ప్రయాణించారో పులిగాడికి మాత్రమే తెలుసు. అపూర్వ కూడ ఇక తన వల్ల కాదంది.

పులిగాడు కళ్లు చిట్లించి చూశాడు. చుట్టూ పొలాలు, తాటిచెట్ల వరసను చూసి, అది అల్లంవారి డొంకగా గుర్తించాడు. "చూడండి... ఇప్పుడిక మనం ఊళ్లోకి వెళ్లటం శ్రేయస్కరం కాదు. మరో ఊరుకిచేరుకునే అవకాశమూ లేదు. కొంచెం ముందుకెళ్తే పాతకాలం నాటి గుడి ఒకటుంది. రాత్రికి అక్కడ తలదాచుకుందాం. రేపు నేనెలాగో వెళ్లి వికాస్‌ను తీసుకొచ్చి మీకప్పగిస్తా" వివరించాడు పులిగాడు. ఒక సంక్లిష్ట సందర్భాన్ని ఎలా ఎదుర్కోవాలన్న ఆలోచన, తపన తప్ప అతనిలో ఇంకేభావమూ కనిపించ లేదు.

నలుగురూ అయిదు నిమిషాలు నడిచి గుడి వద్దకు చేరుకున్నారు. పాడుబడిన రామాలయం అది. ఊరికి బాగా దూరంగా ఉండటంతో ఏటా శ్రీరామనవమినాడు మాత్రమే అక్కడ ఉత్సవం జరుపుతారు. నలుగురూ ఆలయం అరుగుపై కూలబడ్డారు.

గస పెడుతున్నారు.

కాసేపటి తర్వాత, ఇప్పుడే వస్తానంటూ పులిగాడు పక్కనే ఉన్న చేలోకి వెళ్లాడు.

పార్వతి గుండె తరుక్కుపోతోంది. ఇదంతా తన వల్లనే జరుగుతోందని మథన పడుతోంది. అదే విషయాన్ని అపూర్వ దగ్గర ప్రస్తావించి, ఆమె ఒళ్లో తల పెట్టి వెక్కివెక్కి ఏడ్చింది.

"ఛఛ.. అలా ఫీలవ్వకు. మంచి పనికి ఆదిలో ఎప్పుడూ అడ్డంకులే ఎదురవుతాయట. కొద్ది రోజులు ఈ పరీక్షలు తప్పవు. ఆ తర్వాత నువ్వు కోరుకున్న జీవితాన్ని అనుభవించవచ్చు" ధైర్యం చెప్పింది అపూర్వ.

నిజానికి ఆమెక్కూడా భయంగానే ఉంది. పకడ్బందీగా ఆలోచించి, ఈ పెళ్లికి ప్లాను గీసింది. అంతా అనుకున్నట్టుగా సవ్యంగానే జరిగింది. కానీ పులిగాడి మద్దతు లభించాక.. అవతలి వర్గం అతన్ని కూడా శత్రువు కింద జమకట్టి నరమేధానికి తెగబడతారని ఊహించలేకపోయింది.

ఇప్పుడీ ప్రయాణం ఏ తీరాలకు చేరుతుందో, ఎలా ముగుస్తుందోనన్న బెంగ ఆమెను కమ్ముకుంది.

ఇంత హడావుడిలోనూ మహేష్ మాత్రం నింపాదిగా ఉన్నాడు. సర్వం తెలిసిన జ్ఞానిలా నిర్వికారంగా ఉన్నాడు.

రాత్రి పది గంటలవుతుండగా వచ్చాడు పులిగాడు. చిరిగిపోయిన పాతగోతాములో లేత మొక్కజొన్న పొత్తులు, శనక్కాయలు, పెసరకాయలు, తీగలు తీసుకొచ్చి ముగ్గురి ముందూ పరిచాడు.

అప్పటిగ్గానీ వారికి ఆకలి గుర్తు



రాలేదు.

చంద్రుడు కాస్త బలం పుంజుకోవటంతో కొద్దిగా వెన్నెల కురుస్తోంది.

ఎవరి కిష్టమైన వాటిని వారు తినేశారు.

దగ్గర్లో ఉన్న కుంట నుంచి దోనెల్లో నీళ్లు తెచ్చాడు పులిగాడు.

కొద్ది సేపటి తర్వాత అతనికేదో స్ఫురించింది. అపూర్వను పక్కకి పిలిచి, ఏదో అడిగాడు. ఓ ప్రతిపాదన చేశాడు. ముందు భయపడ్డా, తర్వాత సరేనని ఒప్పుకుందామె.

సరిగ్గా ఇదే సమయానికి ఊళ్లో..

నారాయణ వట్టి చేతుల్తో తిరిగొచ్చిన తన మనుషులపై మండిపడుతున్నాడు.

వాళ్లను అలా వదిలెయ్యటానికి వీల్లేద న్నాడు. తన కొడుకును కూడా ముక్క లుగా నరకమని గర్జించాడు. పొలిమేరలు దాటకముందే వారిని అంతమొందించా లంటూ ఆజ్ఞాపించాడు.

ఊళ్లో రాత్రిపూట పోలీసు పహారాను మరింత పటిష్ఠం చేసినందున... వాళ్లను మట్టుబెట్టేందుకు ఎలా వెళ్లాలో ఆయనే వ్యూహం పన్నాడు. అమలు చేసే బాధ్య తను అనుచరులకు అప్పగించాడు.

మరోవైపు మాధవయ్య కూడా తన అనుచరుల్ని సమావేశపరిచాడు. ఎలా గైనా సరే నారాయణ మనుషుల నుంచి తన వాళ్లను రక్షించి తీసుకురమ్మని హుకుం జారీ చేశాడు.

రాత్రి పదకొండు గంటల వేళ..

బండల బజారులో ఓ వ్యక్తి కావడి భుజాన వేసుకొని చెరువువైపు వెళ్తున్నాడు. ఊళ్లో గస్తీ తిరుగుతున్న పోలీసు అతన్ని ఆపాడు.

"ఈ టైమ్‌లో ఎక్కడికి? "

"మంచినీళ్లకి. పొద్దాంతా కల్లం కాడికి పోయొచ్చా. ఇప్పుడే వచ్చా. ఇంట్లో సుక్క నీరు లేదు. అందుకే ఈ టైమ్‌లో ఎల్తన్నా" తడుముకోకుండా జవాబు చెప్పాడు, నారాయణ వ్యూహాన్ని అమలు పరిచేందుకు బయల్దేరిన ఆగంతకుడు.

కానిస్టేబుల్ కావడికి ఉన్న బిందెల్లోకి ఏ మాత్రం తొంగి చూసినా నాటుబాం బులు, వేటకొడవళ్లు కనిపించేవి!

...ముందుగా పులిగాడు అపూర్వను గుడికి దగ్గర్లోనే ఉన్న శనగ చేలోకి తీసు కెళ్లాడు. ఆ పొలం మధ్యలో చిన్న గుడిసె ఉంది. అందులో గడ్డితో తయారుచేసిన పడక.. గుడిసె చుట్టూ పూలచెట్లు.. ఆహ్లా దంగా ఉంది. అవన్నీ పరిశీలించాక, "ఓకే, బాగానే ఉంటుంది" అంది అపూర్వ.

గుడిసె చూరులో కర్రపుల్లకు గుడ్డచు ట్టిన కాగడా ఉండటాన్ని గమనించాడు. జేబులోంచి అగ్గిపెట్టె తీసి, కాగడా వెలి గించి, గుడిసె ముఖద్వారం పక్కనే నిలబె ట్టాడు. అక్కడంతా వెలుతురు పరుచు కుంది. పులిగాడి సమయస్ఫూర్తికి అబ్బు రపడింది అపూర్వ.

అతనే వెళ్లి కొత్త దంపతుల్ని అక్కడికి తీసుకొచ్చాడు. అపూర్వ పార్వతికి ధైర్యం చెప్పింది. ఉత్సాహపరిచింది. ఇలాంటి తొలిరాత్రి మరెవరికీ దక్కదని, అన్నీ మర్చి పోయి ఎంజాయ్ చెయ్యమని హితబోధ చేసింది.

అపూర్వ, పులిగాడు అక్కడి నుంచి గుడి దగ్గరకు వెళ్లిపోయారు.

మహేష్-పార్వతిలకు ఏకాంతం దొరి కింది. గడ్డి పరుపుపై మహేష్ ఒడిలో గువ్వలా ఒదిగి పోయింది పార్వతి. ఇద్దరి మనసుల్లోని ఆందోళన మెల్లగా మాయమై.. ఆ స్థానే మధురోహల అల్లరి మొదలయింది.

మహేష్ ఆమెను శ్రుతి చేస్తున్నాడు. ఆమె రాగరంజితమై పరవశించిపోతోంది. వేయి కోయిలల తీపిరాగాలు ఆమె గుండె గుడిలో ప్రతిధ్వనిస్తున్నాయి. వివశత్వం ఆవరిస్తోంది.

కాంక్రీటు భవనాలు.. గాలి చొరబడని ఇరుకు గదులు.. ప్లాస్టిక్ పూల కృత్రిమ సోయగాల నుంచి తప్పించుకొని వచ్చి ప్రకృతి పూదోటలో కలువలై విచ్చుకున్న అనుభూతి కలిగింది పార్వతికి.

మహేష్ అనుకున్నంత అమాయకుడు కాదన్న విషయం.. అతడి చర్యల ద్వారా అవగతమై.. పార్వతి హృదయం మరింత విప్పారింది.

అతడి చేష్టలకు సిగ్గుల మొగ్గై ఇంకా ఇంకా ఒడిలోకి ఒదిగిపోయింది. తమ తొలి పరిచయమూ పొలంలోనే.. తొలి సంగమమూ పొలంలోనే.. అన్న విష

యాన్ని అతడికి గుర్తు చేసింది. చాలా సేపటి తర్వాత అతడు నోరు విప్పాడు..

"నా జీవితమే ఈ పొలమని ముందే చెప్పానా! చావైనా, బతుకైనా ఇక్కడే.."

గభాల్న అతడి నోటికి తన చేతినడ్డం పెట్టింది. అలా మాట్లాడొద్దంటూ కళ్లతోనే అభ్యర్థించింది.

అతడు ఆమె చేతిని తప్పించి, ఆమె పెదవులపైకి ఒంగి మధురఫలాలను అందుకున్నాడు.

అంతే.. ఇక ఇద్దరి మధ్యా మాటల్లేవు. ఇద్దరూ ఆనందలోకాల్లో వెళ్లిపోయారు.

గుడి అరుగుపై మునగదీసుకు పడుకున్న అపూర్వకు దూరంగా పొలంలో వెలుగుతున్న కాగడా కనిపిస్తోంది. వారి కలా తొలిరాత్రికి 'వెలుగు' నిచ్చిన పులిగాడిపై ఆమెకు ఎనలేని మమకారం పుట్టుకొచ్చింది.



5

"ఆత్మహత్యకు పాల్పడిన లేదా అగ్నిప్రమాదంలో తీవ్రగాయాలకు గురైన బాధితుల్ని రెండు రకాలుగా గుర్తించి ట్రీట్‌మెంట్ ఇస్తాం. ఒకటి- సూపర్‌ఫీషియల్ బర్న్స్. రెండో కేటగిరీ డీప్ బర్న్స్.

మొదటి కేటగిరీలోకి చేరే బాధితులు కొంతలో కొంత అదృష్టవంతులు.. మీ అపూర్వలాగా! అయితే చర్మం దాదాపు మొత్తం కాలిపోతుంది. కాబట్టి బాధలు అధికంగా ఉంటాయి. స్పర్శ ఉంటుంది. కాబట్టి నొప్పులు తెలుస్తాయి. శరీరమంతా ఇంకా మంటల్లోనే చిక్కుకున్నట్లు అరుపులు, కేకలు పెడతారు. రోగికి డీహైడ్రేషన్ అధికంగా ఉంటుంది. చర్మం మొత్తం కాలిపోవడం వల్ల వాతావరణంలో ఉండే వైరస్ కారణంగా ఇన్ఫెక్షన్ వస్తుంది. ముప్పై నుంచి నలభైఐదు శాతం వరకు కాలిన గాయాల్నకైనా అయిదారు నెలల పాటు చికిత్స అవసరమవుతుంది.."

కొద్దిగా ఆగి, మళ్లీ అందుకున్నారాయన.

"రెండో కేటగిరీ భయంకరం. అగ్నికీలల్లో చిక్కుకొని యాభై శాతం కన్నా అధికంగా కాలిన బాధితుల్ని ఈ కేటగిరిలోకి చేర్చి, చికిత్స చేస్తారు. శరీర కండరాలు, నరాలు కూడా కాలిపోయి, పేషెంటు జీవచ్ఛవంలా ఉంటాడు. స్పర్శ ఉండదు కాబట్టి శారీరక బాధలు అంతగా ఉండవు. జాయింట్స్ ఉన్న ప్రతిచోటా శరీర భాగాలు వంకర్లు తిరుగుతాయి. ముప్పై ఐదు శాతం కాలినా ప్రాణాలు కాపాడటం కష్టం. శరీర భాగాలను శాసించే టిష్యూలు కాలిపోతాయి కాబట్టి వ్యవస్థ పూర్తిగా దెబ్బతింటుంది. కిడ్నీలు, గుండె, ఇతర ముఖ్యమైన భాగాలు దెబ్బతింటాయి. పేషెంటు నియంత్రణ కోల్పోతాడు. ఇన్ఫెక్షన్ తీవ్రత ఎక్కువగా ఉంటుంది. ఒకటి రెండు రోజులకే శరీరాన్ని ఆక్రమించేస్తుంది. రీనల్ సిస్టమ్ ఫెయిలవుతుంది. ప్రాణాలు కాపాడటం కష్టం"

"అపూర్వ మొదటి కేటగరీలోనే ఉన్నట్లు కన్ఫర్మ్ అయిందా డాక్టర్?"

"యస్!"

"థాంక్ గాడ్ అయితే ఇక ట్రీట్‌మెంట్ స్టార్ట్ చేస్తారా?"

"అవును. ముందు ఆమె శరీరం అరవై శాతం దాకా కాలిందని భావించాను. బతకడం కష్టమనుకున్నాను. అదృష్టం ఆమె

నైపుంది.."

"థాంక్యూ సార్. ట్రీట్‌మెంట్ ఎన్నిరోజులు పడుతుంది? మేం ఆస్పత్రిలో ఎన్ని రోజులు ఉండాల్సి వస్తుంది?"

"మొత్తం ట్రీట్‌మెంట్ ఆరునెల్లు పడుతుంది. ఆస్పత్రిలో మీరు రెండు నెలలుంటే చాలు"

★ ★ ★

పీడకల నుంచి ఉలిక్కిపడి లేచింది అపూర్వ. ఎదురుగా పులిగాడు!

"రండి, తెల్లవారింది. వాళ్లని లేపుదాం" అన్నాడు ఆవలిస్తూ. అతడి కళ్లు ఎర్రగా ఉన్నాయి. రాత్రాంతా జాగారం చేసి, తమకు రక్షణగా ఉన్నాడని గ్రహించింది అపూర్వ.

ఇద్దరూ కలసి పొలంలోని గుడిసె వద్దకు వెళ్లారు.

అపూర్వ రెండుమూడుసార్లు "పార్వతీ" అని పిలిచింది. లోపల్నుంచి స్పందన లేదు.

పులిగాడి భృకుటి ముడిపడింది. అతడి మనసేదో కీడు శంకించింది. గుడిసె చుట్టూ ఉన్న శనగమొక్కల్ని చెడామడా తొక్కిన కాలిగుర్తులు కనిపించాయి.

రివ్వున వెళ్లి గుడిసెలోకి తొంగి చూశాడు.

అతడి అనుమానం నిజమైంది.

పెద్దపెట్టున ఏడ్చేశాడు పులిగాడు.

అపూర్వ కంగారుగా లోపలికి పరుగెత్తింది.

అక్కడి దృశ్యాన్నిచూసి బిగుసుకుపోయింది.

మహేష్ గుండెలపై తలపెట్టి పార్వతి నిద్రపోతోంది.. నిర్జీవంగా. 'మరణంలోనూ నీ జతవీడను' అన్నట్లుగా మహేష్ చెయ్యి ఆమె చుట్టూ బిగుసుకుపోయింది.

ఇద్దరి శరీరాలూ రక్తపుమడుగులో పడి ఉన్నాయి.

నిలువునా కూలబడిపోయి వెక్కివెక్కి ఏడ్చింది అపూర్వ. అతడి హృదయాన్ని ముక్కలుగా కోస్తుంటే తట్టుకోలేకపోయాడు.

ఆ ఉద్విగ్న పరిస్థితుల్లో ఆ ఏడుపు అతడిలోని మరో మనిషి వెలికివచ్చాడు. మరుక్షణమే ఉద్రేకం పెల్లుబికింది.

దిగ్గున లేచాడు. పక్కనే డొంకరోడ్డులో మువ్వలచప్పుడు చేసుకుంటూ వెళుతున్న ఎడ్లబండి కనిపించింది. గబాగబా వెళ్లి, ఆ బండిని తోలుకొచ్చాడు. బండి యజమాని సాయంతో రెండు శవాలనూ బండిమీదికి ఎక్కించాడు. అపూర్వను కూడా ఎక్కించుకొని ఆమె పక్కనే కూచున్నాడు. బండి ఊళ్లోకి చేరుకుంది. సరాసరి నారాయణ ఇంటికి పోనిచ్చాడు.

రెండు శవాలనూ దించి, నారాయణ ఇంటిముందు అరుగుపై పడుకోబెట్టాడు.

"శెభాష్‌రా పులి! మాట నిలబెట్టుకున్నావ్" అన్నాడు.

పులిగాడు దగ్గరగా వెళ్లి ఆయన మొహం మీద కాండ్రించి ఉమ్మాడు.

"ఛీ.. నీదీ ఒక బతుకేనా! ఏం పాపం చేశారని వీళ్లని చంపించావ్? నువ్వు రాక్షసుడిగా మారిందిగాక, నీ మాటల మత్తుతో నాలాంటి వాళ్లను కూడా దుర్మార్గులుగా మారుస్తున్నావ్. మంచిది కాదు నారాయణా ఇది.. మంచి పద్ధతి కాదు. ఇకనైనా నీ ఆగడాల్ని కట్టిపెట్టకపోతే.. ఇప్పటిదాకా నీ ప్రాణానికి ప్రాణంగా ఉన్న నేనే నీ ప్రాణాలు తీస్తా.. ఖబడ్దార్" అంటూ పార్వతి శవాన్ని భుజాన వేసుకొని వెళ్లిపోయాడు. అపూర్వ అతన్ని అనుసరించింది.

క్షణాల్లో ఈ వార్త ఊరంతా గుప్పుమంది.

పార్వతి శవాన్ని ఇంట్లో దించగానే, మాధవయ్య నిలువునా కూలిపోయాడు.

# జలంకోసం ప్రళయం?




ఈ పాటికే ప్రపంచ జనాభా ఏడువందల కోట్లను చేరి ఉంటుంది. గత అక్టోబరు 31లోపలే ప్రపంచంలో ఏడొందల కోటి బిడ్డ పుట్టి ఉంటుందని జనాభా శాస్త్ర వేత్తలు ప్రకటించారు. అయితే ఏ దేశంలో, ఎప్పుడు ఆ బిడ్డ పుట్టిందో మాత్రం చెప్పలేక పోతున్నారు. కానీ ఈ అద్భుతం మాత్రం 2011లోనే జరిగింది.



రెండువేల ఏళ్ళ క్రితం జీసస్ జన్మించినపుడు ప్రపంచ జనాభా ముప్పై కోట్లు మాత్రమే. 1800లో అది నూరు కోట్లకి చేరుకుంది. గత పదకొండేళ్ళలో ప్రపంచ జనాభా మరో 100 కోట్లు పెరిగింది. 2050కల్లా ప్రపంచ జనాభా వెయ్యి కోట్లకి చేరవచ్చని అంచనా. అప్పటికి చైనా జనాభాని భారతదేశం అధిగమిస్తుందని అంచనా. అలాగే ప్రస్తుతం ఆఫ్రికాలోనే అత్యధిక జనాభాగల నైజీరియా (16.2 కోట్లు) జన సంఖ్య అప్పటికి డెబ్భైఐదు కోట్లకి చేరుకోవచ్చని చెబుతున్నారు. వైద్యం అభివృద్ధి, శాస్త్ర సాంకేతిక రంగంలోని ప్రగతి, జీవనశైలి ప్రమాణం పెంపువల్ల మనిషి ఆయుష్షు కూడా పూర్వం కంటే బాగా పెరిగింది. 2050 కల్లా భూమి, ఆహారం, ఇంధన మీద అధిక ఒత్తిడి ఏర్పడి నేటి భూభాగానికి మూడు రెట్ల స్థలం అదనంగా అవసరం అవుతుందని చెబుతున్నారు. దీంతో భవిష్యత్తులో దేశాల మధ్య కేవలం నీళ్ళ కోసమే ఘోర యుద్ధాలు జరగవచ్చని కూడా ఐక్యరాజ్యసమితి మానవాళిని హెచ్చరించింది.

భాగ్యమ్మ స్పృహ కోల్పోయింది.

అపూర్వ జీవచ్ఛవంలా గోడకు జారగిలబడి కూచుంది.

కొద్దిగా కోలుకోగానే మాధవయ్య పిచ్చి పట్టినట్లుగా అరుస్తూ పులిగాడి మీద పడి కొట్టాడు. 'నా చిట్టితల్లిని నువ్వే చంపావు' అంటూ దూషించాడు. 'దుర్మార్గుడా.. నువ్వు పురుగులు పడి చస్తావురా' అంటూ నిందించాడు.

అపూర్వ నిస్సహాయంగా చూస్తుండిపోయింది.

మాధవయ్య అలా చేస్తుంటే ఒళ్లప్పగించి నిలబడిపోయాడే తప్ప మారు మాట్లాడలేదు పులిగాడు.

★ ★ ★

అపూర్వకు ట్రీట్‌మెంట్ మొదలైంది.

ఆమెను ఐసోలేషన్ వార్డుకు తరలించారు. ఇన్ఫెక్షన్ సోకకుండా ప్రత్యేక చర్యలు తీసుకున్నారు.

బెడ్‌కు జాలీ ఏర్పాటు చేశారు. పిల్లల్ని ఆమె దగ్గరకు తీసుకురావద్దని చెప్పారు.

క్రమం తప్పకుండా నర్స్ కేర్‌తో రోజూ డ్రెసింగ్ చేసే ప్రక్రియ మొదలైంది.

యాంటీబయోటిక్స్ ఇస్తున్నారు.

ఓరల్ ఫ్లూయిడ్స్ (గ్లూకోజ్) ద్వారా శక్తి సన్నగిల్లకుండా చూస్తున్నారు.

ఆరోజు కాన్వెంటు టీచర్లు కొందరువచ్చి, అపూర్వను పలకరించిపోయారు. కాసేపటి తర్వాత నీరజ వచ్చింది, బాబును తీసుకుని.

అపూర్వను పలకరించింది. కళమ్మకు తనను తాను పరిచయం చేసుకుంది.

టీకోసం వెళ్లిన వికాస్ అపుడే వచ్చాడు ఫ్లాస్క్‌తో.

"హలో! ఎంత సేపవుతుంది వచ్చి? "

"ఇప్పుడే" చెప్పింది నీరజ.

"బాబు ఇబ్బంది పెట్టాడా? "

"లేదండీ, చక్కగా ఆడుకున్నాడు"

"ఏమిటీ విశేషాలు? నా రూమెలా ఉంది? ఆంటీ ఎలా ఉన్నారు? "

"మీ రూమ్ మీరున్నా, లేకున్నా ఒకే రకంగా ఉంటుంది.. నిశ్శబ్దంగా! అమ్మ బానే ఉంది. మీకేవో కొన్ని లెటర్లు వస్తే తీసుకొచ్చా" అంటూ తన బ్యాగ్‌లోంచి తీసి ఇచ్చింది.

ఎక్కడెక్కడి నుంచి వచ్చాయో చూసుకొని, జేబులో పెట్టుకున్నాడు వికాస్. ఆ తర్వాత ఫ్లాస్క్‌లోంచి ఓ కప్పులో టీ పోసి, నీరజకు అందించాడు.

'నాకొద్దు. మీరు తాగండి"

"నేనిప్పుడే తాగి వస్తున్నాను. ప్లీజ్ తీసుకోండి"

అతడి అభ్యర్థనను కాదనలేక తీసుకుందామె.

ఇద్దరూ ఏవో విషయాల గురించి మాట్లాడుకుంటూ కూచున్నారు. కళమ్మకు నీరజ బాగా నచ్చింది.

'పద్ధతి గల పిల్ల' అనుకుందామె.

నీరజకు చాలా ఆనందంగా ఉంది. ఇంట్లో పక్కగదిలోనే ఉంటున్నా పట్టుమని పది మాటలు మాట్లాడని వికాస్ ఇక్కడ చక్కగా మాట్లాడుతున్నాడు!

అరగంట గడిచాక, ఇక వెళ్తానంటూ లేచింది నీరజ.

బాబును తనవద్ద ఉంచుకుంటాలెమ్మని కళమ్మ అంటే నీరజ ఒప్పుకోలేదు.

"నాకు, మా అమ్మకూ మంచి కాలక్షేపం. మా వద్దే ఉంచుకుంటాం ఆంటీ" అంటూ తనవెంట తీసుకెళ్లింది.

★ ★ ★

నెల రోజులు గడిచినా మాధవయ్య, భాగ్యమ్మ, అపూర్వ- మనుషులు కాలేకపోయారు. ఏ ఇద్దరూ మనసు విప్పి మాట్లాడుకోలేకపోతున్నారు. కొంతలో కొంత భాగ్యమ్మ ధైర్యంగా ఉంటోంది. తండ్రీకూతుళ్లను బతిమాలి, ఒక్కపూటయినా ఇంత తినిపిస్తోంది.

పులిగాడు నాలుగైదు సార్లు వచ్చి, అపూర్వను పలకరించి వెళ్లాడు. అతడు ఇంటికి రావటం మాధవయ్యకు ఇష్టం లేదు. వచ్చినప్పుడల్లా తిడుతూనే ఉన్నాడు. పులిగాడు అవేమీ పట్టించుకోకుండా రాకపోకలు సాగిస్తున్నాడు.

తన దగ్గరకొచ్చిన ప్రతిసారీ అతడి మాటల్ని బట్టి, పులిగాడు ఎంత పశ్చాత్తాప పడుతున్నాడో అర్థం చేసుకుంది అపూర్వ. వికాస్ ఓ పట్టాన మనిషి కాలేకపోయాడు. జీవితంలో మొదటిసారి ఘోరమైన తప్పు చేసినట్లు కుమిలిపోయాడు.

రోజుకోసారైనా మాధవయ్యా గారింటికి వెళ్లి, అపూర్వతో కాసేపు మాట్లాడేవాడు. ఇద్దరూ ఒకరికొకరు ధైర్యం చెప్పుకునేందుకు విఫలయత్నం చేసేవారు.

తనను పెంచి, పెద్దచేసిన ముసలమ్మ మరణించటంతో వికాస్ ఆ ఇంటిని ఖాళీ చేశాడు. సామానంతా సర్దుకొని, తాటికొండ వెళ్లిపోయాడు. ఉద్యోగం కూడా అక్కడే కాబట్టి, అక్కడే ఓ రూము తీసుకున్నాడు.

ఆరోజు లైబ్రరీకి సెలవు కావటంతో అనంతారం వచ్చాడు వికాస్. సరాసరి పులిగాడి ఇంటికి వెళ్లాడు. అతడు లేడు. వాళ్ల అమ్మ ఉంది. వికాస్ కోరుకుంది కూడా అదే. తన మనసులోని మాట చెప్పి, ఆమె ఆశీర్వాదం తీసుకోటానికి అదే మంచి సందర్భం అనుకున్నాడు.

"చెప్పు వికాస్, ఏమిటి కబుర్లు? " అడిగిందామె.

"పెళ్లి చేసుకుందామనుకుంటున్నానమ్మా"

"మంచిది బాబూ, అమ్మాయెవరు? "

"అపూర్వ!"

తుళ్లిపడిందామె.

"వాళ్ళ నాన్న ఒప్పుకుంటాడా? "

"డైరెక్టుగా వెళ్లి ఆయన్నే అడుగుతా నమ్మా. ఆయన అనుమతితోనే చేసుకుం టాను"

"అంతేలే, అదే మంచిది. అయినా నీ గురించి ఆయనకి తెలుసుకదా! చూస్తూ చూస్తూ నీలాంటి బుద్ధిమంతుణ్ణి వదులు కుంటాడా? " అందామె.

"వీడెక్కడమ్మా? "

"ఏమో.. ఏనాడైనా చెప్పి బయటికె ళ్లాడా? "

"సరే, మరి నే వస్తానమ్మా" అన్నాడు నమస్కరిస్తూ.

"అదేంటి, భోజనం చేయవా? " అడి గింది కళమ్మ.

"లేదమ్మా తినొచ్చాను. ఇక జంటగా వచ్చే మీచేతి వంట తింటా" నవ్వుతూ వెళ్లి పోయాడు.

వికాస్‌ను చూస్తూనే వరండాలోని కుర్చీలో దిగులుగా కూర్చున్న అపూర్వలో చలనమొచ్చింది. మొహంలో కొద్దిగా వెలుగు ప్రత్యక్షమైంది. "బాగున్నారా? " అడిగాడు అన్యమనస్కంగానే.

"ఇలా ఉన్నా.." చాలాకాలం తర్వాత మాటలొచ్చిన మనిషిలా చెప్పింది అపూర్వ.

"నాన్న గారేరి? "

"బజారుకెళ్లారు. ఏం పని? "

"ఆయన్తో మాట్లాడాలి"

"నేను అర్జెంటుగా మీతో మాట్లాడాలి. ఉదయం ఫోన్ ట్రై చేశాను, కలవలేదు. ఎలాగా అని మధన పడుతున్నాను. సమ యానికి మీరే వచ్చారు" అతనికెందుకో ఆ మాటలు సంతోషంగా అనిపించాయి.

"చెప్పండి" అన్నాడు.

"ఇక్కడ కాదు.. డాబా మీదికి వెళ్దాం" ఇద్దరూ పైకెక్కారు.

"ఏమిటంత ముఖ్యమైన విషయం? "

"నా జీవితానికి సంబంధించిన విషయ మిది. నన్ను ముంచినా, తేల్చినా భారం మీదే!"

"నా సహకారం ఎప్పుడూ ఉంటుంది. చెప్పండి"

"ఈ రాత్రికి మేమిద్దరం లేచిపోతున్నాం"

అదిరిపడ్డాడు వికాస్.

"మేమిద్దరం అంటే..? " అయోమ యంగా అడిగాడు వికాస్.

"నేను, మీ ఫ్రెండు.. అదే పులిగాడు"

హృదయం ముక్కలుముక్కలై రాలిపడు తున్నట్లుగా అనిపించిందతనికి. ముఖం లోని భావాలు ఆమెకి కనబడకుండా అటు వైపు తిరిగాడు.

"మా ఇద్దరి మనసులూ ఎలా కలి శాయో, ఎందుకు కలిశాయో విశ్లేషించలేను గానీ.. మేమిద్దరం ఒకరినొకరు గాఢంగా ఇష్టపడుతున్నామని మాత్రం చెప్పగలను"

చెమ్మగిల్లిన కళ్లను తుడుచుకొని "కంగ్రాట్స్" అన్నాడు.

"ఇందులో నా సాయం ఏమవసరం? మీ నాన్నగారిని ఒప్పించి, ఎంచక్కా పెళ్లి చేసుకోండి" అన్నాడు తనే మళ్లీ.

"ఆయన ఒప్పుకోలేదు. ఒప్పుకోరు

### కొత్తగాలి...

**ఎండొస్తే**
**నీడ కావాలి**
**ఈడొస్తే**
**జోడు కావాలి**

– పెరుకరాజు,
నర్సింగాపూర్, కరీంనగర్

కూడా..

"అడిగి చూశారా?"

"అన్నీ అయిపోయాయి. ఇంట్లో పెద్ద యుద్ధమే అయింది. వేరే సంబంధాలు చూస్తున్నారాయన"

"మా ఫ్రెండుకేం తక్కువని?"

'పార్వతిని చంపింది ఇతనేనని మా నాన్న అనుమానం. కాదని నేను మొత్తు కుంటున్నా నామాట నమ్మటం లేదు"

"అలాగని ఇంట్లోవారిని శత్రువుల్ని చేసు కుంటారా?"

"పిల్లల మనసుల్ని గ్రహించలేని పెద్దరి కాన్ని గౌరవించాలంటారా?" ఆమె కంఠంలో ఏమాత్రం బెరుకు లేదు.

"అలా అని కాదు.. ఇప్పటికే పార్వతి

> ## కొత్తగాలి...
>
> **వాకిట్లో ముగ్గు**
> **పెరట్లో చెట్టు**
> **నేటితరానికి**
> **పురాతనం**
>
> – సామంచి సుబ్బలక్ష్మి,
> విశాఖపట్నం

మరణంతో ఆయన కుంగిపోయారు. మీరు కూడా వదిలేసిపోతే ఆయన ఏమై పోవాలి?"

"ఏమీకాడాయన. ఆయనకు రాజకీ యాలు కావాలి, గొడవలు కావాలి. నరు క్కోవటాలూ, చంపుకోవటాలూ కావాలి. ఇంకేం అక్కర్లేదు"

"పోనీ.. నేనోసారి మాట్లాడిచూడనా?"

"వద్దండీ. అనవసరం. మీకు చేతనైతే నా పెళ్లికి సాక్షిగా సంతకం పెట్టండి. అదే మీరు చేసే సాయం"

ఆమె అప్పటికే ఓ నిర్ణయానికొచ్చిందని అర్థమైంది. ఇక వాదించి లాభం లేదనుకు న్నాడు.

"చెప్పండి.. నన్నేం చేయమంటారో" అన్నాడు.

"రేపు ఉదయం గుంటూరులో రిజిస్ట్రార్ ఆఫీసు దగ్గరకు రావాలి. మా పెళ్లికి మీరే పెద్దదిక్కు.."

అతడి మనసులో కట్టుకున్న 'అపూర్వ ఆశాసౌధం' కుప్పకూలింది. 'పెళ్లికొడుకు కావాల్సినవాణ్ణి.. పెళ్లి పెద్దనయ్యాను' అనుకొని, విరక్తిగా నవ్వుకున్నాడు.

"అలాగే, తప్పకుండా వస్తా" అని వెళ్లబో తుండగా 'వికాస్' అని పిలిచిందామె. వెనక్కి తిరిగి చూశాడు.

నీళ్లు నిండిన కళ్లతో నమస్కరిస్తూ నిల బడివుంది.

ప్రతి నమస్కారం చేసి, అక్కణ్ణించి కది లిపోయాడు భారమైన హృదయంతో.

ఆ రోజు రాత్రి..

బస్‌స్టేజీ వద్ద కలుసుకున్నారు అపూర్వ, పులిగాడు.

తొమ్మిది గంటలకు బస్సు వచ్చింది.

రాత్రిపూట గుంటూరు వెళ్లే గ్రామస్తులె వరూ లేకపోవటంతో వారిద్దరూ ధైర్యంగా ఒకే సీటులో కూచున్నారు.

... అలా వాళ్లిద్దరూ అనంతారం వదిలి వెళ్లిపోయారు. ఆ తర్వాత మళ్లీ ఎప్పుడూ ఆ గ్రామంవైపు రాలేదు.

రాక్షసుడిలా పరిచయమై.. రాతి హృదయం వెనుక దాగివున్న మానవ త్వాన్ని నిరూపించుకొని.. చివరికి రాకు మారుడిలా అపూర్వను మరుసటి రోజే రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకున్నాడు పులిగాడు ఉరఫ్ పులి రాజారావు.

★ ★ ★

అపూర్వ మెల్లగా కోలుకుంటోంది.

ఉండుండీ శరీరమంతా మంటలు పుడు తోందని కేకలు పెడుతోంది.

కళమ్మ ఆమెను అంటిపెట్టుకుని ఉండి, కంటికి రెప్పలా చూసుకుంటోంది. అపూర్వకు అత్తగారి మీద బాగా గురి కుదిరింది. ఆమె కనబరుస్తున్న ప్రేమ, ముక్కుసూటిగా మాట్లాడటం ఆమెకు నచ్చాయి.

నొప్పులు తెలియకుండా ఉండేందుకు కోడల్ని తరచూ మాటల్లో పెడుతోంది కళమ్మ. 'మానసికంగా ఆమెను ఆరోగ్యవంతంగా తయారు చేయటమనే చికిత్స మీ చేతుల్లోనే ఉందమ్మా' అన్న డాక్టరుగారి మాటల్ని ఆమె పాటించేందుకు కృషి చేస్తోంది.

ఆరోజు అపూర్వ నిద్రపోయి లేచాక, కళమ్మ ఆమెని మెల్లగా మాటల్లోకి దింపింది.

"అపూర్వ.. మీరు అనంతారం నుంచి ఎటు వెళ్లిపోయారు? ఎక్కడున్నారు? తాటికొండ ఎప్పుడొచ్చారు? రోజులు ఎలా గడిచాయి? కాన్వెంటు ఎలా పెట్టారు? " ప్రశ్నలవర్షం కురిపించింది కళమ్మ.

"అవన్నీ తల్చుకుంటే ఇప్పుడు నవ్వొస్తోందత్తయ్యా. అప్పట్నుంచీ ఇప్పటిదాకా మమ్మల్ని ఆదుకున్న ఒకే ఒక్క వ్యక్తి.. వికాస్"

మెల్లగా గతంలోకి ప్రవహించింది అపూర్వ.

★ ★ ★

గుంటూరులో పెళ్లి తంతు పూర్తయ్యాక తర్వాతి కర్తవ్యమేమిటో ముగ్గురికీ అర్థం కాలేదు.

"ఏం చేయాలో తర్వాత తాపీగా ఆలోచిద్దాం. ఈరోజుకైతే నా రూముకు వెళ్దాం రండి" వికాస్ ప్రతిపాదించాడు.

ముగ్గురూ బస్సెక్కి తాటికొండలో దిగి, సాయంత్రం నాలుగు గంటలకు రూముకు చేరుకున్నారు. స్నానాలయ్యాక వికాస్ వారిద్దరినీ మంచి హోటల్‌కు తీసుకెళ్లాడు.

"మొహమాటపడకుండా ఇద్దరూ ఏది తినాలనుకుంటే అది ఆర్డర్ చేయండి. ఖర్చు గురించి మర్చిపోండి. ఇదే నేను మీకిచ్చే పెళ్లిపార్టీ" అన్నాడు వికాస్ నవ్వుతూ.

మామూలు భోజనం చాలన్నారు వాళ్లిద్దరూ. అలా కాదని, తనే బిర్యానీ, చికెన్ సిక్స్టీఫైవ్ గట్రా ఆర్డరిచ్చాడు.

ముగ్గురూ సుష్టుగా భోం చేశారు.

హోటల్నుంచి వాళ్లిద్దరినీ ఓ పార్కుకు తీసుకెళ్లాడు. అక్కడ వారిని వదిలేసి, ఓ అరగంటపోయాక రూముకు రమ్మని చెప్పి వికాస్ వెళ్లిపోయాడు.

వికాస్ అక్కణ్నించి నేరుగా మార్కెట్టుకు వెళ్లి పూలు, స్వీట్లు తీసుకున్నాడు.

రాత్రి తొమ్మిది దాటుతుండగా

## నేచురల్ బ్యూటీ!

ఓసారి భార్యాభర్తలు ఎక్కడికో బయటికి బయలుదేరుతున్నారు. ఏ అలంకరణా లేకుండా వస్తున్న అబ్బూరి ఛాయాదేవితో, 'ఏం, అంతేనా?' అన్నారు వరద కుతూహలంగా.



దానికి ఛాయాదేవిగారు, 'ఔను ఇంతే, నేను నేచురల్ బ్యూటీని!' అన్నారు కాస్త మురిసిపోతూ.

'ఔనా?! అందులో ఫస్ట్ పార్ట్ మాత్రమే కరెక్ట్. సెకండ్ పార్ట్ కాస్త డౌట్‌ఫుల్' అన్నారు వరద ఆమెను ఆటపట్టిస్తూ. ఆ తర్వాత ఇద్దరూ నవ్వుకున్నారు.

రూముకు చేరుకున్నాడు.

"ఆంటీ ఉన్నారా?" అడిగాడు నీరజని. ఆమె బయట వరండాలో కూచుని చదువుకుంటోంది.

"నిద్ర పోయారు. జ్వరంగా ఉంది. అందుకే త్వరగా పడుకున్నారు. ఏం?" అడిగింది నీరజ.

"అబ్బే, ఏం లేదు" మొహమాటపడ్డాడు వికాస్.

"పర్లేదు, నాతో చెప్పొచ్చు అవును.. వాళ్లిద్దరూ ఏరి? ఏదో కథ నడుస్తున్నట్లు నాకు అనుమానంగా ఉంది" అందామె కొంటెగా చూస్తూ. "మీ అనుమానం నిజమే. ఉదయం రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకున్నారు. ఈ పూట.." అంటూ ఏం చెప్పాలో అర్థంకాక ఆగిపోయాడు.

"ఓహో అదా విషయం! అర్థమైందిలే" అంటూ పుస్తకం పక్కన పెట్టి లేచొచ్చి అతని చేతుల్లోని ప్యాకెట్లు అందుకుంటూ, "ఇటివ్వండి, నేను డెకోరేట్ చేస్తాలే" అంది.

"మీరా!" అడిగాడు ఆశ్చర్యంగా.

"ఏం! ఎక్స్‌పీరియన్స్ ఉన్నవాళ్లే చెయ్యాలా?"

ఆ అమ్మాయి కొంచెం ఫాస్ట్. అందుకే వికాస్‌కు జర్క్ ఇస్తూనే ఉంటుంది. అయితే ఆమె చూపుల్లోగానీ, చేష్టల్లో గానీ ఎన్నడూ వికార భావాలు కనిపించేవి కావు. అదో అదృష్టంగా భావించేవాడు.

ఇరవై నిమిషాల తర్వాత బయటికొచ్చింది నీరజ. అప్పటిదాకా బయటే కూచున్నాడు వికాస్. మధ్య మధ్యలో మాత్రం ఆమె 'అది కావాలి, ఇది కావాలి' అని కేకేస్తే లోపలికి వెళ్లి అందించివచ్చాడు.

నీరజకు థ్యాంక్స్ చెప్పి లోపలికి వెళ్లి చూశాడు వికాస్. తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. అది తన రూమేనా అని ఆశ్చర్యపోయాడు.

మంచం మీద నాలుగడుగుల ఎత్తులో ప్లస్ ఆకారంలో కొసలు కట్టి, పూలమాలల్ని వివిధ భంగిమల్లో వేలాడదీసింది.

బెడ్‌మీద దుప్పటి నీటుగా పరచి, దానిపైన పుష్పం ఆకారంలో పూలు పేర్చింది. మంచం పక్కనే స్టూలువేసి, దాని మీద ఉంచిన పళ్లెంలో స్వీట్లు సర్దింది. లవ్ సింబల్ ఆకారంలో అందంగా కనిపిస్తున్న స్వీట్లు ఇట్టే నోరూరిస్తున్నాయి.

బయటికొచ్చి, సీరియస్‌గా చదువుకుంటున్న నీరజను అబ్బురంగా చూశాడు. "నీరజా" పిలిచాడతను.

ఆమె తలెత్తి చూసింది.

చూపుడువేలిని బొటనవేలితో కలిపి, మిగతా మూడువేళ్లనూ నిలువుగా చూపుతూ "ఎక్సలెంట్" అన్నాడు మెచ్చుకోలుగా చూస్తూ. "థాంక్యూ" మాట బయటికి రాకుండా పెదాలు కదలించింది నీరజ.

పార్క్ నుంచి ఇంటికి చేరుకున్నారు కొత్త దంపతులు.

వారికి బెస్ట్ ఆఫ్ లక్ చెప్పి, తాను లైబ్రరీలో పడుకొంటానంటూ వెళ్లిపోయాడు వికాస్.

ఆ రాత్రి.. వాళ్లిద్దరికీ మరపురాని అనుభూతి మిగిలింది.

★ ★ ★

## కొత్తగాలి...

**ప్రేమను హత్యచేశా**
**అందుకే**
**మూడుముళ్ల బేడీలతో**
**మెట్టింట జీవిత ఖైదీనయ్యా!**

– జంపన తులసీబృంద,
హైదరాబాద్

పది రోజులు గడిచిపోయాయి.

తిరిగి అనంతారం వెళ్లటం ఇద్దరికీ ఇష్టం లేదు.

అలాగని వికాస్‌పై ఆధారపడి ఎన్నాళ్లుండాలి?

ఇద్దరూ ఏదో ఒక ఉద్యోగం చేసేందుకు సిద్ధమయ్యారు. తమకేదో ఒక పని చూపించమని వికాస్‌నే వేడుకున్నారు.

అతను రెండ్రోజుల పాటు ఆలోచించాడు. ఏవేవో ఎంక్వైరీలు చేశాడు. అంచనాలు వేశాడు.

రాజారావుని వెంటబెట్టుకుని అనేకమందిని కలిశాడు. తమకు సహకరించమని వేడుకున్నాడు.

ఆ పట్టణంలో వికాస్‌కున్న మంచిపేరు కారణంగా అందరూ అతనికి సహకరిస్తామని మాట ఇచ్చారు.

ఆ తర్వాత ధైర్యంగా రంగంలోకి దిగారు. స్టేట్ బ్యాంకు నుంచి రుణం తీసుకున్నారు. పట్టణం శివారులో పాతకాలపు డాబా అద్దెకు తీసుకున్నారు.

ఎల్.కె.జి. నుంచి అయిదో తరగతి వరకూ కాన్వెంటు ప్రారంభించారు. ఇటీవల పట్టణం బాగా విస్తరించినందున, ఆ ప్రాంతంలో స్కూలు పెడితే క్లిక్ అవుతుందన్న వికాస్ వ్యూహం ఫలించింది. దానికి తోడు వికాస్ తన డ్యూటీ టైమింగ్స్ మినహా మిగతా సమయంలో విస్తృతంగా తిరిగి, అడ్మిషన్లు సంపాదించాడు.

రాజారావును స్కూలు కరస్పాండెంట్‌గా, అపూర్వను 'హెడ్'గా నిర్ణయిస్తూ బ్యానర్లు రాయించాడు. కరపత్రాలు వేయించాడు. నలుగురు టీచర్లను నియమించాడు.

శిథిలమవుతున్న గృహానికి రంగులతో కొత్త కళ తెప్పించాడు. ఒకవైపు పొడవుగా ఉన్న పెద్దహాల్లో తడికెల్తో పార్టిషన్ చేయించాడు.

అన్నీ తానే అయి, కాన్వెంటుకు ఓ రూపం తెచ్చాడు.

కాన్వెంటు ప్రారంభోత్సవానికి తనే ముహూర్తం పెట్టాడు. ముఖ్య అతిథిగా స్థానిక ఎమ్మెల్యేను ఆహ్వానించాడు. అదో పండగలా జరిగింది.

మంచి పబ్లిసిటీ వచ్చింది.

అరవై మంది పిల్లల్తో కాన్వెంటు ప్రారంభమైంది. సహజంగానే చురుకైన అపూర్వ అతి తక్కువ కాలంలోనే సాధకబాధకాలను వంటబట్టించుకోగలిగింది. ముఖ్యంగా తరచూ పిల్లల తల్లిదండ్రులతో సమావేశాలు ఏర్పాటు చేస్తూ ఓ ప్రత్యేకతను సాధించగలిగింది.

★ ★ ★

**కొత్తగాలి...**

**నీతిమంతులకు**
**జై..జై..లు**
**అవినీతి మంత్రులకు**
**జైలు**

– కె. ఎన్నార్‌నమ్మి,
నెగ్గిపూడి, ప.గో.జిల్లా

రెండో సంవత్సరంలోకి రెండొందల మంది పిల్లల్తో అడుగు పెట్టింది కాన్వెంటు.

నిర్వహణపై గట్టి పట్టు సాధించింది అపూర్వ.

పేరుకు కరస్పాండెంట్ అయినా రాజారావుకు మేనేజ్‌మెంట్ సూత్రాలు వంటబట్టలేదు. కాన్వెంటుకు అవసరమైన వస్తువులు తీసుకురావటం, ఫీజులు కట్టించుకోవటం, తన క్లాసు చెప్పడం, పిల్లల్ని ఆటలాడించటం వరకే పరిమితమయ్యాడు.

వారిద్దరి 'ప్రేమ' ఫలించి.. అపూర్వ

చక్కటి పాపకు జన్మనిచ్చింది. వికాస్ ఆ పాపకు 'విహిత' అని పేరుపెట్టాడు.

మొదటి వార్షికోత్సవాన్ని ఆర్భాటంగా నిర్వహించారు. వికాస్ నెలరోజులు శ్రద్ధ తీసుకొని పిల్లలకు వివిధ సాంస్కృతిక కార్యక్రమాల్లో శిక్షణ ఇచ్చాడు.

వార్షికోత్సవంలో పిల్లల ప్రదర్శనలు ఆహూతుల్ని కట్టిపడేశాయి. పేపర్లలోనూ మంచి కవరేజ్ వచ్చింది.

వార్షికోత్సవం అయిపోయాక అభినందనలన్నీ రాజారావుకే అందాయి. అపూర్వకూ మంచి గౌరవమే దక్కింది. ఎటొచ్చీ వికాస్‌కే ఏ ప్రశంసా దక్కలేదు.

రాజారావు-అపూర్వకు ఇక అట్టే వికాస్ సహకారం అవసరం లేకపోయింది. అతనూ అటువైపు వెళ్లటం తగ్గించేశాడు.

అపూర్వ, రాజారావుల జీవితనౌక సాఫీగా సాగుతోంది. అపూర్వ ఆనందంగానే ఉన్నా, ఇల్లే సౌకర్యంగా లేదని అప్పుడప్పుడూ విసుక్కునేది.

తడికెలు మాత్రమే అడ్డుగా ఉన్న ఒకే గది. ఎదురుగా విశాలమైన మైదానం. చుట్టు పక్కల ఇళ్లు లేవు. పగలంతా చిలకలదండు వాలిన చెట్టులా సందడిగా ఉండే కాన్వెంటు, రాత్రయ్యేసరికి ద్వీపకల్పంలా మారేది. రాజారావు ఏదో పని మీద బయటికెళ్లి ఆలస్యంగా వచ్చేవాడు.

అపూర్వకి అదో సమస్య అయింది.

ఓసారి వికాస్ వచ్చినప్పుడు తన ఒంటరితనాన్ని ప్రస్తావించి, టౌన్‌లో ఇల్లు తీసుకుంటే ఎలా ఉంటుందని అడిగింది.

వికాస్ వద్దన్నాడు. స్కూలుకు దూరంగా ఉండటం వల్ల చాలా సమస్యలు తలెత్తుతాయన్నాడు. ఒకేచోట ఉండటమే అన్ని విధాలా శ్రేయస్కరమన్నాడు. కాకపోతే కాస్త నిలదొక్కుకున్నాక ఓ పక్క రెండు గదులు సౌకర్యంగా ఉండేలా నిర్మించుకోవటం మంచిదని చెప్పాడు.

★ ★ ★

పదిమంది టీచర్లున్నా అపూర్వకు క్షణం తీరేది కాదు. పిల్లల సంఖ్య పెరిగిపోవటంతో మరో టీచరు కావాలని చిన్న ప్రకటన ఇచ్చారు.

ముగ్గురు అమ్మాయిలు ఇంటర్వ్యూకు రాగా, వారిలో డిగ్రీ చదివిన రంజితను అపాయింట్ చేసుకుంది అపూర్వ.

రంజిత ఎంత తెలివైనదో అంతకంటే అందమైనది. కుందనపు బొమ్మలా ఉంటుంది. తీరైన అవయవాల పొందికతో.. ఎరుపు, గులాబి రంగులు మిళితమై ఆమె శరీరానికి అతుక్కుపోయినట్లు ఉంటుంది. కొంచెం పొట్టిగా ఉన్నా సన్నగా, నాజూగ్గా ఉంటుంది కాబట్టి ఎబ్బెట్టుగా అనిపించదు.

గలగలా మాట్లాడుతుంది. చేరిన పది రోజుల్లోనే మిగతా టీచర్ల పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకుంది.

చలాకీగా పాఠాలు చెబుతూ ఆమె అపూర్వ ప్రశంసలు కొట్టేసింది. మెల్లగా ఆమెకు తలలో నాలుకలా తయారైంది.

కాన్వెంటు వదిలాక కూడా ఇంటికి వెళ్లేది కాదు. అపూర్వతో కబుర్లు చెబుతూ కూచునేది. విహితను తనే ఆడించేది. టీవీ చూడటమంటే ఆసక్తి ఎక్కువ. సీరియల్స్ చూస్తూ 'ఆ కారు చూడక్కా ఎంత బావుందో! హీరో భలే ఉన్నాడు కదా! అతని చేతిలో సెల్‌ఫోన్ ముద్దొస్తోంది! కథానాయిక ఇల్లు సూపర్బ్ కదా? " అంటూ లొడలొడా వాగేది.

"అవన్నీ అభూత కల్పనలు రంజిత. ఇవ్వాళ వచ్చే ఏ సీరియల్ అయినా వాస్తవానికి దగ్గరగా ఉంటుందా? మనం కూడా ఇలాగే డబ్బున్న అబ్బాయిని ప్రేమించాలేమో! కారుల్లోనే తిరగాలేమో! అసలు జీవితమంటే అదేనేమో అనేలా ఉన్నాయి తప్ప.. జీవితంలో ఎన్ని ఆటు

పోట్లు ఉంటాయో చూసిస్తున్నారా? " అంటూ అపూర్వ రంజితను ఎడ్యుకేట్ చేసేది.

రంజిత ఆ మాటల్ని పట్టించుకునేది కాదు. అందరి కన్నా భిన్నంగా ఉండాలని ఆరాటపడేది. హైహీల్స్ వేసేది. పెదవులకు లిప్‌స్టిక్ చెదరకుండా చూసుకునేది. జుట్టు విరబోసుకుని స్కూలుకు వచ్చేది.

"ఏమిటా వేషం గంగిరెద్దులా? " అంటూ ఆమెను రాజారావు ఎప్పుడూ కోప్పడుతుండేవాడు.

"మోడ్రన్ సార్. రేపు మీ అమ్మాయి మాత్రం ఇలా వేసుకోదా? " అంటూ ఎదురు చెప్పేది.

రంజితలో విపరీత ధోరణి వెనక ఏదో కారణం ఉండి ఉంటుందని భావించింది అపూర్వ. కావాలని కాకపోయినా యథాలాపంగా కొందరు పిల్లల తల్లిదండ్రుల వద్ద రంజిత విషయాన్ని ప్రస్తావించి, ఆమె బ్యాక్‌గ్రౌండ్ గురించి ఆరా తీసింది.

రంజితకు పన్నెండో ఏటనే పెళ్లయింది. తల్లి తన ఆరోగ్యంపై తనకే నమ్మకం లేక కూతురికి ఎలాగైనా పెళ్లి చేయాలన్న తాపత్రయంతో ఓ అనామకుడికి కట్టబెట్టింది. ఏమైందో, ఏమో.. అతగాడు నెలరోజులు తిరక్కముందే ఎటో వెళ్లిపోయాడు. మళ్లీ తిరిగి రాలేదు.

రంజిత స్కూలు ఫైనల్ పూర్తి చేసుకుని కాలేజీలో చేరాక చిక్కులు మొదలయ్యాయి. మెడలోని మంగళసూత్రం చూసి అందరూ ఆట పట్టించేవారు. ఆమె బిడియంతో చచ్చిపోయేది. ఇంటికొచ్చి తల్లితో తగాదాకు దిగేది. తల్లి సర్దిచెప్పటానికి ప్రయత్నించేది.

ఒకరోజు తల్లికి తెలియకుండా తన మెళ్లో మాత్రమే మిగిలిన భర్త జ్ఞాపకాన్ని తెంచి, విసిరికొట్టింది. రెండ్రోజులు తల్లి చేత తిట్లు తిన్నా, రంజితకు పెద్ద భారమేదో దిగిపోయినట్లనిపించింది.

కొత్తగా రెక్కలు పుట్టుకొచ్చినట్లు స్వేచ్ఛగా, నిర్భయంగా, చలాకీగా తిరగసాగింది. క్రమేపీ పెళ్లి తాలూకు పీడకల నుంచి బయటపడగలిగింది.

తల్లికి అంతు చిక్కని వ్యాధి సోకి, మంచాన పడటంతో రంజితకు బాధ్యత తెలిసొచ్చినట్లయింది. తండ్రి తన చిన్నప్పుడే చనిపోయినా, తల్లి కూలీనాలీ చేసి పెంచిన జ్ఞాపకాలు వెంటాడుతుంటే.. ఆ దశలోనైనా తల్లికి అండగా ఉండాలన్న తపనతో కాన్వెంటులో టీచరుగా చేరింది.

ఈ వివరాలు తెలిశాక అపూర్వకు రంజిత మనస్తత్వం కొంతవరకూ అంతుబట్టింది. ఓ సంఘటన గుర్తుకొచ్చిందామెకు.

ఒకరోజు రాజారావు లేని సమయంలో వికాస్ వచ్చాడు. తను ఇంట్లో పనిలో ఉంది. రంజిత బయట విహితను ఆడిస్తోంది. వికాస్ నేరుగా వచ్చి కుర్చీలో కూచుని తనతో కబుర్లు మొదలుపెట్టాడు. విహిత ఏడుస్తోందన్న నెపంతో రంజిత నాలుగైదుసార్లు లోపలికొచ్చి తనవంకా, వికాస్ వంకా అనుమానంగా చూసింది.

'తెలియనితనంలే' అని నవ్వుకుంది అపూర్వ.

...అక్కడిదాకా చెప్పి, ఆగింది అపూర్వ.

★ ★ ★

అటు కాన్వెంటు బాధ్యతలు చూసుకుంటూ రాజారావు వీలు కుదిరినప్పుడల్లా ఆస్పత్రికి వచ్చిపోతున్నాడు.

అపూర్వ మెల్లగా కోలుకుంటుండటంతో అతని దిగులు తగ్గుముఖం పట్టింది. అతనెంతో ప్రేమగా పలకరిస్తున్నా, అపూర్వ మొక్కుబడిగా మాట్లాడేది. అతనున్నంత సేపూ మొహం మాడ్చుకుని ఉండేది.

వారి మధ్య అగాధం ఉన్నట్లు తనకు తెలియకూడదన్న ఉద్దేశంతో రాజారావు మాటలకు ఎంతోకొంత ప్రతిస్పందన తెలి

యజేస్తోందని గ్రహించింది కళమ్మ.

అందుకే ఉండుండీ అపూర్వనుంచి గతాన్ని రాబడుతోంది.

'అనంతారం నుంచీ ఏమైపోయారు? ఎలా బతికారు? ' అని ఆమె అపూర్వను కదిలించటం వెనక అసలు ఉద్దేశమే వేరు.

జీవితంలో స్థిరత్వం కోసం తామెలా ప్రస్థానం ప్రారంభించిందీ అపూర్వ వివరిస్తుంటే.. కళమ్మ కొన్ని అనుబంధ ప్రశ్నలు జోడిస్తూ మరిన్ని వివరాలు రాబడుతోంది.

ముందు సందేహించినా.. అత్తగారి మీద ఏర్పడ్డ నమ్మకంతో అపూర్వ తన అఘాయిత్యానికి అసలు కారణాన్ని కూడా బయట పెట్టేందుకు సిద్ధమైంది.

★ ★ ★

రెండేళ్లు గడిచిపోయాయి.

కాన్వెంటుకు మంచి పేరు వచ్చింది.

పిల్లల సంఖ్య బాగా పెరిగింది. డబ్బులొస్తున్నాయి. ఇద్దరిలోనూ దిగులు తొలగిపోయింది. ఇంట్లోకి అవసరమైన ఒక్కో వస్తువే కొనుక్కోవటం ప్రారంభించారు.

ముఖ్యంగా అపూర్వ పాత లెక్కలు బయటికి తీసి, కాన్వెంటు పెట్టే సమయంలో వికాస్ ఏయే పనులకు ఎంత ఖర్చు చేశాడో వివరాలు ఒకచోట నోట్ చేసుకుంది. కుటుంబ ఖర్చుల నిమిత్తం అడపాదడపా ఇచ్చిన డబ్బును కూడా వాటితో కలిపింది. మొత్తం ఎంతో లెక్క తేల్చింది.

బ్యాంకులో తీసుకున్న లోన్‌ను క్రమం తప్పకుండా నెలా నెలా చెల్లిస్తుండటంతో అప్పుల నుంచి విముక్తి లభిస్తోందని ఇద్దరూ ఆనందించారు.

ఆరోజు...

"అప్పా.. రూరల్ కాన్వెంట్స్ అసోసియేషన్‌వాళ్లు పదేపదే లెటర్లు రాస్తున్నారు. మనం కూడా అసోసియేషన్‌లో చేరితేనే మంచిదనిపిస్తోంది. రేపేదైనా ప్రాబ్లమ్ వస్తే అండగా ఉంటారు. లేదంటే ఏదో ఒక తలనొప్పి. ఇవ్వాళ గుంటూరులో అసోసియేషన్ మీటింగు. ఓసారి వెళ్లొస్తా" అన్నాడు రాజారావు బయల్దేరుతూ.

"ఇవ్వాళ వికాస్‌ను రమ్మని కబురు చేశాం గదా.. మీరటు వెళ్తే ఎలా? " అడిగింది అపూర్వ.

"ఏముంది డియర్! డబ్బులివ్వటానికీ నేనుండాలా? రాత్రి మనం రాసిన లెక్కల కాగితాన్ని కూడా అతనికివ్వు.. పద్ధతిగా ఉంటుంది. డబ్బులు బీరువాలో ఉన్నాయి.

## కొత్తగాలి...

**రైతు తపస్సు**
**చేస్తున్నాడు!**
**మేఘం హృదయం**
**కరిగి కురవాలని**

– చలపాక ప్రకాష్,
విజయవాడ

ఆ.. అన్నట్టు వాడికి భోజనం పెట్టకుండా పంపకు" అంటూ వెళ్లిపోయాడు.

ఉదయం లైబ్రరీ సమయం ముగిశాక వికాస్ కాన్వెంటుకు వచ్చాడు.

లంచ్‌బెల్ కొట్టేవరకూ సరదాగా ఒక్కో క్లాసులోకి వెళ్లి పిల్లలతో పాటలు పాడించటం, డ్యాన్సు చేయించటం అదీ చేస్తుండిపోయాడు.

"గుడ్ మార్నింగ్ సార్. బాగున్నారా? " తన క్లాసు పక్కగా వెళుతున్న వికాస్‌ను విష్ చేసింది రంజిత.

"మార్నింగ్ అండీ. మీ దయవల్ల ఇప్పటిదాకా బాగానే ఉన్నా" అతనికి రంజిత అంటే భయం. ఏదో ఒక వెకిలి చేష్టతో

వచ్చిన ప్రతిసారీ అతణ్ణి కవ్విస్తుంది. అందుకే ఆమె జోలికి వెళ్లడు.

"అసలు ఆమెను చూస్తుంటేనే నాకేదో పెద్దడౌటు. సినిమా ఇండస్ట్రీలో ఉండాల్సిన శాల్తీని తీసుకొచ్చి పిల్లలకు పాఠాలు చెప్పి స్తారేమిటి అపూర్వా? " అని అడిగేవాడు.

ఆమె నవ్వి "ఎందుకు, నిన్నేం చేసింది? " అనేది.

"ఇంకేం చెయ్యాలమ్మా? మొన్నటికి మొన్న లైబ్రరీకి వచ్చి 'సినిమాకి వెళదాం రండి సార్' అని అడిగింది"

"తప్పేముంది? వెళ్లొచ్చుగా.."

## కొత్తగాలి...

**ఓంకారానికి గుడి**
**ఓనమాలకు బడి**
**ఈ రెండు ఒకేచోట**
**అదే.. అమ్మ ఒడి**

– పట్ల యాదగిరి,
*గుండాల, నల్గొండ జిల్లా*

"ఏమిటి! ఆమెతో కలిసి సినిమాకా? ఇంకా నయం!"

"ప్చ్.. కుర్రాడికుండాల్సిన లక్షణాలు ఒక్కటీ లేవు వికాస్ నీలో. ఏం? ఆ అమ్మాయే రమ్మని ఆహ్వానించినప్పుడు వెళ్లటానికి నీకేమైంది? అసలు అమ్మాయితో కలిసి సినిమా చూడటంలో ఎంత థ్రిల్ ఉంటుందో నీకు తెలుసా? "

"కొంపదీసి మీరుగానీ ఆమెను నా తపస్సు చెడగొట్టమని ఉసిగొల్పలేదు గదా? "

ఆమె పెద్దగా నవ్వేసింది.

"...మా క్లాసులోకి రాకుండానే వెళ్తున్నారేం సార్" రంజిత అతన్ని వదిలిపెట్ట లేదు. ఆమెకు అతనితో గంటల తరబడి మాట్లాడాలని, అతన్నే చూస్తూ గడపాలని అనిపించేది. తనకు తెలియకుండానే అతని పట్ల ఆరాధనాభావం పెంచుకుంది.

"అబ్బే.. మీ పిల్లలకు తిరుగే లేదండి. మీరు వాళ్లని చాకుల్లా తీర్చిదిద్దుతున్నారుగా" అతను పొగుడుతున్నాడో, వెక్కిరిస్తున్నాడో అర్థం కాలేదు రంజితకు.

లంచ్ బెల్లు కొట్టారు. పిల్లలంతా భోజనానికి కూచున్నారు. ఇద్దరు ఆయాలు వాళ్లకి సహకరిస్తున్నారు. టీచర్లు పర్యవేక్షిస్తున్నారు. అపూర్వ హడావుడిగా అటూ ఇటూ తిరిగి అంతా సెట్‌రైట్ అయిందనుకున్నాక, ఇంట్లోకి నడిచింది.

ఆమె వెనకే వికాస్ వెళ్లాడు.

రంజిత డేగకళ్లతో గమనిస్తోంది.

కొద్దిసేపటి తర్వాత టీచర్లు కూడా భోజనానికి ఇళ్లకు వెళ్లారు.

అపూర్వ వికాస్‌కు అన్నం వడ్డించి, తనూ పెట్టుకుంది.

రంజిత, మరో టీచర్ మాత్రం క్యారేజి తెచ్చుకుంటారు. ఇద్దరూ కలిసి తినేవారు. ఆ పూట మాత్రం తన క్యారేజీతో అపూర్వ వాళ్ల రూము పక్కనే ఉండే క్లాస్ రూములోకి వచ్చింది. అక్కడే కూచొని బాక్స్ తెరిచి, తినటం ప్రారంభించింది.

లోపల్నుంచీ ఉండుండీ అపూర్వ వికాస్‌ల మాటలు, నవ్వులు వినిపిస్తున్నాయి.

రంజితకు కంపరంగా ఉంది. ఎందుకో తనకే తెలియని ఉక్రోషం ఆమెలో ఎగసిపడుతోంది.

వికాస్ మాటలు, అపూర్వ నవ్వు వినిపించినప్పుడల్లా మనసులో లావా మరుగుతున్న ఫీలింగ్!

గబగబా నాలుగు ముద్దలు తిని తడికెకు దగ్గరగా వచ్చి, లోపలికి కన్నేసింది.

అపూర్వ వికాస్ చేతికి డబ్బులందించింది. అతడు వద్దని నిరాకరిస్తున్నా వినకుండా, చేతిని పట్టుకొని జేబులో

## ముక్కు పురాణం

చతుర ప్రపంచం

జులై 6, 2007 గిన్నీస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో ప్రపంచంలోనే అతి పొడవైన ముక్కుగల వ్యక్తిగా మహమ్మద్ ఓజ్‌యురేన్ పేరు నమోదైంది. ఆయన టర్కీలోని అర్ట్‌విన్ ఊరికి చెందినవాడు. అతని ముక్కు పొడవు 8.8 సెంటీమీటర్లు. అంటే 3.5 అంగుళాలు. 1949లో అతను టర్కీలో జన్మించాడు. అక్కడి ప్రజల ముక్కులు సాధారణంగా పెద్దవిగానే ఉంటాయి.



ఇదిలావుంటే పాకిస్థాన్‌లోని రావల్పిండికి చెందిన ఫైజన్ ఆఘా తనకు ఓజ్‌యురేన్‌కన్నా పెద్ద ముక్కు ఉందని గిన్నీస్ అధికారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఇతని ముక్కు పొడవు 12.19 సెంటీమీటర్లు. అంటే 4.8 అంగుళాలు. అయితే ఇప్పటికిప్పుడు ఈ విషయంపై తామేమీ ఈ విషయంలో చేయలేమని గిన్నీస్ అధికారులు సెలవిచ్చారు. దీనికి ఓ సాంకేతిక కారణం అడ్డు నిలిచింది. అదేమంటే ఇది వరకే ఆ పుస్తకాన్ని అచ్చువేశారు. అందువల్ల మరోసారి తమ పుస్తకాన్ని ముద్రించబోయే ముందు ఫైజన్ ఆఘా ముక్కుని కొలిచి, అందులో అతడి పేరును నమోదు చేస్తామని భరోసా ఇచ్చారు. కాబట్టి గిన్నీస్ బుక్‌లో అతని పేరు నమోదైనా, కాకపోయినా ప్రస్తుతానికి అతనే ప్రపంచంలోనే అతి పొడుగైన ముక్కున్న వ్యక్తిగా గుర్తించాల్సి ఉంటుందని అతని మద్దతుదారులు చెబుతున్నారు. అతి పొడువైన వ్యక్తి రికార్డు కూడా పాకిస్థాన్‌కి చెందినదే కావడం విశేషం.

---

కుక్కింది.

"నన్నిలా పరాయివాణ్ని చేస్తారనుకోలేదు అపూర్వా!" అన్నాడు వికాస్.

అపూర్వ చేతులెత్తి నమస్కరిస్తూ "అలా అనకండి వికాస్. ఈ జీవితం మీరు పెట్టిన భిక్ష. నిజంగా మీరే లేకుంటే మేం ఏమైపోయేవాళ్లం!" కన్నీళ్లు పెట్టుకుంది.

వికాస్ కంగారు పడ్డాడు.

"అంత మాటనకండి. వాడికి నేనెంత సాయం చేసినా వాళ్లమ్మగారు నాకు ఓ పూట పెట్టిన భోజనం రుణమైనా తీర్చుకోలేను. ఫ్రెండుకి ఈ మాత్రం సాయం చెయ్యలేకపోతే ఇంకెందుకు? " అన్నాడు. మంచినీళ్లు తాగి, వికాస్ వెళ్లిపోయాడు.

సాయంత్రం నాలుగు గంటలకు ఇంటికి చేరుకున్నాడు రాజారావు. కాసేపు క్లాసులన్నీ తిరిగి, ఎడమ పక్క చివరగా తడికెల్తోనే ఏర్పాటు చేసుకున్న ఆఫీసుగదిలోకి వెళ్లాడు.

కాన్వెంటు వదిలేశాక అందరూ వెళ్లిపోయారు.

అపూర్వ పనిలో మునిగిపోయింది. రంజిత కాసేపు విహితను ఆడించి, నిద్రపోవటంతో పాపను ఇంట్లో పడుకోబెట్టి గ్రౌండ్‌లోకి వచ్చింది.

రంజిత మనస్సు కుతకుత ఉడికిపోతోంది.

కాసేపు తటపటాయించి, ధైర్యం తెచ్చుకుని ఆఫీసులోకి వెళ్లింది. రాజారావు సీరియస్‌గా ఏదో రాసుకుంటున్నాడు.

"సార్.." పిలిచింది గోముగా.

"ఎస్ మిస్. వాట్ డూయూ వాంట్? " తలెత్తకుండానే అడిగాడు రాజారావు.

"మీతో పర్సనల్‌గా మాట్లాడాలి"

"చెప్పండి" అన్నాడు రాయటం ఆపేసి. తనకు ఎదురుగా నిలబడి ఉన్న రంజితను అంత దగ్గరగా చూడటం అదే మొదటి సారి. వెంటనే తేరుకోలేకపోయాడు ఆమె అందానికి. అతని చూపులు ఆమె కళ్లలో చిక్కుబడ్డాయి.

కాన్వెంటులో చేరినప్పటికంటే కొద్దిగా ఒళ్లు చేసి, పుష్టిగా కనిపిస్తోంది. పొదిగినట్లున్న ఆమె అవయవసౌష్ఠవం కనువిందు చేస్తోంది.

"మరి.. అదే.. అదే.."

"సందేహిస్తారెందుకు మిస్? చెప్పండి" అన్నాడు ఆమెనలాగే చూడటం పద్ధతి కాదని, మరోవైపు చూస్తూ.

"ఏం లేదు. మీరు చాలా మంచివారు. మీమీద గౌరవంతోనే నేనీ మాటలు చెబుతున్నానని నమ్ముతానంటేనే చెబుతాను" అంది తటపటాయిస్తూ.

"నమ్ముతాను, చెప్పండి"

"ఆడదానికి స్వేచ్ఛను ఇవ్వొచ్చుగానీ, మరీ ఎక్కువగా ఇవ్వకూడదు"

"దేని గురించి మీరు మాట్లాడేది? "

"అదే.. ఆ వికాస్ తరచూ ఇక్కడికొస్తున్నాడు"

"మిమ్మల్ని ఏమయినా అన్నాడా? "

"అబ్బే, అదేం లేదు!"

"మరి? " అడిగాడు.

"ఈరోజు మధ్యాహ్నం వచ్చాడా.. సరాసరి మీ ఇంట్లో దూరాడు. తగుదునమ్మా అంటూ అపూర్వక్క అతనికి అన్నం వడ్డించటం.. ఇద్దరూ తింటూ జోకులు వేసుకోవటం.. ఆ ఇకయికలూ పకపకలూ.. నాకే ఒళ్లు మండిపోయింది"

రాజారావుకు విషయం అర్థమైంది.

"ఆ.. ఇంకా.."

"ఇంకా ఏమిటి? వెళ్లేటప్పుడు అతనికి డబ్బులు కూడా ఇచ్చింది"

"అయితే ఏమంటావ్? "

"అబ్బబ్బా.. మీ మగాళ్లంతా ఇంతే. ఎంత క్లియర్‌గా చెప్పినా మీకు విషయం అర్థం కాదు!"

"మీ బాధ నాకర్థమైంది.. ఇప్పుడు నన్నేం చేయమంటారో మీరే సలహా ఇవ్వండి" అన్నాడు సీరియస్‌గా.

"ఏముంది... అక్కను కాస్త అదుపులో పెట్టండి.."

ఆమె నోటివెంట మాట పూర్తికాకముందే రాజారావు చేయి మెరుపువేగంతో కదిలింది. అది వెళ్లి రంజిత చెంపను తాకటం.. ఆమె గింగిరాలు తిరిగి కింద పడటం క్షణంలో జరిగిపోయింది.

"ఇంకోసారి వికాస్ గురించి, నా డియర్ గురించీ చెడుగా మాట్లాడావో.. నేనేం చెస్తానో నాకే తెలియదు. గెటవుట్.. గెటవుట్ ఫ్రమ్ హియర్.."

రంజిత లేచి, ఏడ్చుకుంటూ బయటికి పరుగు తీస్తుండగా.. అప్పుడే బయటికొచ్చిన అపూర్వ గమనించింది.

గబగబా రాజారావు దగ్గరకొచ్చి "ఏంటండీ.. ఏమైంది? ఆ పిల్ల అలా ఏడుస్తూ పరుగెత్తుతుందే? " అడిగింది.

"ఏమీ జరగలేదులే అపూర్వా. నువ్వు కంగారుపడకు"

"ఏమీ కాలేదంటారేమిటి.. ఆపిల్ల అలా ఏడుస్తూ వెళ్తుంటే"

"ఏదో నోటికొచ్చినట్లు వాగింది.."

"ఏం వాగింది? "

రాజారావు పలకలేదు.

"ఏం వాగిందో చెప్పమంటున్నా.."

అపూర్వ నిలదీసింది.

"ఏమీలేదు అప్పూ. మధ్యాహ్నం వికాస్ వచ్చివెళ్లాడా? "

"అవును. మనమేగా డబ్బులివ్వటానికి రమ్మని కబురు చేసింది"

"అదే, అతను రావటం గురించే గొడవంతా.."

"అర్థం కాలేదు..."

"నీ గురించీ, వికాస్ గురించీ చెడుగా మాట్లాడింది!"

షాక్ తిన్న అపూర్వ, కోలుకున్నాక "అందుకు మీరేం అన్నారు? " అడిగింది.

"ఏమీ అనలేదు. ఒక్కటిచ్చానంతే!"

"బుద్ధి లేదండీ మీకు. ఏదో తెలిసీ తెలియక అలా మాట్లాడిందే అనుకోండి.. దానికే కొట్టాలా? "

"ఒక్కదెబ్బతో వదిలాను. సంతోషించు"

"అది పద్ధతి కాదండీ"

"ఏది పద్ధతి? నీ గురించీ, వికాస్ గురించీ నోటికొచ్చినట్లు మాట్లాడటం పద్ధతా? " మండిపడ్డాడు రాజారావు.

"అది కాదండి.. ఆడపిల్ల కదా! ఇప్పుడు బజార్లో ఎవరైనా చూశారనుకోండి, ఏమనుకుంటారు? ఏదో జరగరానిది జరిగిపోయిందనుకుంటారు. అప్పుడు టోటల్‌గా మన కాన్వెంటుకే చెడ్డ పేరు వస్తుంది.." అనునయంగా చెప్పటంతో రాజారావు మెత్తబడ్డాడు. ఆమె చెప్పింది నిజమేనని తర్కించుకున్నాడు.

"ఏం చేయను అప్పూ.. తట్టుకోలేకపోయాను" అన్నాడు పశ్చాత్తాపంగా.

"ఇప్పుడా పిల్ల కాన్వెంటుకు రావడం మానేస్తే మనకెంత ఇబ్బంది? "

"మానెయ్యదులేవోయ్" అన్నాడు ప్రేమగా దగ్గరకొచ్చి ఆమెను చుట్టేస్తూ.

"ఏమిటీ.. అయ్యవారికి అంత నమ్మకం? "

"నువ్వున్నావుగా.. పిలిచి బుజ్జగించటానికి" అంటూ ఆమె బుగ్గపై చిటికె వేశాడు.

"సర్లే. ఇక నాకదే పని! ఇంతకీ తమరెళ్లిన పని ఏమైంది? "

"అసోసియేషన్‌లో చేరక తప్పలేదు డియర్. నీకు తెలుసా.. వాళ్ళందరూ మన కాన్వెంటుని అడ్మైరింగ్‌గా చూస్తున్నారు. రెండేళ్లలోనే అలా ఎదిగిన మీరు అసోసియేషన్‌లో చేరకపోవటం పద్ధతి కాదని మొత్తుకున్నారు"

"అంటే.. అక్కడ సమావేశంలో అబ్బాయిగారు హీరోలా వెలిగిపోయారన్నమాట"

"నువ్వూ వెలిగిపోయావ్ లేవోయ్.. నేను మాట్లాడుతూ అంతా నీ గురించే చెప్పాను"

"థాంక్స్. ఈ సందర్భంగా మీకో గుడ్ న్యూస్"

"ఏమిటది? " ఆత్రంగా అడిగాడు.

"మీరు తల్లి, నేను తండ్రి కాబోతున్నాం" కావాలనే తారుమారుగా చెప్పింది.

అర్థం కాగానే "కంగ్రాట్స్" అంటూ ఆమెను అల్లుకుపోయాడు.

## కొత్తగాలి...

**పుట్టగానే కేర్.. కేర్‌మని ఏడ్చి**
**అమ్మతనానికి హేతువయ్యావు**
**బతకినంతకాలం ఏడిపిస్తూ**
**అమానుషానికి సేతువయ్యావు**

– వోలేటి శ్రీనివాసరావు,
విజయనగరం

★ ★ ★

"అమ్మా" అని అరుస్తూ విరుచుకుపడిపోయింది ఒకటో తరగతి చదువుతున్న ఆరేళ్ల చిన్నారి ప్రత్యూష. పిల్లలందరూ భయంతో ఓ మూలకు పరుగులు తీశారు.

ఆ తరగతి టీచరు స్నేహ, చేతిలోని పుస్తకాన్ని గిరాటేసి, కంగారుగా ప్రత్యూష దగ్గరకు పరిగెత్తింది. బెంచ్‌మీద నుంచి అమాంతం కింద పడిపోయిన ఆ పాప, స్పృహ కోల్పోయింది. టీచరు పెద్దగా కేక పెట్టడంతో, మూడు తరగతులకు అవతల పాఠం చెబుతున్న అపూర్వ గబగబా వరండాలోకి నడిచింది.

నిస్సత్తువగా పడివున్న పాపను భుజాని కెత్తుకుని ఆందోళనగా ఎదురొచ్చింది స్నేహ.

ఏం జరిగింది స్నేహా? " కంగారుగా అడిగింది అపూర్వ.

"ఏమో టీచర్, ఉన్నట్టుండి హఠాత్తుగా కింద పడిపోయింది" చెప్పింది స్నేహ.

స్నేహ దగ్గర్నుంచి పాపను తన చేతు ల్లోకి తీసుకుంది అపూర్వ.

ఇంతలో జగదీష్ అక్కడికొచ్చాడు హడా వుడిగా. అతను సైన్స్ టీచర్.

"ఏం జరిగింది టీచర్? "

"తెలియదు మాస్టారూ. మీ బైక్ తీయండి, వెంటనే హాస్పటల్‌కు తీసుకె ళ్లాలి" అంది అపూర్వ.

జగదీష్ చకచకా వెళ్లి, బైక్ తీసుకొ చ్చాడు.

"స్నేహా, నువ్వు వెనకెక్కు" ఆదేశించింది అపూర్వ. స్నేహ బైక్ మీద కూచోగానే, పాపను ఆమె ఒళ్లో ఉంచింది.

"మీరు ఆస్పత్రికి వెళ్లండి. నేనూ, రాజా డబ్బులు తీసుకొని వస్తాం" హడావుడిగా సాగనంపింది అపూర్వ.

వాళ్లలా వెళ్లారో లేదో స్టాఫ్‌రూము వైపు నుంచి గబగబా వచ్చాడు రాజారావు.

క్లుప్తంగా ఏం జరిగిందో చెప్పి, "మీరు బండి తీయండి, నేను డబ్బులు తీసుకొని వస్తాను" చెబుతూనే ఇంటివైపు నడిచింది అపూర్వ.

రంజితను పిలిచి "ఆ పాప వాళ్ల అమ్మకు కబురు చేయండి. ఆమెను ఆస్పత్రి దగ్గరకు వచ్చేయమనండి" అని గేటువైపు అడుగులు వేశాడు రాజారావు.

ఇరవై నిమిషాల్లో ఇద్దరూ ఆస్పత్రికి చేరు కున్నారు. తాటికొండకు దూరంగా పొలాల్లో నిర్మించారు ఆ వైద్యశాలను,

ఆస్పత్రి ముందు బండి ఆపగానే, అపూర్వ దాదాపు దూకినట్టుగా కిందికి దిగి, లోపలకు వెళ్లింది.

మొదటి అంతస్తుకి వెళ్లేసరికి స్నేహా, జగదీష్ ఓ బెంచ్ మీద దిగులుగా కూచొని ఉన్నారు.

అపూర్వను చూడగానే స్నేహ మొహంలో ధైర్యం కనిపించింది. లేచి, ఎదురొస్తున్న ఆమెతో "ఎలావుంది, ఏం జరిగింది, డాక్టరేమన్నారు" ప్రశ్నించింది.

"మన డాక్టరు చెక్ చేశారు మేడమ్. మరో డాక్టర్ని పిలిపించారు. ఇంకా ఏవో పరీక్షలు చేస్తున్నారు" చెప్పింది స్నేహ.

"ప్రమాదమేమీ లేదన్నారుగా" ఆశావహ భావాన్ని అంటిపెట్టుకుని అడిగింది అపూర్వ.

"అదేమీ చెప్పడం లేదు మేడమ్" దిగు లుగా అంది స్నేహ.

"డోన్ట్ వర్రీ, ఏం కాదు" ధైర్యం చెబు తుండగా రాజారావు అక్కడికి వచ్చాడు.

నలుగురి మధ్యా మరో ఇరవై నిమి షాలు భారంగా గడిచాయి.

అప్పటికి చేరుకుంది ఆ పాప తల్లి.

"ఏమైందమ్మా, నా చిట్టితల్లికి ఏం జరి గింది? " అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది.

"చూడమ్మా, పాపకు ఏమీ కాలేదు. కళ్లు తిరిగి పడిపోయిందంతే. కంగారు పడా ల్సిన పనిలేదు" లోపలెక్కడో తనలోనూ భయాందోళనలు తచ్చాడుతున్నా, ధైర్యం చెబుతోంది అపూర్వ.

అంతలోనే నర్స్ వచ్చి డాక్టరుగారు పిలుస్తున్నారని చెప్పగానే, రాజారావు, అపూర్వ గబగబా వెళ్లారు.

"నమస్తే డాక్టర్" విష్ చేసింది అపూర్వ.

కూర్చోండన్నట్లుగా సైగ చేశాడు డాక్టర్.

ఇద్దరూ కూచుంటూ "ఏంటిసార్ ప్రాబ్లమ్? " అడిగారు.

"అదే అర్థం కావడం లేదు. పాప చాలా బలహీనంగా ఉంది. రోగనిరోధక శక్తి

# వన్నె తరగని ఆదరణ!

చతుర ప్రపంచం

అమెరికాలో 1920లలో సామాన్యుల వినోద సాధనం వాడివిల్ ప్రక్రియ. ఇది నాటకం కాక పోయినా దీన్ని స్టేజ్ మీదనే ప్రదర్శిస్తారు. సాధారణంగా ఓ ఆడ, మగ పాత్రలు ఇందులో పాల్గొంటాయి. ఒకరు ప్రశ్నలు వేస్తే మరొకరు నవ్వించే జవాబులు చెప్తారు.

వందలాది కళాకారులు అమెరికా అంతటా పర్యటిస్తూ దీన్ని ప్రదర్శించేవారు. ఈ ప్రశ్నజవాబుల్ని ప్రత్యేకంగా హాస్య రచయితలు



రాసేవారు. వాటిని నేటికీ చిన్న మార్పులతో పత్రికల్లో, టీవీల్లో ఉపయోగిస్తున్నారు.

"జార్జ్! మా చెల్లెలుకి బిడ్డ పుట్టిందని టెలిగ్రాం వచ్చింది" అంటుంది నటి.

"అలాగా? కొడుకా.. కూతురా?"

"అది రాయలేదు. దాంతో నేను ఆంటీ అయ్యానో, అంకుల్ అయ్యానో తెలవడం లేదు" అంటుందామె అమాయకంగా.

వెంటనే విరామ సూచకంగా డమ్-డి-డమ్-డి-డమ్ అనే సంగీతం వినిపిస్తుంది. లేదా ఓ నిముషం వారిద్దరూ కలిసి నృత్యం చేసాక మళ్ళీ ఇంకో సంభాషణ మొదలవుతుంది.

చలనచిత్రం పుట్టి, పెద్ద నిడివిగల చిత్రాలు వచ్చినా ఈ ప్రక్రియకు ఆదరణ తగ్గలేదు.

జార్జ్‌బర్న్స్, గ్రేషియా ఎల్లెన్ జంట వాడివిల్ కళను ప్రదర్శించారు. తర్వాత రేడియో ఆవిర్భవించగానే దానిద్వారా దీన్ని వారు అసంఖ్యాక శ్రోతలకు అందించారు. ప్రదర్శనశాలకు రాకుండా ఇంట్లోనే దీన్ని వినవచ్చు. టీవీ వచ్చిన తర్వాత కూడా దీన్ని 1970 వరకూ ప్రదర్శించారు. ఆ తర్వాత సినిమాల్లోనూ ఆ జంట రాణించారు. కంఠం బాగుండి, సంభాషణలు చక్కగా చెప్పగలిగిన వారిని రేడియో ఆహ్వానించింది. చూసేందుకు రూపం బాగున్న వారిని ఆ తర్వాత టీవీ ఆదరించింది. హాలీవుడ్ కమెడియన్ బాబ్‌హోప్ అమెరికన్ సైనికులను వాడివిల్‌తో ఆనందింపచేసేవాడు. అతను ఇద్దరి పాత్రల్నీ పోషిస్తూ, ప్రేక్షకులను ప్రశ్న అడిగి, తానే నవ్వొచ్చే జవాబులు చెప్పేవాడు. ఈ కళాకారుల్లో అనేక మంది స్టార్స్ రేటింగ్‌ను, ప్రేక్షకాభిమానాన్ని పొందారు. నేటికీ అమెరికన్ టీవీలో డేవిడ్‌లెటర్‌మేన్, జేవినో లాంటివారు నిత్యం ఇలాంటి లేట్ నైట్ షోలు చేస్తుంటారు. ఈ కళకు ఇంకనూ వన్నె తరగని ఆదరణ కొనసాగుతోంది.

---

చాలా తక్కువగా ఉంది. ప్రస్తుతానికి ఐసీయూలో ఉంచాం. నిజానికి సమస్యేమిటో మాకూ అర్థం కావడం లేదు. రోజూ స్కూల్లో ఎలా ఉంటుంది?"

"చాలా యాక్టివ్ సర్. అన్నింట్లోనూ ముందుంటుంది. ముఖ్యంగా మంచి కంఠం. అద్భుతంగా పాడుతుంది."

"ఆ పాపకు సంబంధించిన వివరాలు కావాలి. వాళ్ల అమ్మానాన్నలు వచ్చారా?"

"నాన్న లేరు డాక్టర్. వాళ్లమ్మ వచ్చింది. పిలవమంటారా?"

"నర్స్, ఆమెను లోపలికి రమ్మను"

పాప తల్లి చీరకొంగు నిండుగా కప్పుకొని రెండు చేతూలు జోడించి, డాక్టరు ముందు నిలబడింది. ఏడ్చీ ఏడ్చీ మొహం ఉబ్బిపోయింది.

"చూడమ్మా, మీ పాపకేం కాలేదు. నీరసంతో కళ్లు తిరిగి పడిపోయిందంతే. ఉదయం టిఫిన్ పెట్టారా?" అడిగాడు డాక్టర్.

"ఇడ్లీ పెట్టాను సారు. ఎందుకో సరిగ్గా తినలేదు"

"పాప ఆరోగ్యం ఎలా ఉంటుంది? "

"పుట్టినప్పుడు బాగానే ఉండేది. ఓ ఏణ్నర్థం బట్టి పదీపదిహేను రోజులకో సారి జెరమొస్తుంది"

"వాళ్ల నాన్న ఏం చేసేవాడు? ఎలా చనిపోయాడు? "

"లారీ డ్రైవరుగా పని జేసేటోడు. యాక్సిడెంటు జరిగి, చనిపోయాడు" దుఃఖం ఆపుకోలేకపోయిందామె.

"అప్పుడీ పాప వయసెంత? "

> **కొత్తగాలి...**
>
> **మా ఇంట్లో నలుగురం**
> **నాలుగు గీతలు గీసుకొని**
> **బతికేస్తున్నామే కానీ**
> **సరళరేఖలుగా ఎన్నడవుతామో?!**
>
> – పెన్మెత్స సూరిబాబు,
> హైదరాబాద్

"పాప పుట్టిన వారానికే.."

"కాన్పు జరిగింది ఏ ఆస్పత్రిలో? "

"ఊళ్లోనే, గవుర్మెంటు ఆసుపత్రిలో పని జేసే నరసమ్మ కానుపు జేసింది"

"సరే, మీ పాపకు ఏమీ కాలేదు. ఈ రోజు ఆస్పత్రిలో ఉంచుకుని, రేపు పంపిస్తాం" డాక్టరుగారి మాటలతో కాస్త తెరిపిన పడిందామె.

నర్సు ఆమెను బయటకు తీసుకెళ్లింది.

డాక్టరు అపూర్వ వైపు చూస్తూ "ఇంకొన్ని టెస్టులు చేయించాలి. అవసరమైతే రెండు మూడు రోజులు ఆస్పత్రిలో ఉంచాల్సి వస్తుంది. మరి డబ్బులవీ.."

"ఫర్వాలేదు డాక్టర్. ఎంతయినా భరిస్తాం. అవసరమైన అన్ని పరీక్షలూ చేయించండి" చెప్పింది అపూర్వ.

రాజారావు లేచాడు. వెనకే అపూర్వ లేచి బయటికి వెళ్లబోతుండగా, డాక్టర్ సైగ చేయడంతో ఆమె ఆగిపోయింది.

"చూడమ్మా, నిజానికి ఈ కేసు గురించి ఏం చెప్పాలో కూడా అంతుబట్టడం లేదు. నాక్కొంచెం టైమివ్వండి. కానీ ధైర్యంగా ఉండండి.. ఇప్పటికిప్పుడు ఆ పాప ప్రాణాలకొచ్చిన ముప్పేమీ లేదు" అన్నారు.

"డాక్టర్.." అనుమానంగా చూస్తూ అడిగింది అపూర్వ, ఆయన పాప ప్రాణాల గురించి ప్రస్తావించడంతో.

"కంగారు పడకండి. ఈ రాత్రికి మీరెవరూ ఉండాల్సిన అవసరం లేదు. రేపు కనిపించండి" చెప్పేసి, మరో పనిలో మునిగిపోయాడు డాక్టర్.

అపూర్వ బయటకి వచ్చేసరికి వికాస్ కూడా వచ్చి ఉన్నాడు.

"మరేం పర్లేదుగా" అడిగాడు వికాస్.

"పర్లేదు. పాపను ఐసీయులో ఉంచారు. నేను చూశాను. బాగానే మాట్లాడుతోంది"

కాసేపు చర్చల అనంతరం పాపతల్లిని మాత్రమే అక్కడుంచి, మిగతావారు వెనక్కి వెళ్లిపోయారు.

★ ★ ★

రాత్రి ఎనిమిది దాటుతోంది.

అపూర్వ ఆరుబటయ వెన్నెల్లో కుర్చీలో కూచొని ఉంది.

పాపను ఒళ్లో ఉంచుకుని నిద్ర పుచ్చుతూ, ఆకాశం వంక చూస్తోంది.

ఆకాశంలో కూడా అపూర్వకు ప్రత్యూషే కనబడుతోంది. ఉదయం నుంచీ ఆలోచనలు ఆ పాప చుట్టూనే తిరుగుతున్నాయి.

అన్నీ అస్పష్ట చిత్రాలే. అన్నీ సందిగ్ధాలే. ఏదీ స్పష్టంగా లేదు.

పాప ఆరోగ్యం గురించి తల్లి చెప్పే విష

యాలూ స్పష్టంగా లేవు.

ఏం జరిగిందనే విషయంపై డాక్టర్ చెప్పే మాటలూ స్పష్టంగా లేవు.

ఏం జరగబోతోంది? ప్రత్యూష ఏ జబ్బుతో బాధ పడుతోంది?

'అయినా ఇంత మంది పిల్లలున్నారు. అందరిలో తనొకటి. ఆ పాప ఆరోగ్యం బాగోలేకపోతే తానేం చేయగలదు? మహా అయితే ఆస్పత్రి ఖర్చులు భరిస్తాం. తగ్గిం దాకా అండగా ఉంటాం. అంతకన్నా ఇంకేం చేయగలం? '

'ఛఛ! ఇలా ఆలోచిస్తున్నానేమిటి! కాన్వెం టులోని ప్రతి విద్యార్థీ తన బిడ్డతో సమానం. కంటికి రెప్పలా చూసుకుంటా రనే పేరున్నందువల్లనే కదా, ఇంతమంది తల్లిదండ్రులు నమ్మకంగా ఈ విద్యాలయా నికి పంపిస్తున్నది!'

"అమ్మా... అమ్మా..." లీలగా వినిపిం చిన పిలుపుతో అపూర్వ ఆలోచనలు చెది రిపోయాయి.

తల పక్కకు తిప్పి చూస్తే, ప్రత్యూష తల్లి చంద్రమ్మా!

"ఏంటి చంద్రమ్మా, ఇలా వచ్చావ్? ఆస్పత్రిలో ఎవరున్నారు? " ఆత్రంగా ప్రశ్నించింది అపూర్వ.

"పాపకు ఇడ్లీ పెట్టమని చెప్పారమ్మా. హోటల్లో బాగోవు. వండుకొని తీసుకెళ్దా మని, ఇంటికొచ్చాను. నరుసమ్మకు చెప్పే వచ్చాను" చెప్పిందామె.

"అలాగా! ప్రత్యూష ఎలా ఉంది? నీతో మాట్లాడిందా? " ఆదుర్దాగా అడిగింది అపూర్వ.

"సాయంత్రం పూట నన్ను లోపలికి పోనిచ్చారు. బాగానే మాట్లాడింది" నూతిలో వినిపించింది చంద్రమ్మ గొంతు.

"హమ్మయ్య! అయితే తగ్గిపోతుందిలే"

ఒకడుగు ముందుకేసి, అపూర్వ కుర్చీ పక్కన నేలమీదే చతికిలబడింది చంద్రమ్మ.

ఆమెలో ఇంకేదో గూడు కట్టుకొని ఉందని గ్రహించింది అపూర్వ.

"ఏం ఫర్లేదమ్మా. ఆస్పత్రి ఖర్చుల గురిం చేమీ బెంగపడకు. నేను చూసుకుంటాలే" పాప తల్లిలో ధైర్యం కూడగట్టడానికి ప్రయ త్నిస్తోంది.

ఒక్క పెట్టున పెద్దగా ఏడ్చేసింది చంద్రమ్మ.

కంగారు పడిపోయింది అపూర్వ.

"అయ్యో, ఇప్పుడేమైందని? చిన్నపిల్లలా అలా ఏడ్చేస్తే ఎలా? ధైర్యంగా ఉండాలి" సముదాయించబోయింది.

"ఎలా ఉండనమ్మా ధైర్నంగా? నిప్పు

> **కొత్తగాలి...**
>
> **'గాలి'**
> **కలుషితమైనదే కాదు**
> **అవినీతికీ**
> **చిరునామా నేడు**
>
> – బిక్కునూరి రాజేశ్వర్,
> పాన్గల్

లాంటి నిజం నా గుండెల్లో బగబగ మండుతాందమ్మా. నిమ్మలంగా ఎలా ఉండమంటావ్? "

"ఏంటి చంద్రమ్మా, దేని గురించి నువ్వు మాట్లాడేది? "

"పాప గురించేనమ్మా. ఎన్ని వైజ్జాలు జేసినా దాన్ని కాపాడుకోలేనన్న నిజం నాకు మాత్రమే తెలుసు. ఇప్పుడు మీకు, డాటరుగారికే తెలియాలమ్మా" ఏడుస్తూనే చెబుతోంది చంద్రమ్మ.

"ఏమిటి చంద్రమ్మా నువ్వనేది? పాపకు ప్రాణాంతక వ్యాధా? "

"అవునమ్మా, ఎయిడ్స్"

"నిజమా? ఎప్పుడు తెలిసింది? "

"పాప నాలుగేళ్లప్పుడు తెలిసింది"

"మరి ఉదయం డాక్టరుగారితో ఎందుకు చెప్పలేదు? "

"ఏమని చెప్పాలో పాలుపోలేదమ్మా. ఇన్నాళ్లూ పక్కింటి వాళ్లకు కూడా తెలియకుండా దాచాను. తెలిస్తే నా పాపను వెలేస్తారని భయం. కానీ ఇప్పుడు మీకు చెప్పాలని వచ్చాను"

'ఆరిందాలా మాటలు చెబుతూ, కమ్మని కంఠంతో పాటలు పాడుతూ, అందరినీ ఆకట్టుకునే ఆ చిన్నారి చిరు జీవితంలో ఇంత పెద్ద అగాధమా?' నమ్మలేకపోతోంది అపూర్వ.

అగాధం గుట్టు విప్పడం మొదలుపెట్టింది చంద్రమ్మ.




శ్రీకాకుళం జిల్లా నుంచి పనులు వెతుక్కుంటూ తాటికొండ ప్రాంతానికి వచ్చింది చంద్రమ్మ కుటుంబం. వాళ్లుండే వీధిలోనే ఉండేవాడు లారీ డ్రైవరుగా పనిచేసే సూరిబాబు. అతడు చురుకైన వ్యక్తి. సరదాగా ఉంటాడు. గలగలా మాట్లాడతాడు.

ఓ రోజు చంద్రమ్మను పలకరించాడు. యోగక్షేమాలడిగాడు.

వరికోత పనులు ఎక్కడా దొరక్కపోతే, తనను అడగమన్నాడు. చాలా మంది మేస్త్రీలు తనకు తెలుసని చెప్పాడు.

సూరిబాబుతో మాట్లాడుతుంటే చంద్రమ్మకు సమయం తెలిసేది కాదు.

ఇద్దరి మధ్య స్నేహం కుదిరింది. స్నేహం ప్రేమగా మారింది.

సూరిబాబుకు తల్లిదండ్రులు లేరు. అమ్మమ్మ మాత్రమే అతని బాగోగులు చూసేది.

ముందు చంద్రమ్మ తల్లిదండ్రులు ఒప్పుకోలేదు. ఆమె పట్టు విడవలేదు. అతన్నే పెళ్లి చేసుకుంటానని భీష్మించుకుంది. కోతల సీజన్ అయిపోయి, శ్రీకాకుళం వెళ్లిపోయినా, అడపాదడపా సూరిబాబు అక్కడికీ వచ్చేవాడు. ప్రతిరోజూ ఫోన్ చేసి, చంద్రమ్మతో మాట్లాడేవాడు.

చంద్రమ్మ తండ్రి ఓరోజు ఆమెను దగ్గర కూచోబెట్టుకుని, "సూడు సెంద్రి, ఈ పేమలూ గీమలూ మనకు పనికిరావే. పైగా ఆడెక్కడో గుంటూరు జిల్లావోడు. మంచికీ సెడుకీ రావాలన్నా పోవాలన్నా దూరాబారం. లారీడ్రైవోరుగా ఆడు సంపాదించేది కూడా అంతంత మాత్రమే. అదంత మంచి ఉజ్జోగం కూడా కాదు. నా మాటిని, మన నాగమల్లి గాణ్ని సేస్కో. సక్కంగ ఇద్దరూ కలిసి పన్లు జేస్కోవచ్చు. నాలుగు డబ్బులు సంపాదించుకుని, సుబ్బరంగా బతకొచ్చు" అంటూ నచ్చజెప్పడానికి ప్రయత్నించాడు.

చంద్రమ్మ ససేమిరా ఒప్పుకోలేదు.

"అందరు లారీడ్రైవోర్లూ నువ్వనుకున్నట్టే సెడ్డగా ఉండరయ్యా. సంపాదించిందంతా తాగుడుకీ తిరుగుడుకీ తగలెట్టరు. సూరి శానా మంచోడు. నేనంటే శానా ఇష్టం. నేను సూరిని తప్ప ఇంకెవుర్ని సేస్కోను" కరాఖండిగా చెప్పింది చంద్రమ్మ.

సూరిబాబు, చంద్రమ్మ ఒకింటివారయ్యారు.

వలస కార్మికురాలిగా వచ్చిన చంద్రమ్మ అలా గుంటూరు జిల్లా వాస్తవ్యురాలైంది.

సూరిబాబు క్రమం తప్పకుండా లారీకి వెళుతున్నాడు. చంద్రమ్మ పొలం పనులు చేస్తూ తనవంతు ఆదాయాన్ని సమకూరుస్తోంది. సూరిబాబు అమ్మమ్మ కూడా చనిపోవడంతో, ఇద్దరూ పొదుపుగా సంసారాన్ని నడుపుకుంటున్నారు. చంద్రమ్మ నెల తప్పింది. సూరిబాబు మురిసిపోయాడు. తొమ్మిదో నెల సగాన పడింది. సూరిబాబు ఈ మధ్య దూరప్రాంతాలు వెళుతున్నాడు. లోడుతో వెళితే, వారం పది రోజులగ్గానీ తిరిగి రావడం లేదు.

"బిడ్డ పుట్టేటయానికి మాత్రం నువ్వు నా దగ్గరే ఉండాలయ్యా" అని చాలాసార్లు చెప్పేదామె.

"ఏ రాష్ట్రంలో ఉన్నా సరే, ఒక్క ఫోన్ గొడితే, పరిగెత్తుకొత్తానే" అనేవాడు సూరి.

సూరికి గుజరాత్ వెళ్లే డ్యూటీ పడింది. అయిష్టంగానే బయల్దేరి వెళ్లాడు. చంద్రమ్మ కూడా ఇష్టం లేకపోయినా సాగనంపింది.

మరుసటిరోజే చంద్రమ్మకు కాన్పు జరిగింది. నొప్పులు రాగానే, పక్కింటామె చూసి, ప్రభుత్వాసుపత్రిలో పనిజేసే నర్సును పిలుచుకొచ్చింది.

పండంటి బిడ్డ పుట్టింది. పక్కింటామె సాయంతో, పలుమార్లు ప్రయత్నిస్తే, నాలుగు రోజుల తర్వాత, సూరిబాబు ఫోన్లో కలిశాడు.

శుభవార్త చెప్పగానే ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. వెంటనే బయల్దేరి వస్తానని చెప్పాడు.

శ్రీకాకుళం నుంచి తల్లిదండ్రులు రావడంతో చంద్రమ్మకు ధైర్యమొచ్చింది.

కానీ లోడును అర్జెంటుగా చేర్చాల్సి ఉండటంతో, మరో రెండురోజులు సూరికి వీలుకాలేదు. మొత్తానికి మూడోరోజు తిరుగు ప్రయాణం కట్టాడు.

పాప పుట్టాక, ఎనిమిదో రోజు ఫోనొచ్చింది. లారీ గుజరాత్ బోర్డరు కూడా దాటకముందే యాక్సిడెంట్ జరిగిందని!

'సూరి చావుబతుకుల్లో ఉన్నాడు. వెంటనే బయల్దేరి రావాలి' అని క్లీనర్ ఫోన్ చేయడంతో పసిగుడ్డును ఒళ్లోవేసుకుని బయల్దేరింది చంద్రమ్మ.

"ముందు నేను ఎల్తానమ్మా. ఎట్టా ఉందో జూసి ఫోన్జేస్తాను. అప్పుడు నువ్వొద్దువుగానీ" అని తండ్రి ఎంత చెప్పినా చంద్రమ్మ విన్లేదు.

తండ్రితో కలిసి పసికందును తీసుకొని ఒక రాత్రి, ఒక పగులు జనరల్ బోగీలో ప్రయాణించి, గుజరాత్ చేరుకుంది.

నానా తంటాలు పడి ఆస్పత్రికి చేరుకున్నారు. సూరిని ఐసీయూలో ఉంచినట్లు

> **కొత్తగాలి...**
>
> **పచ్చి శాకాహారి గొర్రె**
> **మానవునికి**
> **మంచి మాంసాహారం**
> **కసాయి పుణ్యం**
>
> *- అయినాల కనకరత్నాచారి,*
> కొరిశపాడు, ప్రకాశం జిల్లా

చెప్పారు. చూడ్డానికి కూడా అనుమతించలేదు. ఆ రాత్రంతా ఒ.పి. బ్లాక్‌లోనే పడిగాపులు పడ్డారు.

మరుసటి రోజు డాక్టరు రాగానే, బిడ్డను చంకనేస్కోని, చంద్రమ్మ వెళ్లి కలిసింది.

భాష కారణంగా తానేం చెబుతున్నాడో ఆమె అర్థం చేసుకోలేకపోతుందని గ్రహించిన డాక్టరు, తమ ఆసుపత్రిలోనే పనిచేస్తున్న ఓ తెలుగు వ్యక్తిని పిలిచి, విషయం వివరించాడు. అతను చంద్రమ్మను బయట ఓ మూలకు తీసుకెళ్లి, అదేదో రహస్యం చెప్పినట్లుగా చెప్పాడు.

"నీ భర్త చాలా పెద్ద యాక్సిడెంటుకు గురయ్యాడు. కాళ్లూచేతులూ విరిగిపోయాయి. మెదడు చితికిపోయింది. శరీరంలో చాలా భాగాలు నజ్జునజ్జయ్యాయి. రక్తం బాగాపోయింది. డాక్టరు చెప్పేదేమిటంటే, అతను దాదాపు బతకడం కష్టం"

అతని మాటలు చంద్రమ్మ హృదయాన్ని కుళ్లబొడిచాయి. దుఃఖం కట్టలు తెంచుకుంది. ఉన్న పళంగా మృత్యువు తనను కబళిస్తే బాగుండునని తలపోసింది.

ఆమె తండ్రి వచ్చి "ఏం చెబుతున్నారమ్మా? " అనడిగాడు.

"ఏమీ లేదు నాన్నా. నా కర్మ. ఆయన బతకడం కష్టమంటున్నారు"

పది నిమిషాల తర్వాత గుండె దిటవు చేసుకుని, మళ్లీ తెలుగు తెలిసిన వ్యక్తిని కలిసింది. భర్తను బతికించేందుకు మరేం మార్గం లేదా అని. లేదన్నాడతను.

తెచ్చుకున్న డబ్బులు అయిపోయాయి.

మరో ఇరవై నాలుగు గంటలు గడిచేసరికి డాక్టర్లు చెప్పినట్టే భర్త తుది శ్వాస విడిచాడు. శవాన్ని కారిడార్‌లో పడుకోబెట్టి, అర్జెంటుగా తీసుకెళ్లమని గొడవ మొదలెట్టారు ఆస్పత్రి సిబ్బంది.

చంద్రమ్మ ఏడ్చే శక్తిని కోల్పోయింది. కన్నీటికి కూడా కరవొచ్చింది.

తనకు తనే ధైర్యం చెప్పుకుని తండ్రితో "నాన్నా, ఈ శవాన్ని మళ్లీ మనూరి దాకా తీసుకెళ్లడం దండగ. ఇక్కడే కాల్చేద్దాం" అంది ఓ నిర్ణయానికి వచ్చినట్టు..

"అది పద్ధతి కాదేమోనమ్మా" తండ్రి సందేహించాడు.

"ఇదే పద్ధతి నాన్నా. మీరు వద్దని ఎంత బతిమాలినా, ఇష్టపడి ఇతన్నే నెత్తిన పెట్టుకున్నందుకు నాకీ శాస్తి జరగాల్సిందే"

"చూడమ్మా, కట్టెని కళ్లెదుట పెట్టుకుని మనం అయ్యన్నీ చర్చించుకోకూడదు. అయిపోయిందాన్ని గురించి మాటలొద్దు. ఏం చేయాలో ఆలోచిద్దాం"

తన నిర్ణయంలో మార్పు లేదన్నట్టు చూసింది చంద్రమ్మ.

"సరే, నువ్వన్నట్లే శవాన్ని ఇక్కడే దహనం చేద్దాం" అన్నాడతను.

★ ★ ★

"దురదృష్టం మమ్మల్ని అంతటితో వదిలిపెట్టలేదు.." అంటూ మళ్లీ బాధగా మొదలెట్టింది చంద్రమ్మ.

ఆశ్చర్యంగా చూసింది అపూర్వ.

"ఆయనను కట్టుకున్నందుకు నేనేం బాధపడలేదమ్మా. ఆయన పోయినప్పుడు నా తలరాత ఇంతే అని సరిపెట్టుకున్నాను. బిడ్డపైనే పంచప్రాణాలు పెట్టుకుని కాలం గడుపుతున్నాను. ఓసారి పాపకు తీవ్రంగా జ్వరం వచ్చింది.. వారం రోజులైనా మూసిన కన్ను తెరవలేదు. ఎన్నోమందులు వాడాను. చివరికి పాపకు తగ్గితే మంగళగిరి పానకాలస్వామి కొండకు వస్తానని మొక్కుకున్నాను. పదిరోజులకు బిడ్డ కన్ను తెరిచింది. రెండు వారాల తర్వాత మొక్కు తీర్చుకోవడానికి వెళ్లాం. తిరిగి వచ్చేటప్పుడు అనుకోకుండా పెద్ద ప్రమాదం జరిగింది. రోడ్డు యాక్సిడెంట్‌లో ఇద్దరం గాయపడ్డాం. నా కంటే పాపపరిస్థితి మరీ విషమంగా తయారైంది. దగ్గర్లోని ఆస్పత్రిలో చేర్పించాం. పాపకు నెత్తురు ఎక్కించాలంటూ గబగబ రెండు బాటిల్స్ ఎక్కించారు... ప్రాణాపాయం తప్పిందని సంతోషించాం.. కానీ అసలు ఖర్మ అప్పుడే కాలిందని తెలియలేదమ్మా..." బావురు మని ఏడ్చింది చంద్రమ్మ.

"ఏం జరిగింది? " ఆందోళనగా అడిగింది అపూర్వ.

"ఇంకా ఏం జరగాలమ్మా.. ఏం జరగకూడదో అదే జరిగింది..ఆ నెత్తురుతోపాటు ఎయిడ్స్ రోగం నా బిడ్డ ఒంట్లోకి ఎక్కేసిందమ్మా.."

బాధలు భరించీ భరించీ రాయిలా మారిపోయాను. ఆ జబ్బేదో నాకొచ్చినా బాగుండు.. ఏం పాపం చేసిందని ఆ పసి దానికొచ్చిందా అని నేను ఏడ్వని రోజు లేదమ్మా" అంటున్న చంద్రమ్మను ఎలా ఓదార్చాలో అర్థం కావడం లేదు అపూర్వకు.

"ఆ వ్యాధి గురించి తెలుసుకోడానికి శానా ప్రయత్నాలు చేశానమ్మా. అది వచ్చినవాళ్లు ఎక్కువ కాలం బతకాలంటే ఏం చేయాలని ఎంతోమందిని అడిగాను. ఏవేవో చెప్పారు. ఖరీదైన ఇంగ్లీషు మందులున్నాయన్నారు. వాడదామంటే డబ్బు లేదు. తిండిలో జాగ్రత్తలు తీసుకుంటే ఎక్కువ రోజులు బతకొచ్చని ఎవరో చెబితే, అవి తెచ్చి పెడుతున్నాను. కానీ అయిదార్నెల్లుగా పాప పరిస్థితి బాగోలేదు"

"అంటే, ఇప్పటిదాకా పాపకు వ్యాధి తగ్గడానికి వైద్యం చేయించలేదా?" అడిగింది అపూర్వ.

"లేదమ్మా, ఏం పెట్టి సేయించను? తాహతు లేదని, ఎయిడ్స్ వచ్చిన పిల్లల్ని చూసుకునే హోంలో చేర్పించాను. నాలుగు నెలల తర్వాత పోయి చూస్తే అక్కడింకా అధ్వానంగా ఉన్నట్టనిపించింది. దాన్ని నడిపేవాళ్లకి డబ్బులైతే వస్తున్నాయిగానీ ఆటిని పిల్లలకు పెట్టేదానికన్నా పక్కజేబుల్లో నెట్టుకోటానికే పాట్లు పడుతున్నారు. దానికన్నా ఇల్లే నయమని తీసుకొచ్చేశాను"

"ఇప్పటికీ నమ్మలేకపోతున్నాను చంద్రమ్మా. నువ్వు చెప్పేవన్నీ అబద్ధాలైతే ఎంత బాగుండు"

"నా బతుకే పెద్ద అబద్ధమైందమ్మా" బావురుమంది చంద్రమ్మ.

"నోనో. అలా బాధ పడకు చంద్రమ్మా. ఇప్పటిదాకా నువ్వు చాలా ధైర్యంగా నెట్టుకొచ్చావు. గుండెల్లో నిప్పులు దాచుకుని కూడా ఆ మాత్రం నిబ్బరంగా ఉన్నావు.

## అక్టోబరు - 2011
### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **సి. శర్వాణి**
   - డా. ఎ.ఎస్.రావు నగర్, హైదరాబాద్
2. **బి.వి. పద్మావతి**
   - సింగరేణి కాలరీస్, కొత్తగూడెం
3. **జె. భవాని**
   - దుగ్గిరాల, గుంటూరు జిల్లా
4. **సిహెచ్. హర్ష**
   - కరెన్సీనగర్, విజయవాడ
5. **చాట్ల గంగమణి**
   - కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. అనంత్ | 6. శ్రీనాథ్ |
| 2. హిందూ | 7. వాసుదేవన్ నాయర్ |
| 3. ఇద్దరు | 8. జాన్ మిల్టన్ |
| 4. హేమాంబరీ దేవి | 9. శకుంతల |
| 5. రాజా ఈశ్వర వర్మ | 10. అమెరికా |

ఇప్పుడు కూడా ఆ సహనం అవసరం. పాప గురించి నువ్వు బాధపడకు"

"డాక్టరుగారికి కూడా ఈ సంగతులు చెప్పండమ్మా"

"అలాగే. నేను చెబుతాలే, పాప గురించి ఎక్కువగా బెంగ పడొద్దు. మనకెంత ప్రాప్తమో అంతే దక్కుతుంది"

"నా బాధ అది కాదమ్మా. ఇప్పుడు పాపకా జబ్బుందని నలుగురికీ తెలిస్తే ఎట్టా సూత్తారోనని.."

"తెలియదు. డాక్టరుకి తప్ప నేనెవ్వరికీ

చెప్పను. సరేనా? ధైర్యంగా ఉండు"

"దండాలమ్మా" అనేసి చంద్రమ్మ గభాల్న అపూర్వ కాళ్లను తాకింది.

అపూర్వ కంగారుగా ఆమెను పైకి లేపి, భుజం తట్టింది. నీకు నేనున్నానన్నట్లుగా!

★ ★ ★

మరుసటి రోజు ఉదయం తొమ్మిదికల్లా ఆస్పత్రికి వెళ్లింది అపూర్వ.

డాక్టరుగారు రావడానికి టైమ్ పడుతుందని చెప్పారు.

ఐసీయూకి వెళ్లి తలుపు అద్దంలోంచి ప్రత్యూషను చూసింది అపూర్వ.

నిద్రపోతుంది ప్రత్యూష. అందమైన, అమాయకమైన ఆ పాప ముఖం చూస్తుంటే అపూర్వ కళ్లు చెమర్చాయి.

తిరిగొచ్చి, వెయిటింగ్ రూములో కూచుంది.

ఆలోచన్లు ఒకదానికొకటి ప్రవాహంలా తోసుకు వస్తున్నాయి. ప్రతి పాయలోనూ ప్రత్యూష గలగలలే వినిపిస్తున్నాయి. ఆ పాప స్వరపేటికలోంచి ఉద్భవించి, చుట్టూ ఉన్న జనాన్ని అమాంతం ముంచెత్తే సరిగమలే వినిపిస్తున్నాయి.

సరిగ్గా నెల కూడా కాలేదేమో, ప్రత్యూషను ఆ ఆడిటోరియం అంతా అబ్బురంగా చూసి! వార్షికోత్సవం సందర్భంగా

## కొత్తగాలి...

**మేన్‌హోల్స్ కప్పవేం?**
**పిచ్చికుక్కల్ని చంపవేం?**
**ప్రపంచంలో 'నంబర్‌వన్' కలలు**
**ఆర్థికంగానా? హార్దికంగానా??**

– దూసి నీహారిక,
బెంగళూరు

ప్రత్యూష పాడిన పాట విన్న వెంటనే అపూర్వకు ఆ ఆలోచన వచ్చింది.

రాజారావుకు చెబితే "నీ మొహం.. ఆ పోటీలకు సంవత్సరాల తరబడి సంగీత సాధన చేసే పిల్లలొస్తారు. సెలెక్ట్ కావడం అంత తేలిగ్గాదు" అన్నాడు.

"పోన్లెండి, చూద్దాం. మహా అయితే ఛార్జీలు దండగ. అంతేగా? " అంది తను.

"నీ ఇష్టం" అయిష్టంగానే ఒప్పుకున్నాడు రాజారావు.

తనే ఆరోజు ఉదయాన్నే ఆరు గంటలకు ప్రత్యూషను వెంటబెట్టుకుని విజయవాడ వెళ్లింది.

తుమ్మలపల్లి కళాక్షేత్రం!

'ఈటీవీ పాడుతా తీయగా పోటీలకు విచ్చేయుచున్న వర్ధమాన బాలగాయకులకు సుస్వాగతం!' అనే బ్యానరును ప్రేమగా చూస్తూ లోపలికి నడిచారు అపూర్వ, ప్రత్యూష.

ఆడిటోరియం అంతా కోలాహలమే!

రిజిస్ట్రేషన్ ప్రక్రియ పూర్తి చేసుకుని లోపలికి నడిచారు.

గంట తర్వాత అంతా నిశ్శబ్దం. ప్రముఖ గాయకులు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం వేదిక మీదకు వచ్చి, వినమ్రంగా అందరికీ నమస్కరించి ఆశీనులయ్యారు.

ఆయన్ను చూడగానే అపూర్వ ఆనందంతో చప్పట్లు కొట్టింది. ఆయన గాత్రమంటే తనకు చాలా చాలా ఇష్టం. కాలేజీలో చదువుకునే రోజులు గుర్తొచ్చాయి.

"ఈ రోజు పోటీలు మూడు రౌండ్లుగా ఉంటాయి. చివరి వరకూ నిలబడిన వారికి 'ఈటీవీ'లో 'పాడుతా తీయగా'లో పాడే ఛాన్స్ దొరుకుతుంది" అని ప్రకటించగానే కార్యక్రమం మొదలైంది.

పిల్లలు ఒకరి తర్వాత ఒకరు పాడుతున్నారు.

పాట అయిపోగానే బాలుగారు ఆప్యాయంగా పిల్లల్ని ప్రశ్నలడుగుతున్నారు.

మొదటి రౌండు ముగిసింది. ప్రత్యూష సెలక్టయింది. రెండో రౌండులోనూ సెలక్ట యింది. పిల్లల సంఖ్య ఎక్కువగా ఉండటం వల్ల, బాలుగారు ప్రత్యూషను ఎలాంటి వివరాలూ అడగలేదు. మధ్యాహ్న భోజనం తర్వాత మూడో రౌండు మొదలయింది. సాయంత్రం అయిదు గంటల సమయంలో ప్రత్యూష వంతు వచ్చింది.

"అమ్మా చూడాలి, నిన్నూ నాన్నను చూడాలి, నాన్నకు ముద్దు ఇవ్వాలి, నీ ఒడిలో నిద్దురపోవాలి.."

పాత సినిమా 'పాపం పసివాడు'లోని పాట పాడుతుంటే, నిజంగా సూది పడినా శబ్దం వినిపించేంత మౌనం రాజ్యమేలింది.

పాట ముగిశాక మాత్రం ఆడిటోరియం చప్పట్లతో మార్మోగింది. అపూర్వకైతే కళ్లు ధారాపాతంగా వర్షించాయి.

బాలుగారు సీటులోంచి లేచివచ్చి ప్రత్యూషను కౌగిలించుకున్నారు.

"అద్భుతం. చాలా బాగా పాడావమ్మా" అంటూ అభినందించారు.

"ధన్యవాదాలు" అంది ప్రత్యూష.

"ఓహ్! అచ్చ తెలుగు. చాలా సంతోషం. సంగీతం ఎవరి దగ్గర నేర్చుకుంటున్నా వమ్మా? "

"లేదండీ. నేనస్సలు సంగీతమే నేర్చుకో వడంలేదు. సంగీతం గురించి నాకేమీ తెలి యదు"

"అవునా? మరెలా పాడుతున్నావు? "

"మా పక్కింటి ఆంటీవాళ్లకు టేప్‌రికార్డర్ ఉంది. ఆమెకు పాత పాటలంటే బాగా ఇష్టం. నేను కూడా శ్రద్ధగా వింటాను"

"గ్రేట్. ఆల్ ది బెస్ట్. గాడ్ బ్లెస్‌యూ" ఆశీర్వదించారు బాలు.

మొత్తానికి సెలక్షన్స్ ముగిశాయి. ప్రత్యూష సెలెక్ట్ కాలేదు.

పాప కన్నా అపూర్వ ఎక్కువగా నిరాశ పడింది. ఒక్కసారి బాలుగారిని కలిస్తే బాగుండుననుకుంది. కానీ ఆయన చుట్టూ జనం దడికట్టారు.

నిస్పృహగా వెనుదిరుగుతుండగా నిర్వా హకుల్లో ఒకరు వచ్చి "మిమ్మల్ని బాలు గారు పిలుస్తున్నారు" అన్నాడు.

అపూర్వ ఆనందానికి హద్దుల్లేవు. పాపను తీసుకుని చకచకా వెళ్లింది.

బాలుగారు రమ్మని సైగచేశారు.

"మీ అమ్మాయా? " ప్రశ్నించారు.

"లేదండి, మా కాన్వెంటులో చదువుకుం టుంది" చెప్పింది అపూర్వ.

"పాప సెలెక్ట్ కాలేదని ఫీలవకండి. మా నిబంధనలు మాకుంటాయి. ఈ పాపకు స్వరం దేవుడిచ్చిన వరం. ఈ వయసులోనే టోన్‌లో గొప్ప మెచ్యూరిటీ ఉంది. అయితే సంగీతం పరంగా చాలా తప్పులు దొర్లుతు

## ఆహా! రాయికేం?

న్యూఢిల్లీలో డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌ను చూడటానికి ఓసారి వరద దంపతులు రాష్ట్ర పతి భవన్‌కు వెళ్లారు.

వారిని ఆప్యాయంగా ఆహ్వానించి, 'నాయన



గారు బాగున్నారా? ప్రస్తుతం ఏమైనా రాస్తు న్నారా?' అని అబ్బూరి రామకృష్ణారావు గు రించి కుశలం అడిగారు రాధాకృష్ణన్.

'ఔను, రాస్తున్నారు. నిన్ననే వచ్చిందండీ.. ఆయన నుంచి ఒక ఉత్తరం' అన్నారు వరద వెంటనే నవ్వుతూ.

న్నాయి. ఎవరైనా మంచి మాస్టర్ని చూసి, సంగీతం నేర్పించండి. ఈసారి గ్యారంటీగా సెలక్టవుతుంది. పాపా! ఆల్ ది బెస్ట్"

బాలుగారి మాటలు ఇంకా శ్రుతిపక్వంగా చెవుల్లో మార్మోగుతూనే ఉన్నాయి.

"అమ్మా, డాక్టరు గారొచ్చారు" కాంపౌండర్ మాటల్తో జ్ఞాపకాల సంగీతం చెదిరి పోయింది. లేచి, డాక్టరు గదిలోకి వెళ్లింది.

"నమస్తే డాక్టర్. మీతో మాట్లాడాలి"

సమయం కేటాయిస్తానన్నట్లు భరోసా ఇచ్చాడు డాక్టర్.

చంద్రమ్మ చెప్పిన విషయాలన్నీ వివరంగా చెప్పింది అపూర్వ.

"నాకు నిన్ననే అనుమానమొచ్చింది అపూర్వా! అయితే టెస్ట్ రిజల్ట్స్ రాకుండా చెప్పడం భావ్యం కాదని ఆగాను" చెప్పారు డాక్టర్.

★ ★ ★

ప్రత్యూషను ఆస్పత్రి నుంచి డిశ్చార్జ్ చేశారు. బిల్లు మొత్తం అపూర్వే చెల్లించింది.

రెండు రోజుల తర్వాత ప్రత్యూష స్కూలుకు వచ్చింది.

విద్యార్థులు, ఉపాధ్యాయులు ఆత్మీయంగా పలకరించారు. 'ఇప్పుడెలా ఉంది?' అంటూ ఆరా తీశారు.

నాలుగు రోజుల తర్వాత..

అపూర్వ కలలో కూడా ఊహించని సమస్య ఎదురైంది.

ఉదయం స్కూలు మొదలయ్యే సమయానికి దాదాపు యాభైమంది పేరెంట్స్ వచ్చారు.

ప్రిన్సిపాల్ రూములో కూచొని పనిచేసుకుంటున్న అపూర్వ దగ్గరకు స్నేహ వచ్చి విషయం చెప్పింది.

"వ్వా.. వ్వాట్? ఏమిటి నువ్వనేది?" అయోమయంగా అడిగింది అపూర్వ. "ఎస్ టీచర్. ప్రత్యూషను మన స్కూలు నుంచి పంపించేయాలట. లేకుంటే వాళ్ల పిల్లలందరినీ మాన్పించేస్తారట"

"అదేంటి? ఎందుకని?"

"ఆ పాపకు ఎయిడ్స్ వ్యాధి ఉందట. తనతో కలిసి వుంటే వాళ్ల పిల్లలక్కూడా సోకుతుందట"

"నాన్సెన్స్. ఎవరా మాట అన్నది?"

"ప్లీజ్, మీరు రండి మేడమ్. వాళ్లు బాగా గొడవ పెడుతున్నారు"

"పద, వస్తున్నా"

ఇద్దరూ కలిసి పేరెంట్స్ దగ్గరకు వచ్చారు.

"ప్లీజ్, అలా కూచొని మాట్లాడుకుందాం రండి" పక్కనే ఖాళీగా ఉన్న క్లాస్‌రూము చూపించింది అపూర్వ. వాళ్లందరూ ఆమె వినతిని మన్నించారు.

టీచర్ కుర్చీలో కూచుంటూ "చెప్పండి, ఏమిటి సమస్య?" తనకేమీ తెలియదన్నట్టు అడిగింది అపూర్వ.

ఒక పెద్దాయన లేచాడు.

"ఆ సెంద్రమ్మ కూతురికి ఎయిడ్స్ వచ్చిందంట. టీసీ ఇచ్చి పంపెయ్యండి" డైరెక్టుగా విషయానికొచ్చేశాడాయన.

"అలా అని మీకెవరు చెప్పారు?"

"అంటే మీకు సాక్ష్యాధారాలు చూపించాలా? మాకు చాలా నమ్మకంగా తెలిసిన వార్త ఇది" విసురుగా లేచి, అలా మాట్లాడిన పేరెంట్ పీజీ చదివాడని అపూర్వకు తెలుసు.

ఒక్క నిమిషం ఆలోచించిందామె. ఇప్పటికిప్పుడు వాళ్లతో వాదించడం అనవసరం అనిపించింది.

"సరే సర్. నాక్కొంచెం టైమివ్వండి"

"అంటే ఎన్ని నెలలు?" వ్యంగ్యంగా అడిగాడొకాయన.

"లేదు సర్. ఈ ఒక్కరోజే. దయచేసి రేపు కూడా మీరంతా రండి. చాలా ముఖ్య విషయాల్ని మీతో పంచుకోవాలి"

వాళ్లంతా అందుకు ఒప్పుకొని వెళ్లిపో యారు.

వెంటనే అపూర్వ సెల్‌ఫోన్ అందుకుని, వికాస్‌కు కాల్‌చేసింది.

"మీరెంత అర్జెంటు పనిలో ఉన్నాసరే, అరగంటలోపే ఇక్కడికి రావాలి. చాలా ముఖ్యమైన పని. ప్లీజ్"

"పావుగంటలో మీ స్కూల్లో ఉంటా" అని పెట్టేశాడు వికాస్.

అపూర్వ తన రూములోకెళ్లి కూచుంద న్నమాటేగానీ మనసు మనసులో లేదు.

ఒకేఒక్క ప్రశ్న ఆమెను పట్టి కుదిపే స్తోంది.

"ప్రత్యూషకు ఎయిడ్స్ ఉందన్న విషయం ఎలా లీకైంది? "

తను రాజారావుకు కాకుండా ఇంకెవరి కైనా చెప్పిందా?

అవకాశమే లేదు. మరి ఎలా లీకైంది?

ఒకవేళ రాజా!? ఛఛ, అతనలా చేయడు.

స్నేహ మళ్లీ వచ్చి "మేడమ్, సెకండ్ క్లాస్ బి సెక్షన్ టీచర్ రంజిత ఈరోజు రాదట. ఇప్పుడే ఫోన్జేసి చెప్పింది. ఆ క్లాస్ ను ఎవర్ని చూడమంటారు? " అడిగింది.

"అదేంటి, నిన్న మధ్యాహ్నం మాత్రమే సెలవని చెప్పింది కదా? "

"ఏమో టీచర్? "

"ఈ మధ్య రంజిత సెలవులు ఎక్కువై పోతున్నాయి. రేపు గట్టిగా చెప్పేసె య్యాలి" లోపలికి అనుకోబోయి పైకి అనే సిందేమో అనుకుంది స్నేహ.

"సరే. ప్రస్తుతానికి జగదీష్ మాస్టార్ని చూడమని చెప్పండి"

స్నేహ అలా వెళ్లగానే మళ్లీ ఆలోచన్లు ముసురుకున్నాయి.

ఏం చెయ్యాలి? వాళ్ల డిమాండ్ తీర్చక పోతే, ఇవ్వాళ యాభైమంది, రేపు డెబ్భై మంది పిల్లలు వెళ్లిపోతారు. స్కూలు ఖాళీ అయ్యే మాట అటుంచి, చెడ్డపేరు వస్తుంది.

పోనీ, ప్రత్యూషను పంపేద్దామా? ఎయిడ్స్ గురించి అంతో ఇంతో అవగా హన ఉండి, అది అంటువ్యాధి కాదని తెలిసి కూడా ఆ పాపను మానెయ్యమ నడం మానవత్వం అనిపించుకోదు.

ఎలా? ? !!

"లోపలికి రావచ్చా" నవ్వుతూ అడిగాడు వికాస్. ఆలోచన్లలోంచి తలెత్తి చూసింది అపూర్వ.

వికాస్‌ను చూడగానే ధైర్యం వచ్చింది.

"ప్లీజ్ రండి, రండి" ఆహ్వానించింది.

"ఏమిటీ, అంత అర్జెంటుగా రమ్మ

> ## కొత్తగాలి...
>
> **రైతు వెతలు**
> **చూసి**
> **ఉరితాడు**
> **కన్నీరెట్టుకుంది**
>
> – యు. చిట్టిబాబు,
> న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

న్నారు. ఎనీ ప్రాబ్లమ్? "

"అవునండి. చాలా పెద్ద ప్రాబ్లమ్.." జరిగిందంతా చెప్పింది అపూర్వ.

సమస్య విని వికాస్ కూడా స్తబ్దుగా ఉండిపోయాడు.

ఏం మాట్లాడాలో, ఎలా స్పందించాలో, ఏ ఉపాయం అందించాలో వికాస్‌కు అంతుబట్టలేదు.

రెండు వేళ్లతో నుదిటి మీద కొట్టు కుంటూ మౌనంగా కూచుండిపోయాడు.

"నేను ఏమనుకుంటున్నానో చెప్పనా వికాస్" అన్న ఆమె మాటల్ని బట్టి, ఆ

సమస్యపై తను తీవ్రంగానే ఆలోచించి నట్లు అర్థం చేసుకున్నాడు.

"చెప్పండి"

"నిజానికి ఎయిడ్స్ గురించి వాళ్లకు తెలిసింది చాలా తక్కువ. బాగా చదువుకున్న వాళ్లకు కూడా హెచ్ఐవీకీ, ఎయిడ్స్‌కీ తేడా తెలియదు. పాజిటివ్ ఉన్న పిల్లలతో కలిసి ఆడుకున్నా ఎయిడ్స్ సోకుతుందనే అపోహ చాలామందిలో ఉంది. సో.." చెప్పడం ఆపి, మంచినీళ్లు తాగింది అపూర్వ.

"ఎయిడ్స్ అవేర్‌నెస్ క్యాంపెయిన్స్ చేసే వాళ్లు ఎవరైనా మీకు తెలుసా?"

"ఎస్, వివేకానంద అని నా ఫ్రెండు. వాడికో స్వచ్ఛంద సంస్థ ఉంది. తన జీతంతోనే దాన్ని నడుపుతాడు. ఆరేళ్ల నుంచి చాలామంచి పనులు చేశాడు. ఈ మధ్యనే వాడికి ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎయిడ్స్ కంట్రోల్ సొసైటీ నుంచి ఓ స్కీమ్ శాంక్షన్ అయింది. అందులో భాగంగా ఈ మూడు మండలాల్లో ఎయిడ్స్ అవేర్‌నెస్ ప్రోగ్రామ్స్ చేస్తున్నాడు"

"వెరీగుడ్. రేపు పేరెంట్స్ వచ్చే సమయానికి అతను కూడా వస్తే చాలు"

"అతన్ని తీసుకొచ్చే బాధ్యత నాది" హామీ ఇచ్చాడు వికాస్.

అపూర్వ కాస్త విశ్రాంతిగా వెనక్కివాలింది.

★ ★ ★

"మీరంతా అనుకుంటున్న వాటిలో అపోహలే ఎక్కువ. ఎయిడ్స్ వ్యాధి భూతమో దెయ్యమో కాదు. అంటువ్యాధి అంతకన్నా కాదు. ఈ స్కూల్లో ఓ పాపకు ఎయిడ్స్ సోకిందని, ఆ పాప పక్కన మీ పిల్లలు కూచున్నా, కలిసి ఆడుకున్నా, కలిసి భోంచేసినా, ఆ పాప తాగిన గ్లాసులో నీళ్లు తాగినా.. ఆ వ్యాధి మీ పిల్లలకు కూడా వస్తుందని మీలో చాలామంది అనుకుంటున్నారు. వీటిల్లో ఏదీ నిజం కాదు.."

వివేకానంద బోర్డు మీద ఏవేవో బొమ్మలు గీస్తూ, పదాలు రాస్తూ, సీరియస్‌గా చెప్పుకుపోతున్నాడు.

పేరెంట్స్ నిశ్శబ్దంగా వింటున్నారు. వాళ్లు ఆ మాటల్ని ఎలా స్వీకరిస్తున్నారో గమనించే ప్రయత్నం చేస్తున్నారు అపూర్వ, వికాస్.

ఉద్దేశపూర్వకంగా ఉపాధ్యాయుల్ని కూడా ఆ కార్యక్రమంలో కూచోబెట్టింది అపూర్వ.

"ఈ ప్రయత్నాలన్నీ వేస్ట్. ఆ పాపను పంపించడమే మేలు" అని కరాఖండిగా చెప్పిన రాజారావు మాత్రం రాలేదు.

ఆ మాటలు అపూర్వను బాగా గాయపరిచాయి. అయినా వదిలేసింది.

"ఒక్కసారి ఆలోచించండి. ఆ పాప ఏ పాపం చేసింది? తన ప్రమేయం అణుమాత్రమైనా లేకుండా ఆ వ్యాధి సోకింది. దానికా పాపను బాధ్యురాలిని చేసి, స్కూల్లో చదువుకునే అదృష్టం లేకుండా చేయడం మానవత్వమనిపించుకోదు"

సుమారు డెబ్బై మంది పేరెంట్స్ హాజరయ్యారు.

నలభై నిమిషాలపాటు సహనంతో విన్నారు.

"ఈ సోది అంతా మాకెందుగ్గానీ, ఇప్పుడు మీరు చెప్పొచ్చేదేమిటి? ఆ పాపను పంపించేది లేదు అని. అదే మీ నిర్ణయమైతే, మా నిర్ణయం మేం చెబుతాం" ఓ పెద్దాయన వివేకానంద ప్రసంగానికి అడ్డు తగిలాడు.

అపూర్వ లేచి, వివేకానంద స్థానంలో నిలబడింది.

"లేదు లేదు, రెండు చేతులూ జోడించి నమస్కరిస్తున్నా. మేం చెప్పే విషయాలు వినండి"

"ఏందమ్మా వినేది? ఇన్నాళ్లూ పంప



డమే పెద్ద తప్పు. ఇంకా చూస్తూ చూస్తూ ఊరుకునేది లేదు"

ఏదో సర్దిచెప్పబోయింది అపూర్వ. ఎవ్వరూ వినలేదు.

మరో అరగంట వాగ్వాదాలు సాగాయి.

వికాస్ కూడా విశ్వ ప్రయత్నం చేశాడు. ప్రయోజనం లేదు.

"ఇక చర్చ వద్దు టీచరుగారూ! మీ మీద మాకు గౌరవం ఉంది. అందుకే చివరి అవకాశం ఇస్తున్నాం. ఈరోజు శుక్రవారం. సోమవారం నాడు ఆ పాప స్కూలుకు రాకూడదు. కాదంటే మా మాట మీద మేము నిలబడతాం" మరో పెద్దాయన గౌరవపూర్వక హెచ్చరిక చేసి, "పదండి.. ఇక మాట్లాడేదేమీ లేదు" అన్నాడు.

పేరెంట్స్ అంతా వెళ్లిపోయారు. ఆ

వెనకే ఉపాధ్యాయులు బయటికి నడిచారు.

ఆ హాలులో అపూర్వ, వికాస్, వివేకానంద మిగిలారు.

అపూర్వ హతాశురాలయింది. తల పట్టుకు కూచుంది. ఆమె తీవ్ర నిరాశకు గురైనట్లు గ్రహించాడు వికాస్.

అనునయించాలన్న ఉద్దేశంతో "అపూర్వా!" అన్నాడు.

వెక్కిళ్లు పెడుతూ చిన్నపిల్లలా ఏడ్చేసింది అపూర్వ.

"మేడమ్! మీకిది కొత్త. నేనిప్పటికి కొన్ని వందల కార్యక్రమాలు నిర్వహించాను. అంత తేలిగ్గా వీళ్లలో మార్పురాదు. అది వాళ్ల తప్పు కూడా కాదు. మీరేం వర్రీ కావద్దు" నచ్చజెప్పేందుకు ప్రయత్నించాడు వివేకానంద.

7



ఆదివారం.

సాయంత్రం నాలుగవుతోంది. అపూర్వ స్కూలు మైదానంలో వేపచెట్టు కింద కుర్చీ వేసుకుని కూచుంది.

వికాస్, వివేకానందల కోసం ఎదురు చూస్తోంది.

అనుక్షణం ఆమె ప్రత్యూష తాలూకు ఆలోచన్లతో సతమతమవుతోంది.

ఇంకొన్ని ఆలోచనలు అడ్డదిడ్డంగా తోసుకొచ్చి, అనవసర తలనొప్పులు తెచ్చి పెడుతున్నాయి.

రాజారావు ఆ కార్యక్రమానికి రాలేదు. తాను చెప్పకముందే, ఆ రాత్రి తనతో అక్కడేం జరిగిందో పొల్లుపోకుండా చెప్పాడు.

ఇవన్నీ అతనికి ఎవరు చెబుతున్నారో అర్థం కావడం లేదు. టీచర్లు చెప్పినా, క్లుప్తంగా సారాంశం చెబుతారు. కానీ సంభాషణలతో సహా ఎలా తెలుస్తోంది?

ప్రత్యూష విషయంలో రాజా తనకెందుకు సపోర్ట్ చేయడం లేదు?

శనివారమంతా ఈ అనుమానాల నివృత్తిపైనే దృష్టి సారించింది.

రకరకాలుగా ఆరా తీసింది. కావాలంటే టీచర్ల దగ్గర ఆ విషయాలు ప్రస్తావించి, వాళ్ల వ్యాఖ్యానాలను రికార్డు చేసుకుంది.

ఎవరి మాటల్లోనూ ఎలాంటి క్లూ దొరకలేదు.

అందరిలోకీ తాను నమ్మే టీచర్ స్నేహ. ఆమెను తన రూములోకి పిలిచి "స్నేహా, మన స్కూలుకు మాత్రమే పరిమితం కావలసిన కొన్ని విషయాల్ని ఎవరో పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నారు" అంది. ఆ వ్యక్తి ఎవరో నీకేమైనా తెలుసా అని స్ఫురించేలా.

స్నేహ కంగారు పడిపోయింది, అపూర్వ తననే అనుమానిస్తోందేమోనని!

అది గమనించి "కంగారు పడకు. నీ మీద నాకు పూర్తి నమ్మకం ఉంది. కాబట్టే ఆ వ్యక్తి ఎవరో తెలిస్తే చెబుతావని నిన్ను అడిగాను" అంది.

"ఎలాంటి విషయాలు లీకవుతున్నాయి మేడమ్? " ఉదాహరణ చెప్పమన్నట్టు అడిగింది స్నేహ.

"ప్రత్యూషకు ఎయిడ్స్ ఉందన్న విషయం నేనెవ్వరికీ చెప్పలేదు. అలాగే నిన్న ఎయిడ్స్ అవేర్‌నెస్ ప్రోగ్రామ్ గురించి కూడా.."

"పాప సంగతి ఎలా లీకైందో నాకైతే తెలియదుగానీ, నిన్నటి ప్రోగ్రామ్ గురించి మాత్రం రంజిత చెప్పివుండొచ్చు మేడమ్"

"కచ్చితంగా చెప్పగలవా? "

"ఎస్ మేడమ్. ఇదైతే కన్‌ఫర్మ్‌గా చెప్ప గలను. స్టాఫ్‌రూములో రంజిత రాజారావు సారుతో చెప్పడం నేను చూశాను. విన్నాను" స్పష్టంగా చెప్పింది స్నేహ.

"ఓకే స్నేహ. లీవిట్" ఆ విషయాన్ని అంతకన్నా సాంద్రతరం చేయకూడదను కుంది అపూర్వ.

ఆలోచనలను భగ్నం చేస్తూ ఓ బైక్ వచ్చి, అపూర్వకు దగ్గర్లో ఆగింది. వికాస్, వివేకా నంద దిగారు.

"ఏం ఆలోచించారు? " అపూర్వకు ఎదు రుగా ఉన్న కుర్చీలో కూచుంటూ అడిగాడు వికాస్.

వివేకానంద కూడా మరో కుర్చీ తెచ్చు కుని వికాస్ పక్కనే కూచున్నాడు.

"ష్చ్ ఆలోచించడానికేమి లేదు వికాస్. మార్గాంతరం లేదు. ఇప్పటికిప్పుడు స్కూలు ఖాళీ అయితే నేనూ, రాజా ఎలా బతకడం అనే మాట అటుంచి, సిబ్బంది మొత్తం అన్యాయమైపోతారు"

"సో, ప్రత్యూషను పంపించేయడానికి సిద్ధమయ్యారన్నమాట" అతనా మాటలు ఏ ఉద్దేశంతో అంటున్నాడో గ్రహించే ప్రయత్నం కూడా చేయలేదు అపూర్వ.

"నేనాలోచిస్తున్నది అది కాదు వికాస్. ఈ పేపర్ క్లిప్పింగ్ చూడు" అంటూ అందించింది.

వికాస్ చదువుతుంటే, వివేకానంద తొంగి చూస్తున్నాడు.

'ఇరవైఐదు మంది ఎయిడ్స్ చిన్నారుల గెంటివేత'

శీర్షిక చదువుతూనే వికాస్ "నేను ఉద యాన్నే చదివాను. మెయిన్ ఎడిషన్‌లో ఘనంగా ప్రచురించారు ఈ దుర్మార్గాన్ని" అన్నాడు వికాస్ కసిగా.

"అసలు వార్తేమిటి? " అడిగాడు వివేకా నంద.

"హైదరాబాద్ శివారులో బొల్లారం ప్రాంతంలో ఓ స్కూలుంది. దాని ప్రిన్సి పాల్ కొన్ని విలువలకు కట్టుబడి ఆ బడిని నడుపుతున్నాడు. పాతికమంది హెచ్ఐవీ పాజిటివ్ చిన్నారులకు పెద్ద మనసుతో అందులో స్థానం కల్పించారు. ఇప్పుడా పిల్లల్ని బయటికి పంపేయకపోతే, తమ పిల్లల్ని కూడా స్కూలు మాన్పిస్తా మని పేరెంట్స్ అల్టిమేటం జారీ చేశారు. విధిలేని పరిస్థితిలో ప్రిన్సిపాల్ ఆ పిల్లలకు టీసీలిచ్చి పంపించేశారు" సారాంశాన్ని వివ రించాడు వికాస్.

"పాతిక జీవితాలు. పసితనం ఛాయలు వీడని పుష్పాలు. ఉన్నపళాన బజార్న విసి రేస్తే.. ఎక్కడికెళ్లాలి? నాలుగు అక్షరమ్ము క్కల కోసం ఎవర్ని దేబిరించాలి? ఆ పేరెంట్స్ అంతా విద్యావంతులే. కంప్యూ టర్ యుగంలో కొలువులు చేస్తున్న సిటీ మనుషులే. వాళ్లే అర్థం చేసుకోనప్పుడు ఈ పల్లెటూరి జనం అమాంతం చైతన్యవంతు లవుతారని మనం ఆశించడం అత్యాశే అవు తుంది. అందుకే ప్రత్యూషను పంపేద్దా మని నిర్ణయించుకున్నాను" బాధగా చెప్పింది అపూర్వ.

## కొత్తగాలి...

**కొడుకు**
**నాడు పున్నామనరకం**
**తప్పించేవాడు**
**నేడు ప్రత్యక్షనరకం**
**చూపించేవాడు**

– బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్

"పోన్లెండి, అంతకన్నా మీరు మాత్రం ఏం చేయగలరు? " వివేకానంద ఆమెను సముదాయించాడు.

"చేయగలం వివేకానందగారు. అయితే నేను మాత్రమే కాదు. మీరు కూడా కల వాలి. మీసాయం కావాలి. ఆలోచన నాది. ఆచరణ మీది" మరో కొత్త అంకానికి అపూర్వ నాంది పలకబోతోందని గ్రహించాడు వికాస్.

"చెప్పండి మేడమ్. అది నలుగురికీ పని కొచ్చేదైతే, ఆ కర్తవ్యం నిర్వహించడానికి నేను నడుం కడతాను" అతని మాటల్లో నిజాయతీ కనిపించింది అపూర్వకు.

"ఎయిడ్స్ కంట్రోల్ సొసైటితో మీకు పరిచయం ఉంది కదా? "

"ఉంది మేడమ్"

"నేనో ప్రపోజల్ తయారుచేసి మీకి స్తాను. అది చాలా ఖర్చుతో కూడిన పని. మీరు నేను చేయగలిగేది కాదు. ప్రభుత్వం కాస్త చేయూతనందిస్తే ఆ ప్రాజెక్టు ఈ సమాజానికి ఒక కాగడాలా ఉపయోగపడుతుంది"

"ఇంతకీ ఆ ప్రపోజల్ ఏమిటి? " వికాస్ ప్రశ్నించాడు.

"హెచ్ఐవీ పాజిటివ్ చిన్నారుల కోసం ఓ రెసిడెన్షియల్ స్కూల్!"

"అంటే"

"ఆ స్కూల్లో అంతా వాళ్లే ఉంటారు. ఏవరి చీత్కారాలూ ఉండవు. ఒకరికొకరు అండగా, ఉన్నంతకాలం ఆనందంగా అక్ష రాలతో ఆడుకుంటారు. ఆ హాస్టల్లో వాళ్ల కోసం స్పెషల్‌గా న్యూట్రిషన్ ఫుడ్ తయా రవుతుంది. ఒక వైద్యశాల, ప్రత్యేకంగా వైద్యుడు ఉంటారు. వాళ్లకు అవసరమయ్యే మందులు నిత్యం అందుబాటులో ఉంటాయి. వాళ్ల జీవితకాలాన్ని పెంచేం దుకు అవసరమయ్యే వైద్యం తాలూకు ప్రయోగాలు కూడా అక్కడే జరుగుతాయి. ఒకనాటికి ఆ వ్యాధికి అరికట్టగల మందు కూడా అక్కడే రూపు దిద్దుకోవాలి" ఒక యజ్ఞం నిర్వహణకు కసరత్తులా ఆమె చెబుతుంటే, ఇద్దరూ విభ్రమంగా విన్నారు.

"ఎక్సెలెంట్ ఐడియా మేడమ్. ఈ ఆలో చనకు ప్రభుత్వం కచ్చితంగా సహకరి స్తుంది. కొన్ని ఫారిన్ సంస్థలు కూడా ఎయిడ్స్ నివారణకు కోట్లు ఖర్చు పెడుతు న్నాయి. వాటికి కూడా మన ప్రాజెక్ట్ ప్రపోజల్ పంపుదాం. తూళ్ళూరు మండలం రాయపూడి దగ్గర్లో రెండున్నర ఎకరాల ప్రభుత్వ భూమి ఉంది. ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించడానికి మౌలికవ సతుల బాధ్యత నాది, స్కూలు నిర్వహణ బాధ్యత మీది" ఒక స్వప్నం హఠాత్తుగా వాస్తవం అయినంత ఉద్వేగంగా చెప్పాడు వివేకానంద.

"వండర్‌ఫుల్ అయిడియా వివేక్" అభి నందించాడు వికాస్.

"థాంక్యూ, థాంక్యూ వెరీమచ్ వివేకా నంద గారూ" మనసు తేలికపడినట్లు గుండెల్నిండా గాలి పీల్చుకుంది అపూర్వ.

"అన్నట్లు, మీకు అభ్యంతరం లేకపోతే, ప్రత్యూష విషయంలో నేనో సలహా చెబుతా" అన్నాడు వివేకానంద.

"ప్లీజ్" అర్థించింది అపూర్వ.

**కొత్తగాలి...**

**మంచివాళ్లది మైనారిటీ**
**చెడ్డవాళ్లది మెజారిటీ**
**రాజ్యమేలేది మెజారిటీ**

– కాళిదాసు,
లక్ష్మీనగర్, కరీంనగర్

## బీహారీ నవల నేను - అతను

ముద్దులొలికే ఇద్దరు పిల్లలు, ప్రేమమూర్తి అయిన భర్తతో పూలపడవలా
సాగుతున్న ముక్త వైవాహిక జీవితం అనుకోని మలుపులు తిరిగింది.
ఎదురింట్లో అద్దెకు దిగిన బ్యాంక్ ఆఫీసర్ శామ్యూల్‌తో మొదలైన
పరిచయం ఆమె కుటుంబాన్ని అతలాకుతలం చేసింది.
ముఖ్యంగా ముక్త జీవితమే తన చేజారిపోయే పరిస్థితి తలెత్తింది.
ఇంతకీ ముక్తకు ఎదురైన అనుభవాలు ఎలాంటివి?
స్త్రీ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపై ఆలోచనలు రేకెత్తించే
ఆశా ప్రభాత్ బీహారీ నవలకు
కర్నాటి నాగభూషణం
తెలుగు అనువాదం
నేను - అతను



డిసెంబరు చతురలో మీకోసం


"ఆ పాపను నాకప్పగించండి. నాకు తెలిసిన ఓ పెద్దాయన విజయవాడలో ఓ హోమ్ నడుపుతున్నాడు. అక్కడ ఇలాంటి చిన్నారులు కొంతమంది ఉన్నారు. ఇరవై ఏళ్లుగా ఓ క్రిష్టియన్ ఆర్గనైజేషన్‌లో పని చేసిన అనుభవం ఆయన్ని మహర్షిలా మార్చేసింది. పిల్లల్ని కంటిరెప్పల్లా చూసుకుంటాడు"

"చాలా మంచి ఆలోచన అపూర్వా. ఇంకేమీ ఆలోచించవద్దు" అన్నాడు వికాస్.

ఓ నిమిషంపాటు ఆలోచించి "సరే" అంది అపూర్వ.

ఆ రాత్రి..

తన ఆలోచన గురించి, ప్రాజెక్ట్ గురించి రాజారావు దగ్గర ప్రస్తావించింది అపూర్వ.

"ఎందుకు డియర్, లేనిపోని తలనొప్పులు కొనితెచ్చుకుంటావు? మన చుట్టూ ఎంతోమంది అనాథలు, వ్యాధిగ్రస్థులు, వికలాంగులు, వృద్ధులు ఉంటారు. వాళ్లందరినీ మనం ఆదుకోవాలని ఆరాటపడటం అవివేకం" సలహా ఇచ్చాడు రాజారావు.

అపూర్వ ప్రతిస్పందించలేదు.

మరోపక్కకు తిరిగి పడుకుంది. కళ్లు మూసుకుంది.

ఎదురుగా.. పెద్ద మైదానం.. పచ్చని చెట్లు.. అందమైన భవనాలు..

ఛెంగుఛెంగున గెంతుతున్న లేగ దూడల్లా చిన్నారులు..

ఏ ఒక్కరి మొహంలోనూ ఆందోళన ఛాయల్లేవు..

ఏ ఒక్కరి మనసులోనూ మృత్యువు తాలూకు భయం లేదు..

★ ★ ★

అన్నీ చెబుతున్న అపూర్వ అసలు

విషయం చెప్పడానికేదో సందేహిస్తున్న ట్లుందని గ్రహించింది కళమ్మ. బహుశా కొడుకు గురించి చెడుగా చెబితే తను నమ్మదేమోనని సంశయం కాబోలు అను కుంది.

ఇక లాభం లేదు.. సూటిగా తనే అడి గేయాలన్న నిశ్చయానికి వచ్చింది.

"అపూర్వా.."

"చెప్పండత్తయ్యా"

"మరి.. మరి మా రాజాగాడు ఆ రంజి తకు ఎట్లా అలవాటు పడ్డాడు? "

బెడ్‌పక్కనే బాంబు పేలినట్లు ఉలిక్కిప డింది అపూర్వ. నిజంగానే అత్తయ్య ఆ ప్రశ్న వేసిందా? కొంపదీసి తన మనసు లోని ప్రతిధ్వని కాదుగదా!

"చెప్పమ్మా" రెట్టించింది కళమ్మ.

"అత్తయ్యా.. ఈ విషయం మీకు.. మీకెలా తెలిసింది? " అపూర్వ కంఠం వణుకుతోంది.

...ఆమె మనసు క్షణంలో వెనక్కి పరు గులు తీసింది.

'ఆ రోజు'.. వికాస్‌తో మాట్లాడి వరం డాలో నిద్రపోయాక.. ఆమె అర్ధరాత్రి దాటాక లేచింది.

మెల్లగా అడుగులో అడుగేస్తూ అపూర్వ ఉన్న గది వద్దకు చేరుకుంది. కిటికీ పైరెక్క తెరచి ఉంది. అందులోంచి లోప లికి తొంగి చూసింది.

అపూర్వ మత్తుగా పడుకొని ఉంది. కింద చాప మీద రంజిత గోడకు ఆనుకుని కూచొని ఉంది. ఆమె ఒళ్లో రాజారావు తలపెట్టి పడుకుని ఉన్నాడు.

ఇద్దరూ గుసగుసగా మాట్లాడుకుంటు న్నారు.

చెవులు రిక్కించినా మాటలు వినిపించ లేదు.

కళ్లు పెద్దవి చేసి చూసింది.

ఆమె రాజారావును ఓదారుస్తోంది. ధైర్యం చెబుతోంది. ముద్దులు పెడు తోంది.

ఇక చూడలేక దిగ్గున వెనుదిరిగి వచ్చి పడుకుంది.

అంతకుముందే తను వికాస్‌ను సైతం అనుమానించిన విషయం కూడా గుర్తుకొ చ్చిందామెకు.

ఓ రోజు తాను అపూర్వను పెళ్లి చేసు కోవాలనుకుంటున్నాననీ, ఎలాగైనా మాధ వయ్య గారిని ఒప్పించి పెళ్లి చేసుకుంటా ననీ తనతోనే చెప్పివెళ్లాడు వికాస్.

ఒకవేళ అపూర్వ దక్కలేదన్న అక్కసుతో అతనలా చేసి ఉంటాడేమోనని ఆ క్షణంలో తాను అనుమానించటంలో తప్పు లేదనుకుంది.

...మళ్లీ అడగటంతో ఇక అసలు విసయం చెప్పక తప్పలేదు అపూర్వకు.

★ ★ ★

అపూర్వకు ఆరోనెల వచ్చింది.

రాజారావు తరచూ ఎటో వెళ్తున్నాడు.

ఇంటి పనుల్లో రంజిత బాగా సాయప డుతోంది.

ఒక్కోసారి రాత్రిపూట తనతోపాటే కాన్వెంటులోనే పడుకుంటోంది.

ఆ రోజు..

సాయంత్రం కాన్వెంటు వదిలాక అపూర్వ రంజితను వెంట తీసుకుని ఆస్ప త్రికి వెళ్లొచ్చింది. రాత్రి తిరిగి వచ్చేసరికే తొమ్మిది దాటింది. రాజారావు అన్నం, కూర వండి ఉంచాడు. ముగ్గురూ తిన్నారు.

ఆ సమయంలో పంపించటం బాగోదని రంజితను అక్కడే పడుకోమంది అపూర్వ.

రాత్రి పదకొండు గంటల వేళ అపూ ర్వకు మెలకువ వచ్చింది. పక్కన రాజా రావు లేదు. యథాలాపంగా కిందకి చూసింది. చాప మీద రంజితా లేదు.

అపూర్వకు గుండెల్లో రాయి పడింది.

మనసేదో కీడు శంకిస్తుండగా లేచి బయటికొచ్చింది.

పండువెన్నెల కాస్తోంది. విశాలమైన మైదానం తెల్లగా మెరిసిపోతోంది. కీచు రాళ్ల రొద తప్ప ఏ శబ్దమూ లేదు. ఎక్కడా మనిషి జాడ కనిపించ లేదు.

చివరి ప్రయత్నంగా ఆఫీసురూం వైపు వచ్చింది. సన్నగా మాటలు విన్పిస్తు న్నాయి. చప్పుడు చేయకుండా దగ్గరగా వచ్చిందామె.

ఇవతల పక్క క్లాస్‌రూములో నిలబడి తడికె సందుల్లోంచి ఆఫీసు రూములోకి చూసింది.

లోపల రెండు శరీరాలు ఏ అచ్ఛాదనా లేకుండా పరదా పట్ట మీద దొర్లుతు న్నాయి. ఈ లోకంతో సంబంధం లేన ట్టుగా మైకంలో మునిగిపోయారు.

అపూర్వ ఒంటిపైన లక్ష తేళ్లు, కోటి జెర్రులు ప్రత్యక్షమయ్యాయి. గుండెల్ని ఎవరో పిండేస్తున్నట్లుగా కూలబడింది.

ఏమిటి కర్తవ్యం?

అరిచి, గోల పెట్టడమా? మౌనం వహించటమా?

అంతటి ఉద్విగ్న స్థితిలోనూ విచక్షణ కోల్పోలేదామె.

తను ఆవేశంగా వెళ్లి, వాళ్ల బండారం బట్టబయలు చేయడం వల్ల దుష్ఫలితాలే ఎక్కువని విశ్లేషించుకుంది. అతి కష్టం మీద తనను తాను నిగ్రహించుకుని నిశ్శ బ్దంగా వెనక్కి వెళ్లిపోయింది.

మంచం మీద పడుకున్నా ముళ్లమీదే ఉన్నట్లుంది. మెదడులో సునామీ ఎగిసిప డుతోంది.

ఏం చేయాలి? వికాస్‌కు చెబితే?

వద్దు. తన ఫ్రెండుపై అతనికున్న గౌరవం పోతుంది?

భారంగా తెల్లవారింది.

మరుసటి రోజు నుంచీ మాటల ద్వారా, చేతల ద్వారా నిరసన తెలిపింది. నవ్వు తూనే అంటించటం మొదలుపెట్టింది.

"మీరీ మధ్య బయట తిరగటం ఎక్కు వైందండీ. బయటి సుఖానికి అలవాటు పడితే అసలుకే మోసం వస్తుంది" అంటూ పరోక్షంగా హెచ్చరికలు పంపింది.

తమ బండారాన్ని అపూర్వ పసిగట్టడం వల్లే అలాంటి హెచ్చరికలు జారీచేస్తోం దన్న విషయం రాజారావుకు కూడా అర్థ మైనా.. అర్థం కానట్టే ఊరుకున్నాడు.

అపూర్వకు తొమ్మిదో నెల వచ్చింది.

ఓ రోజు సాయంత్రం పూట గ్రౌండ్‌లో వాకింగ్ చేస్తోంది.

ఆమె మనసేమీ బాగోలేదు. రోజురో జుకూ దిగులు, బరువు ఎక్కువవుతోంది. అంతర్మథనం ఆమె హృదయాన్ని పీల్చి పిప్పి చేస్తోంది.

ఏదో అనుమానమొచ్చి, నడుస్తున్నదల్లా ఠక్కున ఆగిపోయింది.

గ్రౌండుకు ఆ చివర కొన్ని పూల మొక్కలు, పిచ్చిచెట్లు ఉన్నాయి. అక్కడేదో కదిలినట్లయి అటుగా వెళ్లింది.

చెట్లచాటున సాయంత్రం ఏడు గంట లకే రాజారావు-రంజిత బరితెగించారు.

ఆ దృశ్యం చూడగానే భళ్లున వాంతి అయినంత పని అయిందామెకు.

ఒళ్లు మండుకొచ్చింది.

## కొత్తగాలి...

**కుంభకోణాల**
**విచారణ**
**కుంభకర్ణుడి నిద్ర**

- ఇంద్రగంటి నరసింహమూర్తి,
కాకినాడ

కోపంతో నిలువెల్లా కంపించిపోయింది.

పక్కనే పడి వున్న పిచ్చి కట్టెను చేతు ల్లోకి తీసుకుంది. తాను నెలలు నిండిన గర్భిణీ అన్న సంగతే మర్చిపోయింది.

పూనకం వచ్చినట్లుగా ఊగిపోతూ ఒక్క ఉదుటున వెళ్లి ఇద్దరినీ గొడ్డును బాదినట్లు బాదింది.

రాజారావు లేచి కళ్లెర్ర జేశాడు.

ఆమె లెక్క చేయకుండా మళ్లీ కర్రకు పని చెప్పింది.

ఒడుపుగా ఆమె చేతుల్లోంచి దాన్ని లాక్కొని పక్కకు విసిరేశాడు రాజారావు.

తమకేమీ తెలియనట్టుగా, అదేమీ తప్పు కాదన్నట్టుగా వెళ్లిపోయారిద్దరూ.

అపూర్వ తన భర్త వ్యక్తిత్వంపై నిర్మిం చుకున్న వేల అంతస్తుల భవనం పేకమే డలా కూలి పోయింది.

★ ★ ★

ఏమీ జరగనట్టే వ్యవహరిస్తున్నాడు రాజారావు. రంజిత కూడా అమాయకు రాల్లా ధీమాగా కాన్వెంటుకు వస్తోంది, వెళుతోంది. అయితే ఇంట్లోకి మాత్రం రావటం లేదు. కాన్వెంటు బాధ్యతలన్నీ రాజారావే చూసుకుంటూ, తనను రెస్టు తీసుకోమన్నా.. ప్రశాంతంగా ఉండలేకపో తోంది అపూర్వ. నిండుకుండలా ఉండా ల్సిన నిండు గర్భిణీ ప్రేమంతా ఖాళీ అయిన గుండెతో ఎండుకుపోతోంది.

'ఈ మధ్య మీరదోలా కనిపిస్తున్నారు. మొహమంతా చూడండి ఎలా పీక్కుపో తోందో! ఇంటిమీద గానీ దిగులేసుకోలేదు గదా? " అడిగాడు వికాస్ ఓ రోజు.

"అబ్బే. అదేంలేదు" అంది ముక్తసరిగా.

"చెప్పండి. మావాడేమన్నా అంటు న్నాడా? తాట తీస్తా" అన్నాడు వికాస్ నవ్వుతూ.

అవుననీ, కాదనీ కాకుండా మధ్యస్థంగా తలూపిందే తప్ప సమాధానం చెప్పలేదు.

నిజానికి ఇటీవల రాజారావు తరచూ బయట తిరగటం.. ఏదో ఒక మిషతో రంజిత కూడా కాన్వెంటు ఎగ్గొట్టి అతనితో వెళ్లటం.. ఇద్దరూ కలిసి సినిమాలు చూడటం, షికార్లు చేయటం.. ఓ పెద్ద మనిషి ద్వారా ఆమె దృష్టికొచ్చింది. కొన్ని రాత్రులు అతనింటికి రాకపోవటానిక్కూడా రంజితే కారణమని తెలుసుకుంది.

తీవ్రంగా మథన పడింది.

అలాంటి సమయంలోనే వికాస్ తన దిగులు గురించి అడగటంతో ఒక దశలో చెప్పేద్దామన్న ఉద్వేగానికి గురైంది. మళ్లీ నిగ్రహించుకుంది.

అపూర్వ బాబుకు జన్మనిచ్చింది.

ప్రసవించే సమయంలో రాజారావు పక్కనే ఉండటం ఊరటనిచ్చింది. ఆ రోజంతా భార్యనే అంటిపెట్టుకుని ఉన్నాడు. బాబును పదేపదే చూసు కుంటూ మురిసిపోయాడు. అపూర్వకు మరీమరీ కృతజ్ఞతలు చెప్పాడు.

పోన్లే. కొడుకు పుట్టుకతోనైనా మారితే బాగుండుననుకుంది. రాజారావు ఇంటిప ట్టునే ఉండి, వంటావార్పూ చేయటం.. తన అవసరాలను కనిపెట్టుకు చూడటం అపూర్వ నమ్మకాన్ని బలపరిచాయి.

మూడు నెలలు గడిచే సరికే ఆమె ఆశలు దూదిపింజల్లా గాలికి కొట్టుకుపో యాయి. రాజారావు-రంజితల సంబంధం అంత తేలిగ్గా తెగేది కాదని తేలిపోయింది.

ఓ రోజు కాన్వెంటు టీచర్లందరితో కలిసి పిక్నిక్ ప్లాన్ చేశాడు రాజారావు. తను రానన్నా బతిమాలి తీసుకెళ్లాడు అపూ ర్వను. వికాస్‌ను కూడా ఆహ్వానించారు.

టాటాసుమోలో వాళ్లంతా అక్కడికి పది హేను కిలోమీటర్ల దూరంలోని తోటకెళ్లారు. టీచర్లలో రంజిత కూడా ఉంది.

ఇరవై ఎకరాల్లో మామిడి, సపోటా,

జామ చెట్లతో తోట ఆహ్లాదంగా ఉంది. అందరూ స్థాయీభేదాలు విస్మరించి, ఆనందంగా విహరించారు. రకరకాల ఆటలాడారు. అంత్యాక్షరి పోటీలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

వికాస్ పెద్ద ఆకర్షణైపోయాడు. అతను రకరకాల సాంస్కృతిక విన్యాసాలతో అందరినీ ఆకట్టుకున్నాడు.

రాజారావు అపూర్వను, పిల్లల్నే అంటిపెట్టుకుని ఉన్నాడు. ఆటపాటల్లో ఎక్కడా రంజిత జోలికి వెళ్లకపోవటం గమనించింది అపూర్వ. కొద్దిగా ఊపిరి పీల్చుకుంది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక తోటలోనే ఓ మూలన ఉన్న గెస్ట్‌హౌస్‌కు చేరుకున్నారు. అదంతా ఓ ఎమ్మెల్యే ఆస్తి. ఆ తోటకు, గెస్ట్‌హౌస్‌కు సూపర్‌వైజర్‌గా ఉన్న వ్యక్తి రాజారావుకు మంచి ఫ్రెండు కావటంతో ముందుగానే నాలుగు రూములు బుక్ చేశాడు. టీచర్లందరికీ కలిపి రెండు రూములు, వికాస్‌కు ఒక సింగిల్ రూము, రాజారావు ఫ్యామిలీకి మరొకటి.

రెండు గంటలు రెస్ట్ తీసుకుని, సాయంత్రం తిరుగు ప్రయాణమవ్వాలని ప్లాన్ చేసుకున్నారు.

రాజారావు, అపూర్వ నడుం వాల్చారు. నాలుగు నెలల బాబు అపూర్వ పొత్తిళ్లలో ఒదిగిపోయాడు. పాపను టీచర్లే ఉంచుకున్నారు. అపూర్వకు నిద్ర పట్టేసింది.

నాలుగు గంటలకు తలుపు చప్పుడైతే లేచింది. పక్కన రాజారావు లేడు. వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా వికాస్!

"వీడేడి? " అడిగాడు వికాస్ రాజారావు గురించి.

తెలియదన్నట్టుగా చూసింది.

"ఎటు వెళ్లాడు? అందరికీ కూల్‌డ్రింక్స్ తెస్తే బావుంటుంది" అంటూనే రాజారావును వెతికేందుకు కారిడార్‌లో ఎడమ




విపుల
విశ్వకథా వేదిక

పెద్దలు చదవాల్సిన పిల్లల కథల
ప్రత్యేక సంచిక మీ ముందుంది

పెద్దలు, పిల్లల నడుమ ఉండాల్సిన
బంధాలకు అనుబంధాలకు కొత్త అర్థాల్ని
ఆవిష్కరిస్తూ మీ ముందుకు వచ్చింది
విపుల ప్రత్యేక సంచిక!
తెలుగులో ఐదు,
ప్రపంచ భాషల్లో ఐదు
భారతీయ భాషల్లో ఎనిమిది
వెరసి పద్దెనిమిది కథలవిందు!
కథకుల ఫైల్‌లో
కీ.శే. పాలగుమ్మి పద్మరాజు
తెలుగు కథ పడవ ప్రయాణం
ప్రత్యేకం..

ఆకాశవాణి విజయవాడ స్టేషన్ డైరెక్టర్ మంగళగిరి ఆదిత్యప్రసాద్ పరామర్శ

వైపుకు వెళ్లాడు.

అపూర్వ గుండె గుబగుబలాడింది.

ఏదో అనుమానం పొటమరించి, వణికి పోయింది.

ఆమె కుడివైపుకు దృష్టి సారించింది.

ఆ చివర్న 'ఆఫీస్ రూమ్' అని రాసి ఉంది. గబగబా అటువైపు నడిచింది. తలుపులకు లోపల్నుంచి గడియ పెట్టుంది. ఆమె అనుమానం మరింత బలపడింది.

గది చుట్టూ చూసింది. వెనక వైపు కిటికీ తెరిచి ఉంది. శబ్దం కాకుండా అటు నడిచి, కిటికీలోంచి తొంగి చూసింది.

హైవోల్టేజీ విద్యుత్తు లైను అమాంతం తెగి, మీద పడినట్లుగా 'షాక్'! లోపలి దృశ్యాన్ని చూసి అసహ్యంతో కంపించిపోయింది. దిగ్గున వెనక్కి తిరిగింది.

కళ్లవెంట నీటిధార ప్రవాహంలా కిందికి జారింది.

ఆమె కన్నీటి తెరను మసకమసకగా చీలుస్తూ అటువైపే వస్తూ కనిపించాడు వికాస్.

అతనుగానీ ఈ పరిస్థితిలో రాజారావునీ, రంజితనూ చూశాడంటే?

ఆమె ఆలోచించలేకపోయింది. తన సిబ్బంది మొత్తానికీ తెలిసిపోయి, పరువు గంగలో కలిసిపోతుందని భావించింది.

గబగబా కన్నీరు తుడుచుకుంది.

వెనక్కి తిరక్కుండానే కిటికీ మూసింది.

వికాస్ దగ్గరగా వచ్చి "ఎక్కడండీ.. వీడెక్కడా కనిపించి చావడేం? " అన్నాడు.

"ఎటో వెళ్లుంటాడు. వస్తాడులే. రండి మనం వెళ్దాం"

అపూర్వ, వికాస్‌లు అక్కడి నుంచి వెళ్లిపోయారు.

★ ★ ★

మరో మూడు రోజుల తర్వాత-

అసోసియేషన్ పనుందంటూ గుంటూరు వెళ్లాడు రాజారావు.

రాత్రిపూట బయటి గేటుపై రాళ్లు విసురుతున్నట్లు.. ఎవరో కాంపౌండ్‌లో తిరుగుతున్నట్లు.. తనకు భయంగా ఉంటోందని, సాయంత్రం పెందలాడే ఇంటికి చేరుకోమనీ అభ్యర్థించింది అపూర్వ.

'ఏముండదు. అంతా నీ భ్రమ. ఒకవేళ నేను రాత్రికి రాలేకపోతే నీకు తోడుగా పడుకోటానికి వికాస్‌ను పంపిస్తాలే' అంటూ వెళ్లిపోయాడు రాజారావు.

అతనిలో తనపట్ల నిర్లక్ష్యం ఎక్కువైనట్లు స్పష్టంగా తెలుస్తోంది అపూర్వకు. అంతే కాదు.. 'రహస్యమేదో నీకూ తెలిసిపోయిందిగా, ఇక భయపడేదేముంది? ' అన్నట్లు తయారైంది అతని వ్యవహారం.

తాను అరిచి గీపెట్టడం తప్ప ఫలితం కనిపించ లేదు. భర్తను మార్చుకోవాలని చేయని ప్రయత్నమంటూ లేదు. అతనికి తనేం తక్కువ చేసిందో అర్థం కాలేదు.

మరి తమ ప్రేమ సౌధానికి ఈ బీటలు ఎలా ఏర్పడ్డాయి?

నిరంతరం ఆలోచనల మంటల్లో కాలిపోయేది అపూర్వ!

★ ★ ★

"ఆ రోజు రాత్రి పది గంటలప్పుడు వికాస్ వచ్చాడు. అప్పటిదాకా ఆయనింకా వస్తాడు.. ఇంకా వస్తాడని ఎదురు చూశాను. ఇంతలో వికాస్‌గారొచ్చి ఆయనీ రాత్రికి రాడని చెప్పారు" అసలెలా తాను అగ్నికీలల్లో చిక్కుకుందో చెప్పటం ప్రారంభించింది అపూర్వ.

జాగ్రత్తగా వింటోంది కళమ్మ.

"అప్పుడు గుర్తొచ్చింది నాకు.. తనకేదో అర్జెంటు పనుందని రంజిత కూడా మధ్యాహ్నం సెలవు పెట్టి వెళ్లిన విషయం. డౌటే లేదత్తయ్యా.. ఆ రాత్రి గుంటూరులో రంజితతో సరదాగా గడపటానికే ఈయన ఉండిపోయాడు. రాత్రిపూట పడుకున్నా

# మనసున ఉన్నదీ...

★ అందాలనటి తాప్సీ ముఖచిత్రంతో అక్టోబరు 'చతుర' ఆకట్టుకుంది. డా. మంథా భానుమతిగారి 'మాయపండు' నవల పేరులోనే మాయ ఉంది. ప్రత్యేకమైన టైటిల్‌తో ఈ నవల ఆద్యంతం చదివిస్తూ, ప్రేమవిలువల్ని తెలుపుతూ పాఠకులకు విందు భోజనం పెట్టినట్లుంది. కాప్షన్‌మీదే, జ్ఞానపీఠాలు, చతురంగం, చతురప్రపంచం, కొత్తగాలి.. శీర్షికలన్నీ అబ్బురపరిచేవే!

– *ఈ. వేమన, శ్రీకాకుళం*

★ ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగిన 'మాయపండు' నవల మమ్మల్నెంతో ఆకట్టుకుంది. మంథా భానుమతిగారి శైలి బాగుంది. నవల చివర వరకూ ఆసక్తిగా చదివించింది. 'చతుర ప్రపంచం'లో కొత్త విషయాలు అనేకం తెలుసుకుంటున్నాం. శ్రీధర్ కాప్షన్‌మీదే బొమ్మతోపాటూ కాప్షన్లూ చాలా తమాషాగా ఉంటున్నాయి.

– *భాగ్యలక్ష్మి, పొన్నూర్*

★ అక్టోబర్ 'చతుర'లోని 'మాయపండు' నవలలో పళ్లను, చెట్లనూ కథకు అన్వయించిన తీరులో తగినంత పుష్టి చేకూర్చలేకపోయారేమో అనిపించింది. కాయలను అతి త్వరగా ప్రకృతి నిమిత్తం లేకుండా పళ్లుగా తయారుచేసే జీవ రసాయన ప్రక్రియను విపులీకరించారు. కుటుంబాల నేపథ్యంలో సాగిన కథకు కొన్ని సంఘటనలు అతికించినట్టుగా ఉన్నాయి. సాంఘిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని చేసే రచనలు, సాహిత్య ప్రయోజనాలనూ అత్యున్నతంగా నెరవేర్స్తాయనేది నా అభిప్రాయం.

– *ఎన్. నాగేశ్వరరావు, బేగంపేట*

★ సీనియర్ రచయిత్రి మంథా భానుమతి నవల పాఠకుల మనస్సులోకి చొచ్చుకుని పోయి ఆలోచింపజేసింది. ఈ రోజుల్లో అమృత హృదయాలు, మనస్సులుగల వ్యక్తులు చాలా అరుదు. అలా అరుదైన వ్యక్తుల్లో సురేశ్ శాంత, సునీత శ్రీనాథ్, బాలయ్య రేణుక, సుజాత వినోద్, అనంత్ బిందూ.. వీరందరివీ మంచి మనస్సులే. అందుకే వీరందరూ కష్టసుఖాల్లో ఒకరికొకరు అండగా నిలుస్తూ, జీవితాన్ని సుఖమయం చేసుకున్నారు. రాణి హేమాంబరీదేవి మొదట్లో కాఠిన్యం, కరుకుదనం ప్రదర్శించినా చివర్లో తన తప్పు తెలుసుకుని అందరితో కలిసిపోవడం ఆనందింపజేసింది. ప్రతి పాత్రనూ ఎంతో విశ్లేషణాత్మకంగా చిత్రించడం రచయిత్రి ప్రత్యేకత.

– *మధుసూదన్, హనుమకొండ*

★ గురజాడ చతురోక్తులు మమ్మల్ని చాలా అలరించాయి. అయితే ఈసారి టాంక్ బండ్ కథ లేకపోవడంతో చంద్రోదయం కానట్లు అనిపించింది.

– *యలమంచి ఆశాలత, న్యూజెర్సీ*

★ మంథా భానుమతి నవల 'మాయపండు' ఎంతో ఉత్కంఠగా చదివించింది. నేడు కనుమరుగైన ప్రేమాప్యాయతలను, మానవీయ సంబంధాలను ఇందులో చదివి ఆనందించాం. 'హాహా.. అమెరికా' ద్వారా ఆ దేశం గురించి ఆసక్తికరమైన సమాచారం తెలుసుకుంటున్నాం. 'జ్ఞానపీఠాలు' శీర్షిక ద్వారా గొప్ప సాహితీమూర్తుల గురించి తెలియజేస్తున్నందుకు అభినందనలు.

– *మీనాక్షి, బెంగళూరు*

★ 'కొత్తగాలి' కవితలు సమకాలీన అంశాలపై మనసుకు హత్తుకునేలా ఉంటున్నాయి. 'జ్ఞానపీఠాలు' ఎందరెందరో కవులు, రచయితలను పరిచయం చేస్తూ విజ్ఞానదాయకంగా ఉంటోంది. 'హాహా.. అమెరికా' ఆసక్తికరంగా సాగుతోంది.

–*మణికుమార్, తుకారాంగేట్*

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ :
vipula.chatura@gmail.com

నిద్ర పట్టలేదు. పదేపదే వాళ్లిద్దరూ కళ్లల్లో మెదిలారు. తెల్లవారు జామున ఎప్పుడో కన్నంటింది. ఆయన నన్ను చంపేస్తున్నట్టు.. నేను గిలగిలా తన్నుకుంటున్నట్లు.. ఏవేవో పీడకలలు వచ్చాయి. తెల్లవారుతుండగానే ఈయన వచ్చాడు. వికాస్ వెళ్లిపోయాక ఇద్దరి మధ్యా పెద్ద గొడవ జరిగింది. అంతా నా ఇష్టం అన్నట్లుగా మాట్లాడి, వెళ్లి బయట క్లాస్‌రూములో కూచున్నాడాయన. బాబుకు పాలు కాగబెట్టేందుకు స్టౌ వెలిగించాను. నా జీవితం మీద నాకే అసహ్యం వేసింది. నామీద నాకే ద్వేషం కలిగింది. ఏం చెయ్యాలో, ఎవరికి చెప్పుకోవాలో అర్థంకాని స్థితిలో కావాలనే చీరకు అంటించుకున్నాను..." అపూర్వ వెక్కివెక్కి ఏడుస్తోంది.

కళమ్మ మౌనంగా ఉండిపోయింది.

ఆమె కళ్లు ఎరుపెక్కాయి.

"తప్పు చేశావమ్మా అపూర్వా" అంది మెల్లగా, స్థిరమైన గొంతుతో.

"అత్తయ్యా.."

"అవునమ్మా! తప్పంతా నీదే" అంది కోపంగానే.

"అత్తయ్యా, మీరు కూడా నన్నే అంటున్నారా? " బాధగా అడిగింది అపూర్వ.

"అవునమ్మా. తప్పు నీదే. వాడు ఆ అమ్మాయితో కనిపించిన మొదటిరోజే గదిలో పడేసి బాదాల్సింది. రెండోసారి కనిపించినప్పుడు కనీసం వికాస్‌కైనా చెప్పాల్సింది. వాళ్ల స్నేహం ఎక్కడ చెడిపోతుందోనని భయపడి, బంగారంలాంటి నీ కాపురాన్ని చెడగొట్టుకున్నావ్. మూడోసారి కనిపించినప్పుడు పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదు చేయాల్సింది. గెస్ట్‌హౌస్‌లో నువ్వు మరోసారి వాడి దుర్మార్గాన్ని చూసిన రోజు రాత్రే.. అన్నంలో ఇంత విషం కలిపి పెట్టాల్సింది. ఇవేమీ చేయకపోవటం నీ తప్పు కాదా? " ఆవేశంగా అడిగిందామె.

"అంత తెగింపు చెయ్యలేకపోయానత్తయ్యా" బావురుమంది అపూర్వ.

"చెయ్యం. మనమలా తెగింపు చెయ్యం కాబట్టే మగాళ్లలా విర్రవీగుతారు. వాడిది చిన్నప్పట్నుంచీ వంకర బుద్ధేనమ్మా. నా కొడుకే అయినా ఈ విషయం సిగ్గు లేకుండా చెప్పుకోగలను. ఎంత మంచిగా కనబడతాడో అంత ఛండాలంగానూ ఉండగలడు వాడు" వాపోయింది కళమ్మ.

★ ★ ★

రెండు నెలల చికిత్స అనంతరం కొద్దిగా కోలుకుంది అపూర్వ. గాయాల పచ్చి మాత్రం ఇంకా అలాగే ఉంది.

డిశ్చార్జ్ చేసేరోజు వికాస్‌నీ, రాజారావునీ తన గదిలోకి పిలిచాడు డాక్టర్. ఇంటికి తీసుకెళ్లినా ఆమెను పేషెంటులాగే చూసుకోవాలని హెచ్చరించాడు. అనేక జాగ్రత్తలు చెప్పాడు.

"చికిత్స తర్వాత పేషెంటు ప్రవర్తనలో మీకు చాలా మార్పులు కనిపిస్తాయి. ఆమె అందవిహీనంగా తయారవుతుంది. శరీర ఆకృతిలో మార్పు వస్తుంది. ఆత్మన్యూనతా భావం పెరిగిపోతుంది. మానసికంగా కృశించిపోతుంది. డిప్రెషన్‌తో సతమతమయ్యే అవకాశముంది. సూసైడ్ టెండెన్సీ ఉంటుంది. కాలిన గాయాలు పుళ్లుగా మారి, మార్జోలిన్స్ అల్సర్స్‌గా తయారై క్యాన్సర్‌కు దారితీసే ప్రమాదం కూడా ఉంది. అందుకే ఆమెను మీరు జాగ్రత్తగా చూసుకోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే పసిపిల్లలా చూసుకోవాలి. నాలుగైదు నెలలపాటు మంచి సేవలందిస్తే ఆమె తిరిగి మామూలు మనిషి అవుతుంది. ఆ తర్వాత సర్జరీ ద్వారా బాడీ కూడా తీర్చిదిద్దుకోవచ్చు"

"డాక్టర్, తను ఎన్ని రోజులకు లేచి కూచోగలదు? " వికాస్ అడిగాడు.

"మరో నెల పడుతుంది. రెణ్నెల్లు

పోయాక నడక ప్రాక్టీస్ చెయ్యొచ్చు అంతా మనం తీసుకునే కేర్‌ను బట్టి ఉంటుంది" వివరించాడు డాక్టర్.

★ ★ ★

కారు కాన్వెంటు ముందు ఆగింది.

వికాస్, రాజారావులు అపూర్వను జాగ్రత్తగా చేతులమీదే కిందికి దించారు. ఆ వెనకే మనవరాలితోపాటు కళమ్మ దిగింది. యూనిఫాం ధరించిన కాన్వెంటు పిల్లలందరూ తాజాగా వికసించిన పువ్వుల్లా రెండు వరుసల్లో నిలబడ్డారు.

అపూర్వను రెండువైపులా పట్టుకొని నెమ్మదిగా ఒక్కో అడుగే వేయించుకుంటూ పిల్లల మధ్యగా తీసుకొస్తుండగా "గుడ్‌మార్నింగ్ టీచర్.. వెల్‌కమ్ టూ అవర్ అపూర్వ మేడమ్" అంటూ బాలబాలికలంతా ఒకేసారి కోరస్‌లా లయబద్ధంగా నినదించారు.

అపూర్వ ఒక్కక్షణం తన బాధనంతా మర్చిపోయింది. కళ్లు తడిదేరాయి.

గ్రౌండ్ మధ్యలో ఉంచిన కుర్చీలో కూచోబెట్టారు అపూర్వను. కుర్చీలో సర్దుకొని కూచొని పిల్లలవైపు దృష్టి సారించింది అపూర్వ. అన్ని వందలమందీ తన పిల్లలేనని స్ఫురించి.. వారి సాదర ఆహ్వానానికి పొంగిపోయింది.

## కొత్తగాలి...

**ప్రతిభకు శిలువ**
**వెధవకు విలువ**
**నేటి సమాజం చలువ**

– బి. విజయ,
మియాపూర్, హైదరాబాద్

మరోవైపు టీచర్లంతా నిలబడి ఉన్నారు. వారిలో రంజిత కూడా ఉంది. తలొంచుకుని నిలబడి ఉంది. ఆ క్షణంలో ఆ అమ్మాయి మీద కోపం రాలేదు అపూర్వకు. జాలి కలిగింది. అందరినీ పరిశీలనగా చూస్తూ రెండు చేతులూ జోడించి, నమస్కరించింది. వాళ్లంతా చలించిపోయారు.

కాన్వెంటుకు కొత్త కళ వచ్చినట్లయింది.

రాజారావు సైగ చేయగానే, ఇద్దరు పిల్లలు ముందుకొచ్చి, అపూర్వకు పుష్పగుచ్ఛాలు అందించారు.

మరో ఇద్దరు పిల్లలు పెద్ద బాక్సులు పట్టుకొచ్చి ఆమెకిచ్చారు.

వాటినిండా స్వీట్లున్నాయి. పిల్లలకు చెరొకటి అందించింది.

ఒక స్వీటు తన చేతుల్లోకి తీసుకుని అపూర్వకు తినిపించాడు రాజారావు. అపూర్వ మిగతా స్వీటును భర్త నోట్లో పెట్టింది. పిల్లలంతా ఆనందంగా చప్పట్లు కొట్టారు.

మరో స్వీటును వికాస్‌కు అందించింది.

అత్తయ్యగారికి నమస్కరించి, స్వీటు తినిపించింది.

విహిత బుగ్గమీద ముద్దు పెట్టుకొని మిఠాయి పెట్టింది.

ఆ తర్వాత పిల్లలంతా లైన్లో వచ్చి అపూర్వ నుంచి స్వీట్లు అందుకున్నారు. టీచర్లందరికీ పంచింది. తనవంతు వచ్చినపుడు నేలచూపులు చూస్తూ స్వీటు అందుకుంది రంజిత.

అంతా ఓ పండుగగా ముగిసింది.

ఆమెను ఇంట్లోకి తీసుకెళ్లారు.

అప్పటికే రాజారావు ఆమెకోసం ప్రత్యేక ఏర్పాట్లు చేశాడు. గదిని వెడల్పు చేసి, ఒకవైపు మంచం వేశాడు. దోమతెర కట్టాడు. కొత్త ఫ్యాను బిగించాడు. ఆమె చూసేందుకు వీలుగా టీవీని అమర్చాడు.

అపూర్వ హృదయంలో సన్నటి సంగీత

ధ్వని!

అట్టడుగు పొరల్లో అడుగంటిపోయిన ఆత్మీయతా జలపాతం మళ్లీ చుక్కచుక్కగా స్రవిస్తున్న అనుభూతి!

★ ★ ★

ఇంట్లో పనులకోసమే కాకుండా అపూర్వకు సాయంగా ఉండేందుకు ఓ ఆడ మనిషిని మాట్లాడాడు రాజారావు. తను కూడా అపూర్వ బాగోగులన్నీ దగ్గరుండి చూసుకుంటున్నాడు.

ఇంటి దగ్గర పొలం పనుల హడావుడి మొదలవటంతో ఇక అక్కడ ఉండటం కుదరదంటూ వెళ్లిపోయింది కళమ్మ. గేదె పాలకు అలవాటుపడటంతో మనవణ్ని తనవెంట తీసుకెళ్లింది. విహితను రాజా రావే చూసుకుంటున్నాడు.

పరిస్థితులు కొద్దిగా చక్కబడగానే రాజా రావు వ్యూహాత్మకంగా మళ్లీ తెరపైకి తీసు కొచ్చాడు రంజితను.

వంట చేయటం.. పిల్లను ఆడించటం, స్నానం చేయించటం వంటి పనుల్లో రంజిత రాజారావుకు సహకారం అందిం చటం మొదలుపెట్టింది.

మంచం మీదనుంచే ఇంతెత్తున లేచింది అపూర్వ.

"అది మళ్లీ నా కళ్లముందు కనిపించిం దంటే కత్తిపీటతో పీక తెగ్గోస్తా. అసలు దాన్ని కాన్వెంటుకే రానివ్వద్దు. తీసిపడె య్యండి" అంటూ మండిపడింది.

రాజారావు సావధానంగా, "ఎందుకు డియర్ అలా కోప్పడతావ్? తప్పు చేసింది నేను. పాపం ఆమెనెందుకు శిక్షిస్తావ్? ఇప్పుడు నా తప్పు తెలుసుకున్నాగా? అయినా ఇక్కడ మనకి మాత్రం సహకరిం చేవాళ్లు ఎవరు? ఇలా మనింట్లోనే ఉండి మనకోసం ఇంత టైమ్ ఎవరు కేటాయి స్తారు? " అంటూ సమర్ధించుకొచ్చాడు.

కంఠశోష తప్ప తన మాటను లక్ష్యపెట్ట డని నిర్ధరించుకుంది అపూర్వ. మంచం లోంచి లేవలేని తన నిస్సహాయ స్థితిని తెలివిగా తనకు అనుకూలంగా మార్చుకుం టున్నాడన్న విషయం గ్రహించింది.

అయితే తన గాయాలకు రాజారావు రోజూ డ్రస్సింగ్ చేసే సమయంలో రంజిత చూపుల్ని తట్టుకోకపోయేది. 'చూశావా.. నీ జీవితాన్నే తగలబెట్టాను. మీ ఆయన్ని నా పాదాల దగ్గర పడేసుకు న్నాను' అన్నట్లుగా ఉండేవామె చూపులు.

ఇరవైరోజులు గడిచాయి.

అపూర్వకు 'నిశ్శబ్ద హింస' మొదలైంది. రాజారావు పగలంతా కాన్వెంటులోనే ఉండేవాడు. అప్పుడప్పుడూ వచ్చి ఓ నిముషం పలకరించి, వెళ్లేవాడు. పొడిపొ డిగా మాట్లాడేవాడు.

తనకేమో అతను తన దగ్గరే కూచొని బోల్డన్ని కబుర్లు చెబితే బాగుండనిపి స్తుంది.

అలాగే పడుకుని ఉండటంతో వీపుమీద పుళ్లు పడ్డాయి. స్నానం చేయించే పనిమ నిషి మొక్కుబడిగా పని కానిచ్చేది. మెడి కల్ పౌడర్ వేసి, కాసేపు ఫ్యాను పెట్ట మని అపూర్వ బతిమాలినా తనకింకో ఇంట్లో పని ఉందంటూ వెళ్లిపోయేది.

ఈ బాధలంటే ఎలాగో భరించగలదు.

కానీ లంచ్ అవర్, సాయంత్రం వేళల్లో ఇంట్లో తనముందే రాజారావు, రంజితలు జోకులు వేసుకునేవారు. ఒకరిపై మరొ కరు పడీపడీ నవ్వుకునేవారు. వంటచేస్తూ సరస సంభాషణలు సాగించేవారు. వీటి నెలా తట్టుకోగలదు?

ఓ రోజు వికాస్ వచ్చినప్పుడు ఈ పరి స్థితి గురించి చెబుదామనుకుంది. కానీ అతను వస్తుండగానే రాజారావు తనపై ఎక్కడా లేని ప్రేమ కురిపించేవాడు.

"టాబ్లెట్ వేసుకున్నావా డియర్? ఈ పూట మరీ రెండు ముద్దలే తిన్నావ్. ఇలా

గైతే శక్తి ఎలా వస్తుంది? పొట్టమీద గాయం ఎలా ఉంది? " అంటూ సన్నివేశాన్ని గొప్పగా రక్తి కట్టించేవాడు.

దాంతో ఆమె మౌనం వహించేది.

అన్నీ భరిస్తూ వచ్చిన ఆమె, ఒకరోజు సహనం కోల్పోయింది. సాయంత్రం ఆరు గంటలవేళ ఆమెకు బాగా దాహమేసింది. రాజారావు కోసం పదిసార్లు కేకలు పెట్టింది.

స్పందన లేకపోవడంతో అతను గ్రౌండులోనో, బయటి గేటు వద్దనో ఉండి ఉంటాడనుకుంది. ఓపిక తెచ్చుకుని పైకి లేచింది. శక్తినంతా కూడదీసుకుంటూ ఒక్కో అడుగే ముందుకేస్తూ మొగరాన్ని పట్టుకుంది. ఫిల్టర్‌పై గ్లాసు తీసుకుని మంచినీళ్లు తాగింది. వెనక్కి రాబోతూ యథాలాపంగా తడికె పక్కనుంచి బయట కనిపిస్తున్న క్లాస్‌రూంలోకి చూసింది.

ఒళ్లు జలదరించింది.

మళ్లీ అదే దృశ్యం. రాజారావు, రంజిత ల నిస్సిగ్గు కార్యకలాపం!

'కుక్కబుద్ధి!' కసిగా తిట్టుకుందామె.

★ ★ ★

"వికాస్‌గారూ.. వికాస్‌గారూ.." కంగారుగా పిలిచింది నీరజ.

సాయంత్రంవేళ.. రాత్రి వంటకానికి సిద్ధమవుతున్న వికాస్ తలుపు తీశాడు.

ఎదురుగా నీరజ. ఏమిటన్నట్లు చూశాడు.

బజారువైపు వేలు చూపించిందామె.

ఆటో ఆగి ఉంది. అందులోంచి దిగేందుకు బాగా శ్రమపడుతోంది అపూర్వ. ఆటోడ్రైవర్ సాయమందిస్తున్నాడు.

కంగారుపడ్డాడు వికాస్. ఇంత హఠాత్తుగా ఆమె ఎందుకొచ్చిందో అర్థం కాలేదు.

గబగబా ఆటో వద్దకు నడిచాడు. అతని వెనకే నీరజ కూడా వెళ్లింది. అపూర్వ వంక అయోమయంగా చూశాడు వికాస్.

"లోపలికి రావచ్చా? " దీనంగా అడిగిందామె.

"తప్పకుండా. నీరజా.. హెల్ప్ చెయ్"

నీరజ సాయంతో అపూర్వను లోపలికి తీసుకొచ్చాడు. వరండాలోనే కుర్చీలో కూచోబెట్టి, ఆటో అతనికి డబ్బులిచ్చి పంపేశాడు. ఆటో దిగి, తల్లి వెనకే దిగులుగా వచ్చిన విహితను నీరజ ఎత్తుకుని, లోపలికి తీసుకెళ్లింది.

"అపూర్వా.. ఏమిటి? ఏమైంది? " అయోమయంగా అడిగాడు వికాస్.

ఒక్క పెట్టున ఏడ్చేసింది అపూర్వ.

"వికాస్.. నా వల్ల కాదు.. ఆ రాక్షసుడితో నరకం లాంటి ఆ ఇంట్లో ఉండటం నా వల్ల కాదు.."

"ఏమైంది.. వాడేమన్నా అన్నాడా? "

"లేదు"

"మరి? "

"ఆ రాక్షసితో కలిసి సరసాలాడుతున్నాడు. నా కళ్లముందే వాళ్లిద్దరూ బరితెగించి మరీ వ్యవహరిస్తున్నారు.."

రాజారావుకు రంజితతో అక్రమ సంబంధం ఏర్పడిందన్న విషయాన్ని చూచాయగా చెప్పింది కళమ్మ. ఆమె చెప్పిన నిజాన్ని ఓ పట్టాన నమ్మలేకపోయాడు వికాస్. తన మిత్రుడు అపూర్వకు అంత ద్రోహం చేస్తాడని కలలో కూడా అనుకోలేదు.

ఇప్పుడు అపూర్వ అతనితో తెగతెంపులు చేసుకుని వచ్చిన తీరు చూస్తే.. సమస్యతో ఆమె ఎంతగా సతమతమైందో అంచనా వేస్తున్నాడు.

"వికాస్! ప్లీజ్.. మీకభ్యంతరం లేకపోతే గాయాలు నయమయ్యేదాకా మీ రూంలో ఉండవచ్చా? " దీనంగా అడిగింది.

చలించిపోయాడు వికాస్.

"ఛఛ.. అదేంమాట అపూర్వా? తప్ప

కుండా ఉండొచ్చు"

నీరజ సాయంతో తన మంచాన్ని ఓ పక్కకు జరిపి, దానిపై బెడ్‌వేసి, దోమతెర కట్టాడు. ఇద్దరూ కలిసి ఆమెను మెల్లగా నడిపించుకొచ్చి, పడుకోబెట్టారు.

చాలారోజుల తర్వాత ఆమె ప్రశాంతంగా నిద్రపోయింది.

★ ★ ★

ఆ రోజు నుంచే సరికొత్త వికాస్‌నీ, సరికొత్త ప్రపంచాన్నీ చూసింది అపూర్వ.

తనకు ఉదయాన్నే మొహం కడగటం, బ్రష్ చేయించటం, టిఫిన్ తినిపించటం.. టీ తాగించటం, రోజూ రెండుసార్లు గాయాలకు డ్రస్సింగ్ చేయటం, అన్నం తినిపించటం, టాబ్లెటు వేయటం, మందు తాగించటం.. ఇవన్నీ ఏమాత్రం విసుగు లేకుండా చేసేవాడు. ఏ పని చేస్తున్నా తనతో కబుర్లు చెబుతూనే ఉండేవాడు. మొహంమీద చిరునవ్వు చెరిగేది కాదు. అలసట కనిపించేది కాదు.

ఉదయాన్నే హోటల్నించి టిఫిన్ తెచ్చేవాడు. తనకూ, పాపకూ తినిపించేవాడు. గబగబా అన్నం, కూర వండేసి లైబ్రరీకి వెళ్లేవాడు. తనకు మంచి మంచి పుస్తకాలిచ్చేవాడు. అవి చదువుతుంటే టైమే తెలిసేది కాదు. ఇంతలోనే తన లైబ్రరీ నుంచి వచ్చేవాడు. అన్నం తినిపించేవాడు. పాపకు రకరకాల కథలు చెప్పేవాడు. విహిత ఎక్కువ సమయం నీరజ దగ్గరే ఉండేది. తను అన్నం తింటూ ఏ పుస్తకం చదివారని అడిగేవాడు. ఆ పుస్తక రచయిత నేపథ్యం వివరించేవాడు.

కాసేపు విశ్రాంతి తీసుకుని సాయంత్రం టీ చేసి, తనకిచ్చేవాడు. మళ్లీ లైబ్రరీకి వెళ్లి రాత్రి ఎనిమిది దాటాక వచ్చేవాడు.

అతని మంచితనానికి తగ్గట్టుగానే మంచి ఇంటి యజమానులు దొరికారు.

ఇంటి ఓనర్ లెక్చరర్‌గా చేస్తాడు. ఆయన భార్య సీతారావమ్మ చాలా మంచి మనిషి. రోజూ ఒక్కసారైనా వచ్చి అపూర్వను పలకరించి వెళ్లేది. ప్రమాదం ఎలా జరిగింది? మీ ఆయన మంచివాడు కాదా? ఇలాంటి ప్రశ్నలు పొరపాటున కూడా ఆమె నోటినుంచి వచ్చేవి కాదు.

చక్కగా కబుర్లు చెప్పేది. ఆవిడకు దేవుడంటే నమ్మకం ఎక్కువ కాబోలు. ఆధ్యాత్మిక విషయాలే ఎక్కువగా మాట్లాడేది.

వాళ్ల ఏకైక కూతురు నీరజ. ఆ అమ్మాయి మరీ మంచిది. చలాకీగా ఉంటుంది. సరదాగా మాట్లాడుతుంది. ముఖ్యంగా తనకు స్నానం చేయించే విషయంలో వికాస్‌కు వెసులుబాటు కల్పి

## ఎలా నడుస్తుందా?

సగ్నముని కావ్యం 'కొయ్యగుర్రం' వచ్చిన కొత్తలో, మార్కెట్‌లో అది ఎలా నడుస్తోందని మిత్రుడు బుక్‌సెల్లర్‌ను అడుగుతున్నాడు.



పక్కనే ఉన్న వరద, 'అది కొయ్యగుర్రం కదా, నడవదు!' అని ఠపీమని అనడంతో హాయిగా నవ్వుకున్నారు.

### చక్రం అడ్డేస్తుంటే ఎలా?

వరద తల్లి అప్పుడప్పుడు నిరాశ నిస్పృహలతో, 'ఆ దేవుడు నన్నింకా తీసుకుపోవడం లేదు' అనేవారు.

దానికాయన 'ఎలా తీసుకుపోతాడే పాపం, వాడొచ్చినప్పుడల్లా డాక్టర్ని పిలిపించి చక్రం అడ్డేస్తావు కదా? " అనేవారు.

స్తుంది. ఏమాత్రం విసుక్కునేది కాదు. ఓపిగ్గా గాయాలన్నిటికీ మందు రాస్తుంది.

తన దగ్గరున్నంతసేపూ ఎక్కువగా వికాస్ ప్రస్తావన తెస్తుంటుంది. బహుశా అతనంటే ఇష్టపడుతోందేమోననుకుంది అపూర్వ.

ఇన్నేళ్లూ లేనిది.. ఈ వాతావరణంలోకి వచ్చాక మొదటిసారిగా తన తండ్రి, తల్లి, పార్వతి గుర్తొచ్చారు. గుండెల్లో ఏవేవో జ్ఞాపకాలు కదలాడాయి.

ఆ రోజు అత్తయ్య అనంతారం వెళ్లేటప్పుడు మరీ మరీ చెప్పింది అపూర్వ- తన కిలా ప్రమాదం జరిగినట్లు పొరపాటున కూడా తన వాళ్లకు తెలియనివ్వద్దని!




ఆదివారం మధ్యాహ్నం లైబ్రరీ మూసే శాక కాన్వెంటుకు వెళ్లాడు వికాస్. రాజా రావు మంచం మీద పడుకుని ఉన్నాడు. కుర్చీలో కూచొని అతనికి కబుర్లు చెబు తోంది రంజిత.

"రాజా, నీతో మాట్లాడాలి" సూటిగా విషయానికొచ్చాడు వికాస్.

"చెప్పు" ముక్తసరిగా అన్నాడు రాజా రావు లేచి కూర్చుంటూ.

"ఇక్కడ కాదు. పర్సనల్‌గా మాట్లాడాలి" అన్నాడు రంజితవైపు అభ్యంతరంగా చూస్తూ.

"ఇక్కడ పరాయివాళ్లెవరూ లేరు. చెప్పు" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఆమె ముందు చెప్పటానికి ఇష్టంలేక ఇబ్బందిగా చూశాడు. రంజిత ఏమను కుందో గానీ తనకేదో బయట పనున్నట్లు హడావుడిగా వెళ్లిపోయింది.

"ఏంట్రా రాజా! ఏమైంది నీకు?" బాధగా అడిగాడు.

"నాకేమైంది, ఏమీ కాలేదు. ఎప్పటిలానే ఉన్నా"

"అలా ఉంటే అపూర్వ అంతటి అఘా యిత్యానికి పాల్పడుతుందా?"

"అది అవివేకం" రాజారావు గొంతులో ఏమాత్రం పశ్చాత్తాపం ధ్వనించలేదు.

"నీ వివేకం ఏమైంది? మంచంలోంచి లేవలేని స్థితిలో కూడా ఆమె నీ దగ్గ ర్నుంచీ వెళ్లిపోయిందంటే.. కనీసం ఎటు వెళ్లిందో, ఎక్కడికి వెళ్లిందో ఆరాతీశావా?"

"ఎవడెళ్లమన్నాడు? నేనెళ్లమన్నానా?"

"లేకుంటే తనకేమైనా పిచ్చిపట్టి వెళ్తుందా?"

"పిచ్చి కాదు.. పొగరు. దానికి ఒళ్లంతా పొగరే. మంటల్లోపడి ఒళ్లు కాలిందేగానీ దాని అహంకారం తగలడలేదు"

చేతి సత్తువకొద్దీ లాగిపెట్టి రాజారావు చెంపమీద ఒక్కటిచ్చాడు వికాస్.

"చంపేస్తా. ఇంకొక్కమాట మాట్లాడినా నరికిపారేస్తా. ఒళ్లు కొవ్వెక్కి భార్యను వది లేసి ఇంకో ఆడదాని వెంట పడింది నువ్వురా! అపూర్వే లేకుంటే నువ్వీపాటికి ఏ బాంబుదాడిలోనో, వేట కొడవళ్ల నరికి వేతలోనో ముక్కలు ముక్కలై ఉండేవా డివి. తను నీకోసం అన్నీ వదులుకొని వస్తే.. చేతిలోకి నాలుగు డబ్బులు రాగానే పశువులా ప్రవర్తిస్తావా? రేయ్.. ఇవ్వాళ ఈ కాన్వెంటు నడుస్తుందంటే అదంతా అపూర్వ శ్రమ ఫలితమేరా. నీ కాన్వెంటు బోర్డుమీద ఒక్కసారి ఆమె పేరు తొల గించి చూడు.. ఏమవుతుందో! మూడో

రోజే మూతపడుతుంది. నాలుగొందల ముప్పైఒక్కమంది పిల్లల పేర్లు, వాళ్ల తల్లి దండ్రుల పేర్లు తను ఘంటాపథంగా చెప్ప గలదు. నీకు పట్టుమని పదిమంది పేర్లు తెలుసటరా? ”

వికాస్ మాటలు ఎక్కడో గుచ్చుకోవ టంతో గట్టిగా ఎదురు చెప్పలేకపోయాడు రాజారావు.

“ఇప్పటికైనా మించిపోయింది లేదు. వచ్చి తనను క్షమాపణ అడుగు. తప్పు సరిదిద్దుకో” అన్నాడు వికాస్ అభ్యర్థనగా.

“నాకా అవసరం లేదు. అయితే తను వస్తే మాత్రం నేను వద్దనను”

“జాలి చూపిస్తున్నావా? ”

“ఒక రకంగా అంతే!”

“రాజా.. ఆమె నీ భార్యరా!” గట్టిగా అరి చాడు వికాస్.

“కావొచ్చు. కానీ ఇప్పుడు తనో తోలు బొమ్మ. అందమైన శరీరమంతా మాడి పోయి, కేవలం తోలు మాత్రమే మిగిలిన మనిషి ఆకారం”

“దారుణంగా మాట్లాడుతున్నావ్‌రా..”

“కాదు.. వాస్తవంగా మాట్లాడుతున్నా”

“నువ్వే అలా అంటే ఆమె నా దగ్గరికొ చ్చింది. నేనెందుకు చూడాలి? నాకేం అవ సరం? ” కావాలనే ఆ ప్రశ్న అడిగాడు.

“నిన్నెవడు చూడమన్నాడు? నిర్దాక్షి ణ్యంగా తన్ని తగలెయ్..”

స్థాణువైపోయాడు వికాస్. ఇక తను మాట్లాడేదేమీ లేదని అర్థమైపోయింది.

మిత్రుడివంక ఏహ్యాభావంతో చూశాడు.

బాధతో బరువెక్కిన హృదయంతో అక్కడి నుంచి బయటకు నడిచాడు.

★ ★ ★

చూస్తుండగానే నెలరోజులు గడిచిపో యాయి.

కాలం అంత తొందరగా కరిగిపోతుం దని ఊహించలేదు అపూర్వ. కారణం - వికాస్, నీరజల స్నేహం. వారి అద్వితీయ సేవాఫలం.

ఆమె లేచి కూచోగలుగుతోంది.

గాయాలు చెక్కులు కడుతున్నాయి.

గుండెల్లోని దిగులు మేఘాలు తేలిపోతు న్నాయి.

సాహిత్యం మీద మంచి అవగాహన దొరికింది.

ఒకప్పటి కవితా సృజనకు జవజీవాలు తొడుక్కుంది.

చేత్తో పెన్ను పట్టుకోగలుగుతున్నందున అప్పుడో వాక్యం, అప్పుడో వాక్యం రాస్తూ కొన్ని కవితలకు ప్రాణం పోసింది. అవి చదివిన వికాస్ ఆశ్చర్యపోయేవాడు. కొన్ని మార్పులు సూచించేవాడు. వాటిని ఫెయిర్ చేసి ఇలా పత్రికలకు పంపటమే

## కొత్తగాలి...

**ఆడపిల్ల పుట్టిందని**
**బాధపడకండి**
**దాని విలువ తెలిసేది**
**వృద్ధాప్యంలోనే**

– రాంభట్ల స్వరాజ్యలక్ష్మి,
హైదరాబాద్

మిటి.. అలా అచ్చయిపోయేవి!

తనకూ ఓ సొంత ప్రపంచం ఏర్పడినట్లు గర్వంగా ఫీలయ్యేది అపూర్వ.

ఒకరోజు అర్ధరాత్రివేళ హఠాత్తుగా మెల కువ వచ్చింది అపూర్వకు. ఒళ్లంతా మంటల్లో కాలిపోతున్నట్లు అనిపించింది. ముందు అది కలేమో అనుకుంది. కానీ మానుతున్న గాయాల తాలూకు ప్రభావ మని తెలుసుకుంది.

ఒళ్లు మంటలు మరింత ప్రభావం చూపటంతో హఠాత్తుగా కేకలు పెడుతూ

లేచికూచుంది.

కింద చాపమీద పడుకున్న వికాస్ కంగా రుపడుతూ లేచాడు. ఏమైందని అడిగాడు లైటువేస్తూ.

"మంటలు.. ఒళ్లంతా మంటలు.. తట్టు కోలేకపోతున్నాను.."

మంటలనిపిస్తే రాయండంటూ డాక్టరు గారిచ్చిన అయింటుమెంటును ఆమె గాయాలకు రాశాడు. ముఖ్యంగా కాలిన చీర అంటుకుపోయి, ఏర్పడిన గాయం ఆమెను బాగా ఇబ్బంది పెడుతోంది. నీరజ అయితే చెప్పగలిగేది గానీ, తన పొత్తికడుపు మీద గాయం బాధ గురించి వికాస్‌కు ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

అలాగే ఈ రాత్రికి ఓర్చుకోవాలను కుంది. కానీ సాధ్యం కాలేదు. తప్పనిసరి పరిస్థితుల్లో అతనికి చెప్పేసింది.

"మరి చెప్పరేం? చూడు అపూర్వా.. ఇప్పుడు నువ్వు పసిపిల్లతో సమానం. నీకే సమస్య వచ్చినా నిర్మోహమాటంగా నాతో చెప్పు. ఇందులో బిడియపడాల్సిన పని లేదు" అంటూ ఆమె చీరను కిందికి జరిపి, పొత్తికడుపు మీద మందు రాశాడు.

ఆమెకు పోయిన ప్రాణం తిరిగొచ్చినట్ల యింది. ఎగసిన మంటపై తొలకరి జల్లు కురిసినట్లుగా గాయంపై అయింటుమెంటు స్పర్శ చల్లగా తగలగానే ఉపశమనం లభిం చింది. అయితే మంటల ప్రభావం మాత్రం పూర్తిగా చల్లారలేదు.

పదినిమిషాలు గడిచాక మంచంపై పడుకొన్న ఆమె పక్కనే కూచుంటూ "మంట తగ్గిందా? " అనడిగాడు.

"ఇంకా ఉంది" అందామె ఏడుపుమొ హంతో.

వికాస్‌కు డాక్టరు సలహా గుర్తొచ్చింది.

"గాయాల బాధనుంచి పేషెంటు విముక్తం కావాలంటే మందు రాయటం కన్నా మానసిక ధైర్యాన్నందించటం ముఖ్యం!"

ఇప్పుడు అపూర్వకూ అదే అవసరమని గ్రహించాడు.

"అపూర్వా! రాత్రి పడుకునేముందు నేనో కవిత రాశాను. నీకు చూయిద్దామనుకుంటే నిద్ర పోయావు. ఇప్పుడెలాగూ మెలకువ వచ్చిందిగా, ఓసారి చూస్తావా? "

కథలు మాత్రమే రాస్తాడనుకున్న వికాస్ మొదటిసారిగా ఓ కవిత రాశాడనేసరికి ఆమెలో ఆసక్తి జనించింది.

"అవునా, ఏదీ చూపించు!" అడిగింది.

ఓ కాగితం తెచ్చి ఆమెకందించాడు.

'మండుటెండలో నడుస్తున్నా మంచుకొం డను తలపించాలి.

మంటల కొలిమిలో మాడుతున్నా మంచి గంధమై పరిమళించాలి'

చదివి, "గుడ్ బిగినింగ్" అంది.

మిగతా వాక్యాలు కూడా చదవటం పూర్తి చేసింది.

"ఎలా ఉంది? " అడిగాడు వికాస్.

"ఎక్సెలెంట్!"

"మరేమనుకున్నారు.. ఇక మీకు నేనే పోటీ"

"కాకపోతే ఈ కవితలోని కొన్ని వాక్యాలు ఇంతకుముందు ఎక్కడో చదివిన ట్లుందే.." అందామె అనుమానంగా.

వికాస్ పెద్దగా నవ్వేశాడు.

"గ్రంథచౌర్యమండీ.." అన్నాడు సర దాగా చూస్తూ.

ఆమె కూడా నవ్వేసింది.

"ఏవండోయ్.. అయితే అన్ని వాక్యాలూ దొంగిలించలేదు. కవితలోని ప్రతి రెండో వాక్యమూ నేను కష్టపడి రాసిందే"

ఆమె మళ్లీ నవ్వింది.

"ఎందుకండీ నవ్వుతారు? నిజాయితీగా ఒప్పుకున్నాను గదా!"

ఆమె నవ్వటం ఆపి "మీరు చెప్పిన తీరుకు నవ్వొచ్చింది. నిజం చెబుతు

న్నాను. మీరు సొంతంగా రాసిన వాక్యాలు కూడా అద్భుతంగా ఉన్నాయి. కొంచెం కష్టపడితే దాన్ని మీ సొంత కవితగా మార్చుకోవచ్చు" అంది అతనివైపు ప్రశం సాపూర్వకంగా చూస్తూ.

"థ్యాంక్సండీ! నన్ను 'కొ'ని చేశారు"

"కొ..!" ఆ అక్షరాన్ని ఒత్తిపలికి మళ్లీ నవ్వింది ఆమె.

ఈ సందడిలో ఆమె మంటలు మాయ మైన విషయం గమనించలేదు.

"ఇప్పుడెలా ఉంది గాయాల బాధ?" సరదా స్థితి నుంచి సీరియస్ పొజిషన్

## కొత్తగాలి...

**చిల్లర నాణాలను**
**గంపలో పోసుకొని**
**విత్తనాల్లా చల్లాలనిపిస్తుంది**
**నోట్లు పండించాలనిపిస్తుంది**

– త్రిపాలం,
పెద్దచెల్మెడ, మెదక్‌జిల్లా

లోకి వచ్చి అడిగాడు వికాస్.

"మీ కవిత దెబ్బకు మంటలు చల్లారిపో యాయి" అందామె మళ్లీ నవ్వుతూ. తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు వికాస్.

మరుసటిరోజే డాక్టరు దగ్గరకెళ్లి అపూర్వ 'మంటల'తో బాధపడుతున్న విషయం చెప్పాడు.

ఆ బాధలు తప్పవని చెప్పాడు డాక్టర్. ముందు ముందు ఇంకా ఎక్కువగా ఉంటా యని కూడా చెప్పాడు.

అక్కడి నుంచి లైబ్రరీకి వచ్చాడు. ఏవేవో మ్యాగజైన్స్ పరిశీలించాడు. తను వెదుకుతున్న ఆర్టికల్ కనిపించింది. ఆసాంతం చదివాడు. రెండేళ్ల క్రితం ఆ వార్త చదివినట్లు గుర్తుంది. అయితే అప్పట్లో దాని గురించి పెద్దగా పట్టించుకో లేదు. ఇప్పుడు అవసరం రావటంతో బయ టికి తీశాడు.

రెండ్రోజులపాటు గ్రంథాలయ బాధ్య తలు అటెండరుకు అప్పగించాడు. ఇంటి కొచ్చి, అపూర్వను చూసుకునే కర్తవ్యాన్ని నీరజకు అప్పగించాడు.

"ఎక్కడికెళుతున్నారు?" అడిగింది అపూర్వ.

"కేరళ"

"ఎందుకు?"

"అక్కడో నాటు వైద్యుడున్నాడట. ప్రకృతి సహజంగా అతను తయారుచేసే మందు రాసుకుంటే, కాలిన గాయాల బాధ త్వరగా తగ్గిపోతుంది. శరీరం కూడా పూర్వస్థితికి వస్తుందట?"

అలాంటి రిస్కులేమీ తీసుకోవద్దని అపూర్వ బతిమాలినా వినకుండా, బయ ల్దేరి వెళ్లిపోయాడు.

రెండ్రోజుల తర్వాత తిరిగొచ్చాడు. ఈ రెండ్రోజుల్లో అపూర్వకు నీరజతో మంచి సాన్నిహిత్యం ఏర్పడింది.

★ ★ ★

మానసిక చికిత్స.. ఆహ్లాదకర వాతావ రణం.. మనసున్న మనుషుల మధ్య మనుగడ.. కేరళ మందు.. వీటిల్లో ఏది పనిచేసిందో తెలియదుగానీ ఇరవై రోజు ల్లోనే బాగా కోలుకుంది అపూర్వ. లేచి నడ వగలుగుతోంది. తన పనులు తాను చేసు కోగలుగుతోంది.

ఉన్నట్లుండి ఒకరోజు కళమ్మ వచ్చింది. బాగా కోలుకున్న కోడల్ని చూసి ఊపిరి పీల్చుకుంది.

"అత్తయ్యా! మీరు ఇక్కడికి..?"

"అసలు అక్కడికి వెళ్లనేలేదమ్మా. సరా సరి ఇక్కడికే వచ్చేశా"

"అంటే మీకు జరిగిందంతా.."

"తెలిసిందమ్మా. ఎలా, ఏమిటి అని అడ

గొద్దు. ఆ భ్రష్టుడు చేసిన పని గురించి నాకు నిన్ననే తెలిసింది. నువ్వెటు వెళ్లావో, ఏమై పోయుంటావోనని కంగారుపడ్డా. అంతలోనే నా రెండో కొడుకు వికాస్ గుర్తొచ్చాడు. కచ్చితంగా అతని దగ్గరే ఉంటావని భావించి, ఇక్కడికే వచ్చాను" అంది కళమ్మ.

"మీరేకదా అత్తయ్యా చెప్పారు.. నీకే అవసరం వచ్చినా వికాస్‌ను మర్చిపోవద్దని. నిజంగా ఏ జన్మలో నేను చేసుకున్న పుణ్యమో.. అతను నన్ను కంటికి రెప్పలా చూసుకున్నాడు"

"మనవరాలేదీ? " అడిగింది కళమ్మ.

"నీరజ దగ్గరుంది"

"తీసుకొస్తా" అంటూ వెళ్లింది కళమ్మ.

లైబ్రరీ నుంచి వస్తూనే వికాస్ కాళ్లు, మొహం కడుక్కొని ప్లేటులో అన్నం పెట్టాడు. కూర కలిపాడు.

"నేనిప్పుడు లేవగలను. నడవగలను. అన్నం పెట్టుకు తినగలను. మీకెందుకీ శ్రమ? " అందామె.

అన్నం కలిపిన ప్లేటును ఆమెకందిస్తూ "అలవాటుగా మారిన పనిని అంత తేలిగ్గా మరిచిపోకూడదు అంటాడో ఇంగ్లీషు రచయిత. ఇలా నీకు కలిపివ్వడం.. నాకదో తుత్తి.. తినండి" అన్నాడు నవ్వుతూ.

పళ్లేన్ని ఆమెకందించి, వెనక్కి తిరగ్గానే అక్కడ కళమ్మ నిలబడి ఉంది, చంకలో మనవరాలితో! ఆశ్చర్యపోయాడతను.

"అమ్మా! మీరెప్పుడొచ్చారు? " అడిగాడు ఆనందంగా.

ఆవిడేం మాట్లాడలేదు. సంభ్రమంతో అతన్నే చూస్తుండిపోయింది, కన్నార్పకుండా!

"ఏంటమ్మా! అలా చూస్తున్నావు? "

"వికాస్.. నువ్వు నా కడుపున ఎందుకు పుట్టలేదయ్యా? "

"పుడితేనే కొడుకునవుతానా అమ్మా? "

"నీకింత సహనం ఎక్కణ్నించి వచ్చింది? ఆ పిల్ల నీకు ఏమవుతుందని ఇంత చాకిరీ చేస్తున్నావు? "

"చూడమ్మా, నేనీ ప్రపంచంలో కావాలని అడిగి మరీ అన్నం పెట్టించుకునేది ఇద్దరే ఇద్దరి దగ్గర. ఒకరు మీరయితే మరో వ్యక్తి.. అపూర్వ. నీ కన్నా చిన్నదే అయినా నాకు తను అన్నం పెట్టిన ప్రతి సారీ అమ్మలానే కనిపించేది. శరీరం కాస్త పొగచూరి, నన్ను వెతుక్కుంటూ వచ్చింది. ఇప్పుడూ నాకు తను అమ్మే. మా అమ్మలాగే చూసుకుంటున్నా. అన్నం తినిపిస్తున్నా. తల దువ్వుతున్నా. బట్టలు మారుస్తున్నా. అమ్మకు సేవలు చేయడానికి ప్రత్యేకంగా సహనం అవసరమా అమ్మా" అతని మొహంలో నిండైన నిజాయితీ తప్ప ఇంకే దర్పమూ లేదు.

"వికాస్.." పిలిచింది అపూర్వ.

అటువైపు తిరిగాడతను.

రెండు కళ్లనుంచీ రెండు కన్నీటి బొట్లు జాలువారుతుండగా.. అతనికి రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

"ఛఛ.. అదేం పని అపూర్వ? తప్పు!" అంటూ ఆమె చేతులు విడగొట్టాడు.

కళమ్మ హృదయం పులకించిపోయింది. ఒకనాడు ఎవరినైతే పెళ్లాడాలని పరితపించాడో.. అదే వ్యక్తికి అతను కొత్త జీవితాన్ని ప్రసాదిస్తున్న దేవుడిలా కనిపించాడు! భోజనం చేసి, తనకేదో పనుందని బయటకు వెళ్లిపోయాడు వికాస్.

ఒకరోజు ఉండి, కళమ్మ కూడా వెళ్లిపోయింది. వెళ్లేముందు ఆమె 'ఆ రోజు' వికాస్ తన వద్దకు రావటం, అపూర్వను పెళ్లి చేసుకునేందుకు మాధవయ్యగారిని ఒప్పిస్తానంటూ వెళ్లటం గురించి కోడలికి చెప్పకుండా ఉండలేకపోయింది.

★ ★ ★

అపూర్వ మనసులో మళ్లీ మథనం

మొదలైంది.

తాను నీరజ నుంచి రాబట్టిన సమాచారం మేరకు.. ఆమెకు వికాస్ అంటే చాలా ఇష్టం. ఇంకా చెప్పాలంటే అతన్ని పిచ్చిగా ప్రేమిస్తోంది.

మరి వికాస్ మనసులో ఏముంది?

తను ఒప్పుకుంటాడా?

ఒకప్పుడు వికాస్ తనను చేసుకోవాలని ఆశపడ్డాడనే విషయం అత్తయ్య చెప్పిన దగ్గర్నుంచీ ఆమె హృదయంలో ఏదో ఘోష వినిపిస్తోంది.

ఎంత పిచ్చిదాన్ని?

ఇలాంటి మనిషి ప్రేమనా నేను గుర్తించలేకపోయింది?

కాలం అమాంతం వెనక్కి ప్రయాణించి, మళ్లీ ఆ రోజు కళ్లెదుట ప్రత్యక్షమైతే ఎంత బాగుండు?

ఇప్పుడు మాత్రం ఏమయింది? ఇక మిగిలిన జీవితమంతా అతని చేయి పట్టుకు నడిస్తే!

ఎంత దుర్మార్గపుటాలోచన!

ఇది సగం కాలిన జీవితం!

మాడి మసై బొగ్గులా మిగిలిన దేహం!

గాయాలు మిగిలిన శరీరాన్నా అతనికి కానుకగా ఇచ్చేది!

అపూర్వ ఆలోచనలు తెగటం లేదు.

తపన.. అతనికేదైనా చిన్న సాయం చేయాలన్న తపన!

ఎలా!!? ?

★ ★ ★

సాయంత్రం ఐదు గంటల వేళ.. పార్కులో సందడిగా ఉంది. ఓ సిమెంటు బెంచీపై వికాస్, నీరజ కూచొని ఉన్నారు.

వికాసే ఆమెనక్కడ కలవమని కోరాడు.

"నీరజ, డైరెక్టుగా విషయానికొస్తున్నా. మీ నాన్న రెండు సంబంధాలు తెచ్చినా నువ్వు తిరస్కరించావట. ఎందుకు? "

"ఇదో పెద్ద ప్రశ్నా? నాకు నచ్చలేదు"

"ఏది నచ్చలేదు? నా ప్రశ్నా? పెళ్ళికొడుకులా? "

"రెండూ"

"ఎందుకని? "

"మీరు నిజంగా డైరెక్టుగా విషయానికొస్తే దీనికి సమాధానం లభిస్తుంది"

"ఆల్‌రైట్.. నువ్వు నా మీద లేనిపోని ఆశలు పెట్టుకున్నట్లున్నావు"

"లేనిపోనివి కాదు.. ఉన్నవే"

"అదే వద్దంటున్నాను"

"నిజం చెప్పండి.. నేనంటే మీకిష్టం లేదా? "

"మొన్నటిదాకా ఇష్టమే. కానీ ఇవ్వాళ నా పరిస్థితి వేరు. నా మీద కొత్త బాధ్యతలు పడ్డాయి"

"ఏమిటవి? "

"అపూర్వ, విహిత."

"ఆమెను పెళ్లి చేసుకుంటారా? "

"చెప్పలేను"

"అంటే? "

"నీరజా.. నీకు తెలియదు. ఒకప్పుడు నేనామెను పెళ్లి చేసుకోవాలనుకున్నాను. అది వేరే కథ. ఇప్పటి పరిస్థితి వేరు. ఆమె మరొకరి భార్య. విధి ఆడిన వింత నాటకంలో ఆమె భారం నాపై పడింది. అందుకు నేను బాధపడటం లేదు. అదో అదృష్టంగా భావిస్తున్నా.."

"ఆమె ఒప్పుకుంటే మీరు స్వీకరిస్తారా? " సూటిగా, స్పష్టంగా అడిగింది నీరజ.

"కచ్చితంగా"

"ఆమె ఇప్పుడు మునుపటి అపూర్వ కాదు. అందమైన శరీరం లేదు. అప్పటి ఉత్సాహం లేదు. ఇద్దరు పిల్లల తల్లి.."

"అయినా సరే, నా కిష్టమే. లేదూ.. జీవితాంతం ఆమె భారం భరించాల్సి వచ్చినా బాధ పడను. నీకు మీ నాన్న, అమ్మ అందరూ ఉన్నారు. నాకన్నా మంచి సంబంధం తేగలరు. కానీ అపూర్వ పరిస్థి

తేమిటి? ఆమె పిల్లలు ఏం కావాలి?"

ఆలోచనలో పడింది నీరజ.

"ఇప్పుడు చెప్పు నీరజ. ఇకనైనా నాపై ఆశలు వదులుకుంటావా.. ప్లీజ్!"

"అస్సలు వదులుకోను. పైగా మీపైన నాకున్న ప్రేమ రెట్టింపయ్యింది. వికాస్.. ఒక వ్యక్తిని కేవలం పెళ్లి చేసుకోటానికి మాత్రమే ప్రేమించాల్సిన అవసరం లేదు. అతని ఉన్నత వ్యక్తిత్వానికి ముచ్చటపడి కూడా ప్రేమించవచ్చు. బెస్టాఫ్‌లక్" అంటూ గభాల్న అతని చేతిపై ముద్దు పెట్టి, గబగబా వెళ్లిపోయిందామె.

★ ★ ★

"నీరజా! నిన్నో విషయం అడుగుతాను. నిజం చెబుతావా?" వికాస్ లేని సమయంలో నీరజను పిలిచి, ఇంటర్వ్యూ మొదలు పెట్టింది అపూర్వ.

"అడగండక్కా! మీరడిగితే చెప్పనా?"

"వికాస్ అంటే నీకిష్టమేనా?"

"అవును"

"అతన్ని ప్రేమిస్తున్నావా?"

"పీకల్దాకా"

"మరి అమ్మా నాన్నలకు?"

"వాళ్లకీ ఇష్టమే. నా మనసులో మాట చెబితే వాళ్లు కాదనరు"

"మరీ విషయం వికాస్‌కు చెప్పావా?"

"చెప్పాను"

"ఏమన్నాడు?" ఆత్రంగా అడిగింది అపూర్వ.

"తనకిష్టం లేదన్నాడు"

"ఎందుకని?"

"తను ఇంకెవరినో ప్రేమిస్తున్నాట్ట. ఆమెనే పెళ్లి చేసుకుంటాడట!"

"ఎవరామె?"

"మీరే!"

నెత్తిన పిడుగు పడినట్లు ఉలిక్కిపడింది అపూర్వ.

"నే.. నా.."


## చతుర - విపుల

### ప్రకటనల రేట్లు

| కవర్స్ | చతుర | విపుల |
|---|---|---|
| ఫ్రంట్ కవర్ (స్ట్రిప్) కలర్ మాత్రమే | 8,625/– | 6,900/– |
| బ్యాక్ కవర్ (కలర్ మాత్రమే) | 8,625/– | 6,900/– |
| రెండు / మూడు కవర్ (కలర్) | 7,765/– | 6,470/– |
| రెండు / మూడు కవర్ (నలుపు/తెలుపు) | 4,315/– | 3,450/– |
| లోపలివైపు ... | | |
| ఫుల్ పేజి (కలర్) | 6,900/– | 5,750/– |
| ఫుల్ పేజి (నలుపు/తెలుపు) | 3,450/– | 2,875/– |
| హాఫ్ పేజి (కలర్) | 4,140/– | 3,450/– |
| హాఫ్ పేజి (నలుపు/ తెలుపు) | 2,070/– | 1,725/– |

వివరాలకు మీ సమీపంలోని

ఈనాడు కార్యాలయాన్ని సంప్రదించగలరు

"అవునక్కా. మిమ్మల్నే చేసుకుంటాడట.. అదీ మీరు ఒప్పుకుంటేనే.." ఆ తర్వాత ఆమె తన మాటలేవీ వినే స్థితిలో లేదని తెలుసుకోలేని నీరజ చెప్పుకుపోతూనే వుంది.

"మిమ్మల్ని ఒప్పించే పూచీ నాదని వికాస్‌కు హామీ ఇచ్చానక్కా. గమ్మత్తేమిటంటే.. ఇంత తెలిశాక కూడా వికాస్ మీద నాకున్న ప్రేమ చెక్కుచెదరలేదు. పైగా మరింత పెరిగింది. ఎవరికుంటుంది చెప్పు.. ఇంత విశాల హృదయం.."

నీరజ వెళ్లిపోయాక కూడా ఓ పట్టాన తేరుకోలేకపోయింది అపూర్వ. ఏదో ఒకటి చేయాలి. ఏం చేయాలి?

★ ★ ★

వికాస్ మధ్యాహ్నం భోజనానికి వచ్చేసరికే అపూర్వ పక్కనే కూచొని కబుర్లు చెబుతూ కనిపించాడు రాజారావు.

వికాస్‌కి మతిపోయింది.

కలా, నిజమా అన్నట్లు చూశాడు.

అసలు ఏమీ జరగనట్టుగానే రాజారావు కలుపుగోలుగా మాట్లాడాడు. జోకులు వేశాడు. కృతజ్ఞతలు చెప్పాడు.

ఆరోజు సాయంత్రమే అపూర్వ రాజారావుతో బయల్దేరింది. వెళ్లేముందు వికాస్‌తో మాట్లాడింది..

"వికాస్.. ఎన్నాళ్లని నీకు భారం కాగలను? ఎంత కాదనుకున్నా ఈ సమాజంలో ఆడదానికి భర్త అండ కావాలి. లేకుంటే అనేక పాట్లు పడాలి. రాజా తన తప్పు తెలుసుకున్నాడు. పశ్చాత్తాపపడుతున్నాడు. అతన్నింకా శిక్షించటం సమంజసం కాదు. అతనితోనే వెళ్లిపోతున్నా.."

వికాస్‌కు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

అతికష్టం మీద ఓ విషయం చెప్పాడు..

"నాకు కృష్ణాజిల్లాకు ట్రాన్స్‌ఫర్ వచ్చింది అపూర్వా. వచ్చేవారమే జాయిన్ కావాలి"

"కంగ్రాట్స్" భార్యాభర్తలిద్దరూ ఒకేసారి అన్నారు.

వికాస్ మాట్లాడలేదు. విహితను ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు.

"ఇక వెళ్దామా.." రాజారావు పాపను తీసుకుని ముందు నడిచాడు.

అపూర్వ కొన్ని క్షణాలపాటు వికాస్ మొహంలోకి చూసింది.

ఆ చూపుల్లో వేలభావాలు కనిపించాయి.

వికాస్‌కు నమస్కరించి, అక్కడి నుంచి వస్తుంటే అపూర్వకు తన హృదయాన్ని అక్కడే మర్చిపోయినట్లు ఏదో వెలితిగా అనిపించింది.

నీరజ, వికాస్‌లు చేతులూపుతుండగా ఆటో కదిలింది.



9

రాజారావు తల్చుకుంటే ఆ పనిని సాధించేదాకా వదిలిపెట్టడు. ఆ విషయం బాగా తెలుసు కాబట్టే.. నీరజ-వికాస్‌ల పెళ్లి విషయమై అటు వికాస్‌నీ, ఇటు ఆమె తల్లిదండ్రుల్ని ఒప్పించే బాధ్యతను అతనికి అప్పగించింది. ఎట్టకేలకు రాజారావు సఫలీకృతమయ్యాడు.

ఆరోజే నీరజ, వికాస్‌ల పెళ్లి.

కాన్వెంటే వేదిక. రంగు రంగుల తోరణాలతో కళకళలాడింది. పిల్లల ఆటపాటలతో కొత్త అందాలు సంతరించుకుంది.

పెళ్లికి పెద్దఎత్తున జనం హాజర

య్యారు. అంగరంగ వైభవంగా పెళ్లితంతు ముగిసింది.

అన్ని పనుల్లోనూ అపూర్వ పెత్తనమే కనిపించింది. మణికట్టు వరకూ ఉన్న చేతుల జాకెట్టు, పట్టుచీర ధరించి చలా కీగా పెళ్లిపెద్దలా తిరిగింది.

రెండ్రోజుల తర్వాత నీరజతో సహా సామానంతా సర్దుకుని తనకు బదిలీ అయిన గ్రామానికి బయల్దేరాడు వికాస్.

వెళ్లేముందు నీరజతో కలిసి కాన్వెంటుకు వచ్చాడు. తన కోసమేనన్నట్లుగా ఎదురు చూస్తున్నారు కాన్వెంటు టీచర్లు, పిల్లలు, రాజారావు, అపూర్వ కనిపించారు.

అపూర్వ కొత్త దంపతులిద్దరినీ ఇంట్లోకి తీసుకెళ్లింది. రాజారావు కూల్‌డ్రింక్స్ తెస్తానని వెళ్లాడు.

ఇద్దరికీ స్వీటు తినిపించింది అపూర్వ.

ఓ చీర, తాంబూలం, అరటిపండు నీరజకు అందించింది.

రాజారావు కూల్‌డ్రింక్స్ తెచ్చి ఇచ్చాడు.

"వెళ్లొస్తాం" లేచారు, నీరజ, వికాస్.

"మంచిది. హ్యాపీ మ్యారీడ్ లైఫ్" అన్నారు రాజారావు, అపూర్వ.

ముందుగా రాజారావు, ఆ వెనుక నీరజ, తర్వాత వికాస్ బయటికి నడుస్తుండగా.. ఎవరో పిలుస్తున్నట్లనిపించి, వెనక్కి తిరిగాడు వికాస్.

అపూర్వ.. సజల నయనాలతో!

హఠాత్తుగా అతని పాదాలకు నమస్కరించిందామె.

కంగారు పడిపోయి పైకి లేపాడు వికాస్.

ఇద్దరి మధ్యా మాట పెగలటం లేదు.

ఆమె ఆత్మీయంగా అతడి నుదుటిపై చుంబించింది.

"థ్యాంక్యూ.. థాంక్యూ వెరీమచ్.." కళ్లు తుడుచుకుంటూ బయటికి నడిచాడు వికాస్.

టీచర్లందరికీ పేరుపేరునా వెళ్లొస్తానని చెప్పాడు. కన్నీళ్లు పెట్టుకున్నారు, ఆత్మీయ బంధమేదో తెగిపోతున్నట్లు!

పిల్లలందరూ నవ్వుతూ చేతులూపుతూ వీడ్కోలు చెబుతుండగా.. బరువెక్కిన హృదయాలతో అక్కడి నుంచి నిష్క్రమించారు వికాస్, నీరజ.

అదే రోజు సాయంత్రం..

అప్పటికే ఆమె సర్దివున్న ఓ సూట్‌కేసు, బ్యాగ్ రాజారావు చేతికందించింది.

అయోమయంగా చూశాడు రాజారావు.

"బయటికి నడవండి.. ఈ ఇంటి నుంచీ.. నా జీవితంలోంచీ.." కరాఖండిగా చెప్పింది అపూర్వ.

## కొత్తగాలి...

**దూకుడు**
**దుమ్మురేపింది**
**ఊసరవెల్లి**
**కొత్తరంగులు మార్చింది**

– నేమాన సుభాష్‌చంద్రబోస్,
శ్రీకాకుళం

"ఏమిటి, నువ్వనేది?"

"సీరియస్‌గానే చెబుతున్నా. జీవితంలో మళ్లీ మీ మొహం నాకు చూపించకండి"

"బెదిరిస్తున్నావా? ఈ కాన్వెంటు నాది. నువ్వెవతివే నన్ను పొమ్మంటానికి?"

"పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. నా మెళ్లో సొమ్ములు అమ్మి కదూ ఈ కాన్వెంటు బోర్డు రాయించింది. చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండా పారిపోయి వచ్చినవాడికి ఈ ఆస్తులపై అధికారం ఎలా వస్తుంది?"

"డబ్బుల్తోనే ఆస్తులు సంపాదించాలా? కష్టపడి దీన్ని డెవలప్ చేశాను"

"ఇదంతా చేసింది మీరేనా? సిగ్గులేదూ, ఆ మాట అనడానికి! ఏనాడైనా ఒక్క పేరెంట్స్ మీటింగ్ కండక్ట్ చేశారా? పిల్లల తల్లిదండ్రులతో మాట్లాడారా? పిల్లల బాగోగులు చూశారా? మీరు కన్నెర్ర జేస్తే దడుసుకుని, చేతులు ముడుచుకు కూచోడానికి నేనిదివరకటి అపూర్వను కాదు, మర్యాదగా బయటకు నడవండి.."

"లేకపోతే.."

"కాసేపట్లో పోలీసులొస్తారు. వాళ్లే బలవంతంగా మిమ్మల్ని గెంటేస్తారు. ప్రూఫ్ కావాలా? ఇదిగో నేను స్టేషన్లో ఇచ్చిన కంప్లెయింట్ జిరాక్స్ కాపీ, అలాగే కాన్వెంటును, దాని తాలూకు ఆస్తి మొత్తాన్ని నా పేరిట రిజిష్టర్ చేయించాను.."

యుద్ధానికి అన్నివిధాల సిద్ధమైందని గ్రహించాడు రాజారావు.

"అప్పూ.. నువ్వు ఆవేశంలో ఉన్నావు. నేను వెళ్లిపోతే ఈ సమాజంలో నీ బతుకు హీనంగా మారుతుంది. పిల్లలిద్దరూ దిక్కులేని వారవుతారు.

"నా బతుకు గురించి నాకస్సలు దిగుల్లేదు.. పిల్లల్ని చక్కగా పెంచుకోగలను. ఇంక ఒక్కమాట కూడా మాట్లాడకుండా వెళ్లిపోండి.."

"అప్పూ.. ఆ తర్వాత బాధపడతావు. మరోసారి ఆలోచించు.." కాళ్లబేరానికి దిగాడు రాజారావు.

"ఫస్ట్.. యు గెటౌట్.." పెద్దగా అరిచింది అపూర్వ.

గత్యంతరం లేక అక్కడ నుంచి కదిలాడు రాజారావు.

★ ★ ★

కాన్వెంటు మళ్లీ తన అదుపాజ్ఞల్లోకి రావటంతో అపూర్వకు చేతినిండా పని దొరికింది. పిల్లల మధ్య కొత్త జీవితం ప్రారంభించింది.

ఒకరోజు..

నాలుగేళ్ల తర్వాత మొదటిసారిగా తన తండ్రికి ఉత్తరం రాసింది.

'జీవితంలో అలసిపోయాను నాన్నా. ఇప్పుడే కాస్త వెసులుబాటు దొరికింది. నేనె లాగూ మీ దగ్గరకు రాలేను. అమ్మా, నువ్వూ వచ్చేసి నాతో ఉండండి. మీ మనవరాలితో ఆడుకుంటూ కాలం గడపవచ్చు.'

ఉత్తరం అతికిస్తుంటే.. జనాభా లెక్కల సేకరణకై ఇద్దరమ్మాయిలు లోపలికొచ్చారు. ఓ ఫామ్ ఇచ్చి ఇంట్లో సభ్యుల వివరాలు పూర్తి చేయమన్నారు.

అలాగే రాసి ఇచ్చిందామె.

"మేడమ్.. మీరన్నీ రాశారు గానీ మీవారి పేరు రాయలేదు.."

"ఆయన పేరు అవసరమా?"

"కచ్చితంగా!"

"అయితే రాసుకోండి"

"చెప్పండి మేడమ్?"

"ఆయన పేరు... వికాస్"

"వృత్తి?"

"లైబ్రేరియన్"

ధీమాగా, స్థిరంగా పలికిందామె కంఠం.

ఆమెకెందుకో, అలా చెప్పినందుకు గాల్లో తేలిపోతున్నట్టు.. మంచుకొండల్లో విహరిస్తున్నట్లు.. మంచి గంధం మనసుకు తాకుతున్నట్లు.. మహాసంతోషంగా ఉంది!

ఆమె సంతోషాన్ని రెట్టింపు చేయడానికన్నట్టు.. ఫోన్ మోగింది. వివేకానంద!

"మేడమ్ గుడ్‌న్యూస్! మనం పెట్టాలనుకుంటున్న స్కూల్‌కు ఫండ్ ఇవ్వడానికి ఎయిడ్స్ కంట్రోల్ సొసైటీ ఒప్పుకుంది. ఇప్పుడే నా చేతికి లెటర్ వచ్చింది".

"వావ్.. ఎంత మంచి వార్త చెప్పారు! థాంక్యూ సో మచ్"

ఇకపై గతంలోకి ప్రయాణించి, చేదు జ్ఞాపకాల్ని తవ్వుకునేంత సమయం అపూర్వకు ఇప్పుడప్పుడే దొరక్కపోవచ్చు! ©

కాలాతీతం





సింక్లేర్ లూయిస్

# బాబిట్

మిన్నెసోటా రాజధాని మిన్నియాపాలిస్నే జెనిత్ నగరంగా పునఃస్పష్టి చేశాడు రచయిత. దీని జనాభా అయిదు లక్షలు. నగర పొలిమేరల్లో 'ఫ్లోరల్ హైట్స్' అనే పెద్ద భవంతిలో ఉంటాడు జార్జి ఫనాన్స్బీ బాబిట్. ఆ ప్రాంతంలో ఉన్న ఇతర సంపన్నుల ఇళ్లలాగే వుంటుంది 'ఫ్లోరల్ హైట్స్'. ఏ ప్రత్యేకతా లేకుండా మూసపోసినట్టుగా అన్ని ఇళ్లూ ఒకేలా ఉండటమే వాటి ఆకర్షణ. మధ్య తరగతి అభిరుచులలో తేడా ఉండదు. వ్యక్తిత్వం మృగ్యం. బాబిట్ మాత్రం తన కృషికి, సంపదకూ ఆ ఇల్లు ప్రతీక అనుకుంటాడు. పందొమ్మిదో శతాబ్ది తొలి దశకంలో పింగాణి బాత్‌టబ్, ఖరీదైన అలారం గడియారం, ఎలక్ట్రిక్ ఫ్యాన్, కాఫీ కోసం పెర్కొలేటర్ ఉండటం గొప్ప లగ్జరీలు. అవి సమాజంలో స్టేటస్‌కు చిహ్నాలు. ఇక కారు ఉంటే చెప్పనక్కర్లేదు.




ఇవన్నీ పోగు చెయ్యటానికి బాబిట్ చాలా కష్టపడ్డాడు. జెనిత్‌లోని పెద్దమనుషుల అథ్లెటిక్ క్లబ్బు బూస్టర్స్‌లో సభ్యత్వం దొరకటమంటే మాటలా? రియల్ ఎస్టేట్ ఏజెంట్‌గా ఎన్నెన్ని వ్యూహాలు రచించి, ఎంతమందిని నమ్మించి, ఎంత తక్కువకు కొని, ఎంత ఎక్కువకు అమ్మి ఇంతదాకా వచ్చాడు! తను బాగుపడ్డాడు గనక సమాజంలోనూ, రాజకీయాల్లోనూ యథాతథ

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

స్థితి అంటే ఇష్టం. ప్రస్తుత నియమాలు, చట్టాలు, ఆచారాలు, విశ్వాసాలు, వ్యవస్థ తనకు అనుకూలించటం వల్లనే గదా తన ప్రగతి సాధ్యపడింది! అందువల్ల రాజకీయాలు, కళలు, విద్యావిధానం గురించి ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. సోషలిస్టులు చీడపురుగులని ఆయన స్థిరమైన విశ్వాసం. ఇక సంస్కరణలన్నా, ప్రస్తుత వ్యవస్థలో ఏ చిన్న మార్పు అవసరమని ఎవరు వాదించినా ఆయనకు మహా చెడ్డ చిరాకు. మనుషులందరూ ఒక్కటే అంటారేమిటి మూర్ఖులు. అందరూ ఒక్కటే అయితే, తన కష్టానికి, ప్రతిభకు గుర్తింపు ఎలా ఉంటుంది. అందరికన్నా గొప్పవాడినని చెప్పుకోవటం ఎలా సాధ్యం? స్వేచ్ఛా విపణి ప్రగతికి ఆక్సిజన్ లాంటింది. ఎవరెలా పోతే తనకేం? ఎంతకైనా కొని, ఎంతకన్నా అమ్ముకొంటేనే కదా లాభాలు సంపాదించేది? వ్యాపారం మీద ప్రభుత్వ నియంత్రణ ఉండకూడదు. మద్య నిషేధం సమర్థిస్తాడు కానీ అప్పుడప్పుడూ తాగుతాడు. కుటుంబ జీవితమే ఆదర్శప్రాయం. ఏకపత్నీవ్రతమే ఉత్తమం. కాని తన లేడీ సెక్రటరీతో 'వ్యవహారం' నడిపించాలని తహతహ. 1920 ఏప్రిల్ నెలలో ఒక ఉదయం సుఖనిద్ర తర్వాత, ఒళ్లు విరుచుకుని, కళ్లు తెరిచి కిటికీలోంచి బయటికి చూసినపుడు లోకం అందంగా కనిపించింది. ఆశావహంగా లాభాల పూల బాటలో మరింత ముందుకు నడిచి, ప్రైవేటు సుఖాలను ప్రైవేటుగా జుర్రుకుంటూ వేదికల మీద, క్లబ్బులలో ఆదర్శాలను గురించి ఘాటుగా ఉపన్యసించి, కీర్తిప్రతిష్టలు పెంచుకోవటానికి మరొక్క రోజు ప్రారంభమైందని సంతోషించాడు.

కాని లోలోపల ఏదో సందేహం.. అంతా సవ్యంగా కొనసాగుతున్నదా? ఈ డబ్బూ, ఆస్తీ, మర్యాదా తనకు నిజంగా ఆనందాన్నిస్తాయా? కొడుక్కు ఉన్నత విద్య మీద శ్రద్ధ లేదు. అయినా బలవంతంగా కాలేజీకి పంపించాడు. కూతుర్ని తనలాగా, తనకన్నా ఎక్కువ హోదా ఉన్న కుర్రాళ్లతోనే స్నేహం చెయ్యమని, అంతస్తులను గౌరవించాలని నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. ఇష్టం లేకపోయినా ఇరుగుపొరుగు పెద్దమనుషుల్ని ఇంటికి డిన్నర్లకు ఆహ్వానించాడు. నిచ్చెన ఎక్కాలంటే ఇవి తప్పవు. బూస్టర్స్ క్లబ్బులో ఉపాధ్యక్ష పదవికోసం సభ్యులందరితోనూ సత్సంబంధాలు పెట్టుకున్నాడు. అంతరాంతరాల్లో నాటుకున్న అసంతృప్తి బీజం మహా వృక్షంగా ఎదుగుతున్నదా? ఈ సందిగ్ధత, మీమాంసలో ఒకే ఒక ఆశాకిరణం పాల్ రైస్లింగ్! తన కాలేజీ సహాధ్యాయి, ఆప్తమిత్రుడు.

వయోలినిస్టు కావాలని కలలుకన్న పాల్ కుటుంబ పోషణకోసం ఇళ్ల రెయిన్‌ప్రూఫ్ కోటింగ్ అమ్ముతాడు రోజంతా. రాత్రంతా భార్య సాధింపులు భరిస్తాడు. పాల్‌లో తనను తాను చూసుకుంటాడు బాబిట్. మొగుణ్ణి ఎంత అసహ్యించుకున్నా, ద్వేషించినా, విడాకులివ్వటానికి నిరాకరిస్తుంది పాల్ భార్య. అయితే మనశ్శాంతి కోసం ఇంట్లో దొరకని శారీరక సుఖకోసం పాల్ రహస్యంగా ప్రేమ వ్యవహారం నడిపిస్తున్నాడు. అందువల్ల బాబిట్‌కు అతడంటే అసూయ. తను చెయ్యటానికి సాహసించని పని అతడు చేస్తున్నాడు మరి. ఒక అప్సరస, ఒక దేవకన్యతో ప్రేమాయణం సాగించాలని తనకెన్నాళ్ల నుండో కోరిక. కానీ ధైర్యం చాలదు.

బాబిట్‌లో నిద్రాణమైన, సుషుప్తిలో ఉన్న తిరుగుబాటు సర్పం బుస కొడు

తుంది. ఏదో చెయ్యాలి. తన మిత్రుణ్ణి రాచి రంపాన పెడుతున్నందుకు పాల్ భార్యను దుర్భాషలాడతాడు. తన భార్య మీరాపై కూడా విసుక్కుంటాడు.

'ఇంటికి రావాలంటేనే అసహ్యంగా వుంది. అన్నీ ఏడుపుగొట్టు మొహాలే. ఒంటరిగా వదులు' అంటాడు. ఇంటి యజమానికి కోపమొస్తే అందరూ గజగజా వణికి పోవాల్సిందే. నిజమే, తనేమైనా చేయవచ్చు. తన మాటకు తిరుగులేదు. ఎవరినైనా తిట్టవచ్చు. తనకు పూర్తి స్వేచ్ఛ వుంది. కానీ స్వేచ్ఛతో ఏం చేయాలి? తనకు స్వేచ్ఛ అనేది ఒక రహస్య కుహరం. అందులోకి ప్రవేశిస్తే ఏ విచిత్ర జంతువులు, ఏ విషనాగులు పైకి లంఘిస్తాయో! ప్రస్తుతానికి పాల్‌తో కలిసి వారం రోజులపాటు విహారయాత్రకు బయల్దేరాడు. త్వరలోనే భార్యలు, భర్తల్ని చేరుకుంటారు. హాయిగా తిరిగిరావటం వల్ల టెన్షన్ తగ్గింది. ప్రశాంతంగా వుంది. తన నమ్మకాలు మంచివే. లోకం సజావుగా సాగుతోంది. సమాజంలో తన స్థానం సుస్థిరం. వ్యాపార నిమిత్తం షికాగో వెళ్లినప్పుడు, అక్కడ పాల్ తన గర్ల్‌ఫ్రెండ్‌తో కనిపిస్తాడు. లోపల కోరిక రగుల్తుంది. అందరూ సుఖపడుతున్నారు. తను మాత్రం చొంగ కార్చుకుంటూ తృప్తి పడుతున్నాడు. కాని పిరికితనం ముందు తృష్ణ గడ్డిమంట లాంటిది. ఆ తర్వాత జరిగిన ఒక హఠాత్పరిణామం బాబిట్ ఆలోచనా ధోరణిని గాఢంగా ప్రభావితం చేస్తుంది. తను నమ్మిన మర్యాదస్తుల లోకం తల్లకిందులవుతుంది. పాల్ తన భార్యను హత్యచేసి మూడేళ్లపాటు జైలుపాలవుతాడు. ఇదే ఒక షాక్ అనుకుంటే, తననెప్పుడూ ఒంటరిగా వదలని మీరా, ఏదో సాకు చెప్పి కొన్నాళ్లపాటు దూరంగా వెళ్లిపోతుంది. ఇప్పుడు బాబిట్ ఒంటరి. స్నేహితుని సాంగత్యం లేకపోవడంతో ఏకాంతం మరింత భారం అవుతుంది. తన

# వేర్లు చెప్పే సంగతులు

వృక్ష శాస్త్రజ్ఞులు చెట్లవేర్ల గురించి చెబుతున్న అరుదైన సంగతులివీ..

★ ఓ చెట్టులోని దాదాపు పదోవంతు వేళ్ళ రూపంలో భూమిలో ఉంటుంది.

★ చెట్ల శాఖలు ఉపరితలంపైన ఎలా విస్తరించి వుంటాయో, భూమి లోపల దాని వేళ్ళ విస్తరణ కూడా అచ్చం అలాగే, అంత మేరకే ఉంటుంది.

★ గాలి బలంగా వీచే ప్రాంతాల్లో చెట్ల వేర్లు లావుగా ఉండి, భూమిలోపలికి చొచ్చుకుపోతాయి. ఎడారి ప్రాంతాల్లోని చెట్లవేర్లు



నీళ్లవైపుకు వెతుక్కుంటూ సాగుతాయి.

★ ఎదిగే దశలో నీరు సరిగ్గా అందని చెట్లవేర్లు బలంగా అభివృద్ధి చెందుతాయి. ఆ చెట్లే మిగతావాటికంటే ఎక్కువ కాలం జీవిస్తాయి. చిన్నవిగా ఉన్నప్పుడు నీరు సమృద్ధిగా అందిన మొక్కలు, బాగా పెరిగిన తర్వాత నీటి ఎద్దడిని ఎదుర్కొన్న చెట్లతో పోలిస్తే తక్కువకాలం జీవిస్తాయి.

★ చాలారకాల వేళ్ళను ఉడకబెట్టి ఆహారంగా తీసుకోవచ్చు. అయితే అవి ఓ పట్టాన ఉడకవు.

★ ఓక్ చెట్టు వేళ్ళను ఒకదాని వెంబడి ఒకటి పేర్చుకుంటూ పోతే వేల కిలోమీటర్ల పొడవు ఉంటాయవి.

★ బర్చ్ వృక్షం వేళ్ళు వెంట్రుకలంత సన్నవి. అయితే ఆ వేళ్ళను కలిపి తాడుగా పేనితే, దానితో ఇరవై టన్నుల బరువును పైకి లేపవచ్చు.

# చతుర ప్రవేశిక

## నవంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. పులిగాడు ఎవరి అనుచరుడు?
జ.
2. పార్వతి మేనమామ ఎవరు?
జ.
3. రాజారావును వలలో వేసుకున్నది?
జ.
4. ఎయిడ్స్ సోకిన చిన్నారి?
జ.
5. వికాస్ ఎవరిని పెళ్లాడాడు?
జ.
6. కోర్టు పక్షుల దేశంగా ఖ్యాతిగాంచినది?
జ.
7. మహాశ్వేతాదేవి తండ్రి?
జ.
8. బాబిట్ నవలా రచయిత?
జ.
9. 'కొయ్యగుర్రం' రచయిత?
జ.
10. పరాత్పరరావును కాపాడిన డ్రైవరు?

---

పంపినవారి పేరు: ------------------

------------------వయసు (  )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

---

జీవితాన్ని పునస్సమీక్షించుకోవటానికి ఇదో మంచి అవకాశం. తను అనుకున్నట్టుగా బతికాడా? తన నమ్మకాల్లో ఎంత నిజాయతీ వుంది? లేదా కృత్రిమ విలువలనే ఎండమావుల వైపు పరుగుతీశాడా?

మరోరాత్రి గడిచింది. తన జీవిత సరళిని ధిక్కరిస్తే ఏమవుతుంది? నవోదయం తిరగబడమంది.

కొన్నాళ్ల తర్వాత ఒక పార్టీలో పొరుగింటి పెద్దమనిషి అందమైన భార్యతో సాన్నిహిత్యం కోసం ప్రయత్నిస్తాడు. మరోసారి ఒక బ్యూటీషియన్‌ను డిన్నర్‌కు ఆహ్వానించి తరువాత గదికి రమ్మంటాడు. చివరికి ఓ నడివయసు వితంతువులో తన 'అప్సరస' సాక్షాత్కరిస్తుంది.

ఆమె పేరు టేనిస్ జూడిక్. మానసికంగా, శారీరకంగా ఆమె తనకు దేవుడిచ్చిన తాత్కాలిక భార్య. ఆమెతో 'నిజమైన' తృప్తి అనుభవిస్తాడు. మీరా తిరిగి వచ్చిన తర్వాత కూడా ఏదో ఓ కారణంతో టేనిస్‌ను కలుస్తూనే వుంటాడు. ఆమె మిత్రులు తన వర్గానికి చెందిన మర్యాదస్తులు కారు. తను ఇన్నాళ్లూ అసహ్యించుకున్న విలువలు వాళ్లవి.

ఒక వామపక్షవాదిని బాబిట్ సమర్థించటంతో అతడి తిరుగుబాటు సామాజిక, రాజకీయ రంగు పులుముకుంటుంది. అత్యంత సంప్రదాయవాదులైన బూస్టర్ క్లబ్ సభ్యులకు బాబిట్ దారి తప్పుతున్న వాడిలా కనిపిస్తాడు. ఈ పిచ్చివేషాల్ని ఇక కట్టిపెట్టమని అతడి మీద ఒత్తిడి తెస్తారు. పరువు, మర్యాద పంజరంలో బతికిన బాబిట్‌కు స్వేచ్ఛ ఓ సుడిగుండంలా ఉంటుంది. 'ఇక నీ శృంగార సాహసయాత్ర చాల్లే' అంటూ టేనిస్ అతడిని బుద్ధిగా పెళ్లాంతో సంసారం చేసుకోమంటుంది. మిత్రులు, 'ఘరానా బతుకనే కవచం ధరించకపోతే శరీరం చిద్రమైపోతుంది' అంటారు. మీరా ఆరోగ్యం దెబ్బతినటంతో ఇల్లే సర్వస్వమనుకునే పరిస్థితి వస్తుంది.

# సింక్లేర్ లూయిస్ (1881 - 1951)

నోబెల్ బహుమతి సాధించిన తొలి అమెరికన్ రచయిత సింక్లేర్ లూయిస్ (1930). మిన్నెసోటా రాష్ట్రంలోని సాక్ సెంటర్ గ్రామంలో జన్మించిన సింక్లేర్ తండ్రి డాక్టరు. తల్లి అనారోగ్య పీడితురాలు. సింక్లేర్‌కు ఆరేళ్ల ఉన్నప్పుడే మరణించింది. సన్నగా, పొడుగ్గా, మొటిమల మొహంతో పెరిగిన సింక్లేర్ ఒంటరి జీవితం గడిపాడు.

యేల్ విశ్వవిద్యాలయంలో చేరాడుగానీ చదువుపై శ్రద్ధ చూపలేదు. ఒక ఏడాది పనామా యాత్ర చేసి వచ్చాడు. మరో ఏడాది ప్రముఖ సోషలిస్టు రచయిత అప్టన్ సింక్లేర్ నెలకొల్పిన ఆదర్శ సమాజం నమూనా 'హెలికన్ హాల్'లో గడిపాడు. కొన్ని రోజులు ఉత్సాహంగా విశ్వవిజేత అనే భావనతో, మరి కొన్నాళ్లు నీరసించి గడ్డిపోచకన్నా బలహీనుడిననే ఆత్మన్యూనతతో జీవితమంతా కొట్టుమిట్టాడాడు సింక్లేర్.

1908లో యేల్ చదువు ముగించి వివిధ పత్రికల్లో రిపోర్టర్‌గా, ఎడిటర్‌గా, అడ్వర్టయిజింగ్ మేనేజర్‌గా పనిచేశాడు. ప్రముఖ రచయితలు జాక్ లండన్, ఆల్బర్ట్ పేసన్ టెర్హ్యూంలకు నవలల ప్లాట్లు అమ్మాడు. తొలి నవల 'అవర్ మిస్టర్ రెన్'(1914) పాఠకులను ఆకట్టుకోవటంతో రచయితగా స్థిరపడ్డాడు. తర్వాత రాసిన నవలలు 'ది ట్రయల్ ఆఫ్ ది హాక్', 'ది జాబ్' పెద్దగా పేరు ప్రఖ్యాతులు తీసుకుని రాలేదు. ఆ తర్వాత మరో నవల 'మెయిన్ స్ట్రీట్'(1920) రాసేవరకూ అతడు నిలదొక్కుకోలేదు. అమెరికన్ మధ్యతరగతి జీవన సరళిని విశ్లేషించటమే కథా వస్తువుగా స్వీకరించిన సింక్లేర్ తర్వాత అయిదేళ్లలో తన మాస్టర్ పీసెస్ 'బాబిట్' (1922), 'ఆరో స్మిత్'(1925) ప్రచురించాడు. 'ఎల్మర్ గాంట్రీ'(1927), 'డాడ్స్‌వర్త్'(1929) ఈయన ఇతర రచనలు.

1935లో ప్రచురితమైన 'ఇట్ కెన్ హేప్పెన్ హియర్' నిరంకుశ పాలనలో అమెరికాను ఊహించిన భవిష్యత్ చిత్రపటం.

'కీర్తి, సంపద, సంసారం- మరే ఇతర సుఖాల్లోనూ ఆనందం లభించలేదు. అంతా వృథా, అంతా శూన్యం' అన్న నిర్వేదంతో నీరసించిపోయాడు. తాగుడుకు బానిసయ్యాడు. మిత్రులు ఇంటికి వచ్చినా, పలకరించినా ఆసక్తి చూపలేదు. చివరి రోజులు మనోవల్మీకంలోనే గడిచాయి. సింక్లేర్ లూయిస్ తన రచనల్లో పాఠకులతో పంచుకున్న కాల్పనిక వాస్తవికత ఇదే.

---

మధ్యవయసు కూడా గడిచింది. వృద్ధాప్యం తొంగిచూస్తుంది. 'నాకు నా భార్య ముఖ్యం.. రియల్ ఎస్టేట్ ముఖ్యం. లాభాలు ముఖ్యం. పెద్ద మనుషుల సాహచర్యం ముఖ్యం. జెనిత్‌లో పరువూ ప్రతిష్టా ముఖ్యం. బూస్టర్స్ క్లబ్ సభ్యుల ప్రశంసలు ముఖ్యం' అని జీవితంతో రాజీ పడిన బాబిట్ ఎన్నికల్లో రాడికల్ అభ్యర్థికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తాడు.

పైకి చూస్తే నవల సుఖాంతమే అనిపిస్తుంది. మీరా ఆరోగ్యం బాగుపడుతుంది. పిల్లల పెళ్లిళ్లు అవుతాయి. వ్యాపారంలో లాభాలు పెరుగుతాయి. కాని బాబిట్ లోపల శూన్యం. ఒక చీకటి సొరంగం.

కాలేజి చదువు మధ్యలో మానేసి, ప్రేమించిన పిల్లను పెళ్లాడాలనుకున్న కొడుకుతో, 'ఇంతవరకు నేననుకున్న పని ఒక్కటీ చేయలేకపోయాను. నావన్నీ తీరని కోరికలే. ఇష్టం లేని పనులు చేస్తే వ్యక్తికి తన మీద తనకు అసహ్యం పెరుగుతుంది. వ్యక్తిత్వం కోల్పోతాడు మనిషి. నువ్వైనా ఇష్టమైన పని చేస్తున్నందుకు అభినందిస్తున్నాను. నాకు సంతోషంగా వుంది' అని తన మనసులోని మాట చెబుతాడు.

'బాబిట్', 'బాబిట్రీ' పదాలు ఈ నవల తర్వాత ఇంగ్లీషుభాషలోకి చేరిపోయాయి. 'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అనుకుని స్వార్థమే పరమార్థంగా బతికే మనిషని నిఘంటువులో అర్థం స్థిరపడింది. బాబిట్స్ సహజంగా సాంప్రదాయవాదులు. యథాతథస్థితిని సమర్థిస్తారు.

—వసంత

# ఆదివాసీ ఆత్మబంధువు



మహాశ్వేతాదేవి

**శతాబ్దాలుగా ఉపేక్షకు గురవుతున్న ఆదివాసీ ప్రజల జీవితాల్లోని చీకటి కోణాలను, అదే కోవకు చెందిన పీడితప్రజల బాధామయ స్థితిని ప్రత్యక్షంగా పరిశీలించి, లోతుగా అధ్యయనం చేసి తన కథలకు, నవలలకు ఇతివృత్తాలుగా స్వీకరించారు మహాశ్వేతాదేవి. బెంగాలీ కల్పనా సాహిత్యానికి చైతన్యశీలమైన, సామాజిక నిష్ఠమైన నూతన దిశానిర్దేశం చేసిన విలక్షణ రచయిత్రి ఆమె. విద్యాధి కురాలై వుండి రచనే జీవికగా స్వీకరించిన ఆమె, నిర్భాగ్యుల పక్షాన ఉద్యమగతితో పోరాడటానికే ప్రాధాన్యమిచ్చిన సేవామూర్తి. 1976-95 మధ్యకాలంలో మహాశ్వేతాదేవి రచనలు భారతీయ భాషల్లో సర్వోత్కృష్టమైనవిగా పరిగణన పొంది 1996లో జ్ఞానపీఠ పురస్కారాన్ని ఆమెకు లభింపజేశాయి.**

మహాశ్వేతాదేవి 1926 జనవరి 14న నేటి బంగ్లాదేశ్ రాజధాని అయిన ఢాకాలో జన్మించారు. వారిది సాహితీ కుటుంబం. తండ్రి మనీష్ చంద్ర ఘటక్ ప్రముఖ కవి. తల్లి ధరిత్రీదేవి కూడా పేరొందిన రచయిత్రి, సామాజిక కార్యకర్త. పినతండ్రి రుత్విక్ ఘటక్ సుప్రసిద్ధ చలన చిత్ర నిర్మాత. మేనమామ సచిన్‌చౌదరి పత్రికా సంపాదకులు. మరో మేనమామ శంఖ్‌చౌదరి ప్రఖ్యాత శిల్పి. మహాశ్వేతాదేవి బాల్యంలో శాంతి నికేతన్‌లో చదివారు. తర్వాత అక్కడే సాహిత్యంలో బి.ఎ. డిగ్రీ పొందారు. ప్రకృతి సాన్నిహిత్య వైఖరిని రవీంద్రుని స్ఫూర్తితో పెంపొందించుకున్నారు. తర్వాత కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎ. డిగ్రీ అందుకున్నారు. ఆ దశలోనే రాజకీయావగాహన, సామాజిక సేవానిరతి, రచనాభిలాష పెంపొందాయి. కమ్యూనిస్టు నాయకుడు విజన్ భట్టాచార్యతో ఆమె వివాహం మే 1948లో జరిగింది. విద్యార్థినిగా కొన్ని ప్రాంతాలు సందర్శించినప్పుడు ప్రజల దుర్భర పరిస్థితులు గమనించి ఆమె కలత చెందారు. ముఖ్యంగా ఆదివాసీల దైన్యస్థితిని ఆమె ప్రత్యక్షంగా చూశారు. గృహిణి అయ్యాక కూడా ఆమె ఆసక్తిలో మార్పులేదు. అనేక ప్రాంతాలు పర్యటించారు. కలహండీ, ఖేడియా, పురూలియా వంటి చోట్ల ఆదివాసీ ప్రజల కష్టాలు చూశారు. భూమ్‌జీ, ఓంరావ్, సంథాల్, మహలీ, బాగ్‌దా, డోమ్, గంజూ, దుసాద్ బోయ మొదలైన ఆదివాసీ తెగల అవస్థలు తెలుసుకున్నారు. వారి జీవితాలలో వెలుగులు ప్రసరింపచేయాలనే దృఢ సంకల్పం కలిగింది. అందుకు రచనను బలమైన సాధనంగా ఎంచుకున్నారు. ఆమెకొక కుమారుడు, నవారుణ భట్టాచార్య. కవిగా, నవలాకారుడిగా ఆయన ప్రసిద్ధుడు. మహాశ్వేతాదేవి సాంసారిక జీవితానికి 1962లో విడాకులతో తెరపడింది.

'నాకు ఏది మంచిగా తోస్తుందో దాన్ని రాస్తాను' అని ప్రకటించిన మహాశ్వేతాదేవి రచనలన్నీ సమాజ సముద్ధరణను కాంక్షించేవే. 1950లో రచనకు శ్రీకారం చుట్టిన ఆమె వివిధ అంశాలపై పత్రికల్లో వ్యాసాల ద్వారా తన భావాలను నిశితంగా, నిష్కర్షగా వెలిబుచ్చారు. కథ, నవలా ప్రక్రియలనే ఆమె ప్రధాన వాహికలుగా స్వీకరించారు. 'ఝూన్సీర్‌రాణి' 1956లో వెలువడిన తొలినవల. మహాశ్వేతాదేవి పరిశోధనా వైశారద్యానికి దర్పణం. తర్వాత వరుసగా వచ్చిన నటి, జమునాకె తీర్, మధురె మధుర, తిమిరలగన్, ప్రేమ్‌తారా, సంధ్యార్‌కు ఆసా, రూప్‌రేఖ, పరమ్ పిపాస, అమృతసమయ్, దినేర్ పరివార్,

ఆశ్రయ్, మధ్యరాతెర్‌గాన్ వంటి నవలలు ఆమె సమాజ శ్రేయోకాంక్షకు తార్కాణాలు. వాటిలోని భావ నిర్భరత పాఠకలోకంలో సంచలనం కలిగించింది. వస్తువైవిధ్యం ఆశ్చర్యపరచింది. 'హజార్ చు రాశీర్‌మా' ఇందుకు బలీయమైన నిదర్శనం. నక్సల్‌బరీ ఉద్యమ నేపథ్యంలో సాగే నవల ఇది. శవాగారంలో తన కుమారుడి మృత దేహం చూసి దిగ్భ్రాంతికి లోనైన మాతృమూర్తి సుజాత హృదయ వేదనను రచయిత్రి ఆర్ద్రంగా చిత్రించారు. అదే ఉద్విగ్నతతో విప్లవరూపం దాల్చిన రైతాంగ సమస్యను నవలలో వివరించారు. విద్యావంతులైన యువకులు ఈ పోరాటంలో భాగస్వాములైన తీరు చెప్పారు. వ్రతీ అనే నగర యువకుడు పోరాటంలో ప్రాణాలర్పిస్తాడు. 1979లో వెలువడిన 'అరణ్యేర్ అధికార్' నవల మహాశ్వేతదేవి ఆదివాసీ ప్రజల పట్ల పెంచుకున్న గాఢానుబంధానికి నిలువుటద్దం. బ్రిటిష్ పాలనపై ఆదివాసీ నాయకుడు బిర్సా ముండా జరిపిన తిరుగుబాటు గాథ ఇది. 'ఉపేక్షితుల చరిత్ర దేశచరిత్రలో సముచిత స్థానం చేకూర్చుకోవాలి' అని వాదించారు. ఆదివాసీ స్త్రీల ఆవేదనలను, బాధలను, పోలీసు అత్యాచారాలను, కారాగారాల్లో జరిగే మానవహక్కుల ఉల్లంఘనలను నవల ద్వారా శక్తిమంతంగా లోకానికి వెల్లడించారు. సమాజంలోకి చొచ్చుకొచ్చిన విష సంస్కృతిని దుయ్యబట్టారు. మాదకద్రవ్యాలకు బానిసలవుతున్న యువతీయువకుల పతనాన్ని 'నీలభవి' నవలలో వివరించారు. స్వాహా, సుభగ్ బసంతీ, ఘరెపెరా, రాజా, సత్య-అసత్య, అజ్ఞాతపరిచయ్, ప్రథమపథ్ మొదలైన మొత్తం నలభైఐదు నవలలు రచించారు.

మహాశ్వేతాదేవి కథాసాహిత్యంలో అధికభాగం ఆదివాసీల శ్రేయోభివృద్ధికై ఆమె పడే తపనకు ప్రతీకలని చెప్పాలి. 'ఇక రచయిత రచనని, దాన్ని రాసే కాలాన్ని బట్టి అంచనా వేయకపోతే ఆ రచనకి న్యాయం చేకూరదు. సరైన మూల్యాంకనం చేయలేం' అని ఆమె స్పష్టపరిచారు.

సామాజిక న్యాయ సాధనకోసం అహరహం పోరాడి ఆత్మార్పణకు సహితం వెనుకాడని త్యాగమూర్తులు 'అగ్ని గర్భ' కథాసంపుటిలో సాక్షాత్కారిస్తారు. 'శ్రేష్ఠగల్ప్' సంపుటిలో ఆమె అసాధారణ ఆశయనిబద్ధత, కథా నిర్మాణ చాతుర్యం ఆవిష్కృతమవుతాయి. ప్రత్యేకించి ఈ కథలకు భూమిక ఆదివాసీ జీవితం. 'బికారి దుసాధ్' కథలో దుసాధ్ తెగకు చెందిన బికారి ప్రాథమిక హక్కులు కోరినందుకు పోలీసులు అతనికి జీవనాధారమైన మేకల్ని లాక్కుపోతారు. "బికారి బిచ్చగాడి వృత్తి ఎంచుకున్నాడు. రాజ్యాంగం తప్పకుండా అతణ్ణి ఎన్నో జన్మల వరకు బిచ్చగాడిగా వుండేట్లు చూసుకుంటుంది" అని రచయిత్రి కథ చివరిలో అంటుంది. 'డోమ్' కథలో శవాల్ని పాతిపెట్టే చండీని మంత్రగత్తెగా ముద్ర వేసి వెలివేస్తారు. ఆమె తన ప్రాణాలొడ్డి రైలు ప్రమాదాన్ని నివారిస్తుంది. కథాంతంలో ఆమె పుత్రుడు భగీరథ్ గర్వంగా 'ఆమె నా తల్లి ఈశ్వరచండి గంగాదాసి' అని ప్రకటిస్తాడు. బెహులా, ఘటక్, మూర్తి, దౌలతి, గ్రామ్‌బంగ్లా మొదలైన పదమూడు కథా సంపుటాలు మహాశ్వేతాదేవిని గొప్ప కథకురాలిగా నిలిపాయి. ఆమె ఇంకా పదమూడు బాల సాహిత్య గ్రంథాలు, ఒక నాటకం రచించారు. ప్రస్తుతం కోల్‌కతాలో నివసిస్తున్న ఆమె ఇంకా తన రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారు. నందిగ్రాం, సింగూర్ వంటి ఉద్యమాలపై విస్తృతంగా పత్రికలలో వ్యాసాలు వెలువరించారు. ఆమె రచనలు మధ్యతరగతి మేధావి వర్గాన్ని విశేషంగా ప్రభావితం చేశాయి. అలాగే




పెక్కు భారతీయ భాషల్లోకి, జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్ వంటి విదేశీ భాషల్లోకి విరివిగా అనువాదాలయ్యాయి.

ఆదివాసీ శ్రేయస్సుకై నిరంతరం ఉద్యమం సాగిస్తున్న మహాశ్వేతాదేవి హక్కుల పోరాటానికి ప్రతిరూపమైన దక్షిణాఫ్రికా అధ్యక్షుడు నెల్సన్ మండేలా చేతుల మీదుగా జ్ఞానపీఠ పురస్కారం అందుకోవడం విశేషం. అమృత పురస్కార్, శరత్‌చంద్ర ఛటోపాధ్యాయ పతకం, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, రచనాత్మక జనసేవా సమ్మాన్, జగత్తారిణీ పతకం, భువనమోహినీ పతకం, మెగసేసే తదితర అవార్డులు ఎన్నో ఆమె అందుకున్నారు. కేంద్రప్రభుత్వం 'పద్మభూషణ్' గౌరవం ప్రదానం చేసింది.

భారతదేశం గర్వించదగ్గ మహోన్నత రచయిత్రి మహాశ్వేతాదేవి.

–గోవిందరాజు రామకృష్ణారావు



# హలో.. అమెరికా 8

# కోర్టు పక్షుల దేశం

**ఎవరైనా కోర్టులో తమ మీద దావా వేస్తారేమోననే భయం అమెరికన్లను నిరంతరం వెంటాడుతుంది. అక్కడ ఎవరైనా దేనిపైనయినా తమని తప్పక కోర్టుకి ఈడ్చే ప్రమాదం ఉందనేది అందరికీ తెలిసిన సత్యం. 1946లో చట్టంగా మారిన 'ది ఫెడరల్ టార్ట్ క్లయిమ్స్ యాక్ట్' వల్ల అమెరికా ప్రభుత్వంపై దావా వేసే హక్కు ప్రజలకు సంక్రమించింది. అదేవిధంగా పౌరులు పరస్పరం దావా వేసుకోవచ్చు. భార్య భర్తపైన, స్నేహితులు సాటి మిత్రులపైన, పిల్లలు తల్లిదండ్రుల మీద వ్యాజ్యాలు వేయడం అమెరికాలో పరిపాటి. ఆ దేశంలోని ఈ ధోరణి మెక్ డొనాల్డ్స్ రెస్టారెంట్‌పైన స్టెల్లా లైబెక్ అనే మహిళ వేసిన కేసుతో ప్రపంచానికి స్పష్టంగా వెల్లడైంది.**

మెక్‌డొనాల్డ్స్ డ్రైవ్ త్రూ రెస్టారెంట్‌లో డెబ్బై తొమ్మిదేళ్ల స్టెల్లా కాఫీ తీసుకుని, దానిలోకి చక్కెర కలుపుతోంది. ప్రమాదవశాత్తు ఆ వేడి కాఫీ ఒలికి ఆమె బొడ్డు కింద, తొడలపై పడి కాలింది. థర్డ్ డిగ్రీ బర్న్స్ అంటే ప్రమాదకర గాయాలు అయ్యాయి. ఆమె మెక్‌డొనాల్డ్స్ తనని ఈ విషయంలో ముందే హెచ్చరించాల్సిన బాధ్యతను విస్మరించిందని, దాంతో తాను నష్టానికి గురయ్యానని, ఇరవై వేల డాలర్ల పరిహారాన్ని కోరింది. కోర్టులో లాయర్లు ఆ కాఫీ నూట తొంభై డిగ్రీల ఫారన్ హీట్ వేడిని కలిగి ఉంటుందని, ఇది మిగిలిన రెస్టారెంట్స్ అమ్మే కాఫీ కంటే నలభై డిగ్రీలు అధికమని వాదించారు. అది ఒంటిమీద పడితే, రెండు నుండి ఏడు సెకన్లలోనే థర్డ్ డిగ్రీ బర్న్స్ కలుగుతాయని డాక్టర్లు సాక్ష్యం చెప్పారు. 'ది షైనర్ బర్న్ ఇన్‌స్టిట్యూట్' గతంలోనే మెక్‌డొనాల్డ్స్‌ని నూట ముప్పై డిగ్రీల ఫారన్ హీట్ కంటే ఎక్కువ వేడి గల కాఫీ విక్రయించవద్దని హెచ్చరించిందని కూడా చెప్పారు. జ్యూరీ సభ్యులు ఆవిడకు మెక్‌డొనాల్డ్స్ ఇరవై ఏడు లక్షల డాలర్లను చెల్లించాలని చెప్పారు. అయితే తర్వాత జడ్జి దాన్ని ఐదు లక్షల డాలర్లకు తగ్గించాడు.

సాధారణంగా నష్టపరిహారం ఇలా లక్షల్లో ఉంటుంది. చిన్న వ్యాపారస్తుల వల్ల ఓ కస్టమర్‌కి ఏదైనా నష్టం వాటిల్లి, కోర్టుకి ఎక్కి, అతడు గెలిస్తే అంతే సంగతులు. వ్యాపారస్తులు తాము అంతదాకా సంపాదించింది ఆ పరిహారం చెల్లించడానికి సరిపోదు. అమెరికాలోని కొందరు భారతీయులు రెస్టారెంట్స్‌లాంటి వ్యాపారాలను పెట్టడానికి ఈ కారణంగానే సందేహిస్తుంటారు. ఎలాంటి చిన్న సేవాలోపం జరిగినా కస్టమర్ కోర్టుకి ఎక్కుతాడు. కొందరు లాయర్లు ప్రత్యేకంగా ఇలాంటి కేసులనే చూస్తారు. కేసు గెలిస్తే వచ్చే దాంట్లో కొంత పర్సెంట్ తీసుకునే పద్ధతిలో వీరు ఈ కేసులు వాదిస్తుంటారు.

టార్ట్స్ లా వచ్చాక 1950లలో ఇలాంటి కేసులు అధికమయ్యాయి. 2000లో ప్రెసిడెంట్ బుష్ దీనికి విరుగుడుగా 'టార్ట్స్ రిఫార్మ్ బిల్లు'ని పెట్టేందుకు చొరవ చూపాడు. ఇలాంటి




వ్యాజ్యాలవల్ల ఇన్సూరెన్స్ ప్రీమియమూ పెరిగింది. ఆ వ్యాజ్యాల తీరుతెన్నులు ఇలా ఉంటాయి.

★ ప్రాణమిత్రుడికి ఓ టీనేజర్ మోటార్ సైకిల్‌ని అరగంటసేపు ఇచ్చాడు. అతను దానికి ఏక్సిడెంట్ చేయడంతో రిపేర్లకి 1897 డాలర్లు ఖర్చయింది. ఆ మిత్రుడు ఆ డబ్బు చెల్లించకపోవడంతో ఆ టీనేజర్ యాభైవేల డాలర్లకు స్నేహితుడిపైనే కేసు వేసాడు. 'మిగిలిన సొమ్ము తనకి కలిగిన మానసిక వ్యథకి నష్ట పరిహారంగా' అని పేర్కొన్నాడు.

★ అమెరికాలో పెళ్లి కాకుండానే అబ్బాయి-అమ్మాయి కలిసి ఉండవచ్చు. దీన్నే లివింగ్ టుగెదర్ అంటారు. అలా జీవించే ఓ యువతి అపార్ట్‌మెంట్‌ను తన పేరిట అద్దెకు తీసుకుంది. రెండేళ్ళలో కార్పెట్ మీద మరకలుపడి పాడైంది. అపార్ట్‌మెంట్ యజమాని 1400 డాలర్లు నష్టపరిహారంగా కోరాడు. ఆ మరకలు తనతో నివసించే వ్యక్తి చేసినవనీ, తను చాలా జాగ్రత్తగా ఉంటానని వాదించిందామె. అందువల్ల అతడే ఆ డబ్బులను చెల్లించాలని అమ్మాయి బాయ్‌ఫ్రెండ్‌పైనే కోర్టుకెళ్లింది.

★ ఒకతను ఇంటి వెనక గొర్రెలు పెంచుతున్నాడు. ఓ రోజు ఆ కంచె తలుపు తెరిచి ఉంటే, రెండుగొర్రెలు రోడ్డుమీదకి వెళ్ళి, కారుకింద పడి చనిపోయాయి. పక్కింటి వరండాలో కూర్చుని సంగీతం వింటున్న తన పొరుగువాడికి ఆ గొర్రెల గురించి తనని హెచ్చరించాల్సిన బాధ్యత ఉందని, అతను ఆ పని చేయకపోవడంవల్ల, వాటి ఖరీదుతో పాటు, తనకిష్టమైన ఆ గొర్రెలు మరణించడంవల్ల కలిగిన మానసిక వేదనకి కూడా నష్టపరిహారం చెల్లించాలని ఆ గొర్రెల యజమాని కోర్టుకెక్కాడు.

★ ఓ తండ్రి తాను కొన్న గిటార్‌ను కొడుకు పాడు చేసాడని కినుక వహించాడు. అంతటితో ఊరుకోక స్వంత సంపాదన గల కొడుకు దాని రిపేర్ ఖర్చులు ఇవ్వడం లేదని కోర్టుకెక్కాడు.

★ మరో వ్యక్తిది ఇంకో వింత కథ. అతడు విద్యార్థి దశలో ఉండగా తల్లిదండ్రులు చదువుకోవాలని కట్టడి చేయకపోవడంతో జులాయిగా తిరిగి పెద్దగా చదువుకోలేదట. ప్రస్తుతం తాను చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తున్నానని, దానికి కారణం తను ఉన్నత చదువులు చదవకపోవడమేనని అన్నాడు. అందువల్ల ఈ చర్యకు తన తల్లిదండ్రులే కారణమైనందున వారు తనకు తగిన నష్టపరిహారం ఇవ్వాల్సిందేనని ఓ పద్దెనిమిదేళ్ళ కుర్రాడు వ్యాజ్యం తెచ్చాడు.

★ అమెరికాను 'లిటిగెంట్ సొసైటీ' అని యూరోపియన్స్ పిలుస్తారు. ఎవరైనా తమతోటి వారిపైన కోర్టుకి ఎక్కవచ్చు. అక్కడి కోర్టుల్లో ఆ కేసులపై తీర్పులు కూడా పెద్దగా ఆలస్యం కాకుండా త్వరగా వెలువడతాయి. కేసులో ఓడి పోతే వ్యాజ్యం తెచ్చిన వ్యక్తి ఖర్చులు మాత్రమే నష్టపోతాడు. అందువల్లనే అమెరికాలో ఇలాంటి కేసులు అధికం. ఓ అమెరికన్ సగటున తన జీవితకాలంలో ఇలాంటి ఏడు కేసుల్లో ఇరుక్కుం టాడని గణాంకాలు చెబుతున్నాయి.

ప్రతీది పచ్చి వ్యాపారమైన అమెరికాలో అన్ని వృత్తుల వారి మీదకన్నా వైద్యులపైనే నష్టపరి హార కేసులు చాలా ఎక్కువ. కారణం వైద్యం చాలా సున్నితమైన, నిత్యం ప్రజలను నానా అగ చాట్లకు గురిచేస్తున్న అంశం. ఇలాంటి వ్యాజ్యాల్లో పరిహారం విలువ కనీసం పదిలక్షల డాలర్లు ఉంటుంది.

డాక్టర్ల వృత్తిపరమైన నిర్లక్ష్యం రుజువైతే వారు లక్షల్లో డబ్బులు చెల్లించాలి. దానికి వారు ఓ చిట్కా కనిపెట్టారు. అదేమంటే 'లా సూట్ ఇన్సూరెన్స్' తీసుకుంటారు. ఒకవేళ తాము నష్ట పరిహారం చెల్లించాల్సి వస్తే, వారి తరపున ఆ బీమా కంపెనీ డబ్బు చెల్లిస్తుంది. సాధారణంగా ఈ పాలసీ ప్రీమియం ఎక్కువగా ఉంటుంది. అమెరికాలోని డాక్టర్లు రోగుల నుంచి హెచ్చుగా ఫీజులు వసూలు చేయడానికి ఇది కూడా కార ణమే. ఇదంతా ఒక విషవలయం.

చివరకు అక్కడి టీవీ ఛానెల్స్ ద్వారా అనేక దావాలు పరిష్కారమవుతుండటం ఈరోజు చూ డవచ్చు. అమెరికాలో కొన్ని కార్పొరేట్ టీవీ ఛానల్స్ పదవీ విరమణ పొందిన జడ్జీలు, అస క్తి గల లాయర్లతో కోర్టురూం షోలను ప్రసారం చేస్తుంటాయి. ఇరవైవేల డాలర్లలోపు నష్టపరి హారం కేసులను ఈ షోలలో విచారణ చేస్తారు. జడ్జి ఇచ్చే తీర్పుకి తాము కట్టుబడి ఉంటామని ఇరు పక్షాలవారు అంగీకరించాక, తీర్పు భాగాన్ని ప్రసారం చేస్తారు. డైవర్స్ కోర్ట్ జడ్జి జూడీ, పీపుల్స్ కోర్ట్ జడ్జి జాసన్.. ఇలాంటి పేరుగల వారెందరో పాల్గొంటారు. ఆ టీవీ షోలలో విచా రణ అచ్చం కోర్టులోలాగే సాగుతుంది. దీనికి ప్రేక్షకులుగా హాజరయ్యేవారు ముందుగానే ఆ షో టిక్కెట్లను తీసుకోవాల్సి ఉంటుంది. కోర్టు హాల్‌లో ప్రేక్షకులుగా కూర్చోవచ్చు. తీర్పు తర్వాత ఇరుపక్షాలవారు తీర్పుపైన తమ తమ అభిప్రాయాలు వెల్లడిస్తారు. వెడ్డింగ్ వీడియోని సరిగ్గా తీసి ఇవ్వనందుకు ఓ వీడియోగ్రాఫర్ ఐదువందల డాలర్లను పరిహారంగా ఇవ్వాలని జడ్జి జూడీ తీర్పు చెప్పారు.

ఇలాంటి కోర్టుల్లో చిన్న క్లెయిమ్‌లను మాత్రమే తీసుకుంటారు. జడ్జి జో బ్రౌన్, గ్రెక్ మేథిజ్, జూడీ షైండ్లిన్, మేబైన్ ఎపిస్టైన్, అవెక్స్ ఫెర్రర్ తదితరులు స్మాల్ కాజెస్ టీవీ షోలలో జడ్జీలుగా వ్యవహరిస్తారు. డైవర్స్ కోర్టు జడ్జిగా లిన్ టోలర్ అనే ఆవిడ వ్యవహరిస్తున్నారు.

కొందరు అమెరికన్స్ వేసే వ్యాజ్యాలు మరీ వింతగా ఉంటాయి. 2002లో బలాత్కార నేరా నికి జైలుపాలైన ఎడ్వర్డ్ బ్రూవర్ ఇరవై లక్షల డాలర్లకు ప్రావిడెన్స్ హాస్పిటల్ మీద దావా వేసాడు. ఆ ఆస్పత్రి నిర్వాకం వల్లే తెలిగ్గా లోప లికి ప్రవేశించి, ఓ స్త్రీని బలాత్కరించే అవకాశం కలిగిందని, కాబట్టి తన దుస్థితికి వారు నష్టపరి హారం చెల్లించాలని కోరాడు. అతను హాస్పిట ల్‌లోకి రాకుండా జాగ్రత్త తీసుకోకపోవడం వారి తప్పేనని, అయితే అతన్ని బలాత్కారం చేయ కుండా చూసే, చట్టబద్ధ బాధ్యత ఆ ఆస్పత్రివారికి లేదని జడ్జి ఆ కేసును కొట్టి వేశాడు.

డెబ్బై ఏడేళ్ల రాల్ఫ్ ఈడెన్ అనే ప్లేబోయ్, ఓ పందొమ్మిదేళ్ళ అమ్మాయి తనతో శయనించనం దుకు నష్ట పరిహారం కోరుతూ ఆమెపై కేసు వేసాడు. న్యూయార్క్‌లోని తన హోటల్ గదికి వచ్చిన ఆమె తనతో కలిసి డ్రింక్స్ తీసుకుందని, తర్వాత తనతో శయనించడానికి నిరాకరిస్తూ 'నువ్వు ముసలివాడివి' అని అవమానించిందని, ఆమె నుంచి ఇరవై లక్షల డాలర్ల నష్టపరిహారం కోరాడు. తనకి జీవితకాలంలో మూడువేల మంది ఆడవాళ్ళతోగల శారీరక సంబంధాలను సాక్ష్యాలుగా ప్రవేశపెట్టాడు. 'ఆమెకు ఆ సమ యంలో ఈ సంగతి అతను వివరించకపోవడం అతని తప్పే' అని జడ్జి ఆ కేసు కొట్టివేశాడు.

మరో పెద్దమనిషి టీవీ ఎపిసోడ్‌లో ఎలుక మాంసం కలిసిన సూప్‌ను తినే దృశ్యాన్ని చూసి నప్పటి నుంచి తను తీవ్ర మానసిక ఒత్తిడికి గురై బీపీ పెరిగిందని కేసువేసి ఓడిపోయాడు.

తమ వద్దకు వచ్చే వినియోగదారుల్లో ఎవరు తమపైన ఎలాంటి క్లిష్టమైన కేసు తెస్తారోననే ఆందోళన వ్యాపారులను నిరంతరం పీడిస్తుం టుంది. 'ఐ విల్ సూ యూ ఇన్ ది కోర్ట్ ఆఫ్ లా' అన్నది అమెరికన్లు వినడానికి తీవ్రంగా భయపడే వాక్యం.

– డి. పద్మజ

# ఔదార్యం ఖరీదు

పరాత్పరరావుగారు ఐసీయూలో ఉన్నారు. దాదాపు డెబ్భైఏళ్ల పరాత్పరరావు గారు హైబీపీతో బాధపడుతున్నారు. రెండ్రోజుల క్రితం హఠాత్తుగా ఒళ్లంతా చెమటలు పట్టి, అపస్మారకంలోకి చేరుకోవడంతో హడావిడిగా కొడుకులు కోడళ్లు నగరంలోనే అత్యంత ఖరీదైన ఆస్పత్రికి ఆయనను తరలించారు.

కోట్లకు పడగలెత్తిన పరాత్పరరావుకు పదేళ్ల క్రితమే భార్య పోయింది. అప్పటి నుంచీ ఆయన మరింత మానసిక వేదనకు గురయ్యారు. ఇంటి నిండా కొడుకులు, కోడళ్లు, కూతుళ్లు, అల్లుళ్లు, మనవళ్లు, మనవరాళ్లు ఎందరుంటేనేం? మనసులో తాను ఒంటరి అనే భావన ఏర్పడిపోయింది. ఒకరకమైన వైరాగ్యం ఆయన మనసును ఆవరించింది. అందుకే వ్యాపారాలన్నీ బిడ్డలకు అప్పగించి వీలైనంతవరకూ ఆధ్యాత్మిక పుస్తకాలతో కాలక్షేపంచేస్తూ వస్తున్నారు.

మరో రెండురోజుల్లోనే పరాత్పరరావుగారిని ఐసీయూ నుంచి ఆస్పత్రి స్పెషల్ డీలక్స్ రూమ్‌కు మార్చారు. రూమ్‌లో చేర్పించిన తొలిదశలో ఒక్కోరోజు ఒక్కోకొడుకు రాత్రిపూట ఆస్పత్రి దగ్గరే తండ్రిని కనిపెట్టుకుని ఉండేవారు. ఓ వారం గడిచాక కూతురు కొడుకో కొడుకు కొడుకో ఎవర్నో ఒకర్ని వంతుల ప్రకారం రాత్రివేళ అక్కడ ఉండేలా జాగ్రత్తపడుతూ ఎవరి వ్యాపారాలు, వ్యవహారాల్లో కొడుకులు, కోడళ్లు, కూతుళ్లు, అల్లుళ్లు మునిగిపోయారు. తీరిక దొరికినప్పుడు వచ్చి ఓ పావుగంట చూసిపోవడం అలవాటు చేసుకున్నారు.

అలా ఓ రాత్రి- అతి బలవంతంమీద తాతగారికి రూమ్‌లో తోడుగా ఉండాల్సి వచ్చింది సుగుణాకర్‌కి. ఆస్పత్రికి వచ్చినప్పటి నుంచీ అతనికి ఒకటే చిరాగ్గా ఉంది. ఆరోజే అతని అభిమానహీరో సినిమా విడుదలైంది మరి! అతికష్టమ్మీద రెండో ఆటకు టిక్కెట్లు దొరికాయి. రమ్మంటూ స్నేహితుల ఫోన్లు! ఈ పరిస్థితుల్లో ఇక్కడ ఉండాల్సి వచ్చినందుకు అతను తెగ బాధపడిపోయాడు. తనతోపాటు ఆస్పత్రికి వచ్చిన తమ డ్రైవర్ మణికంఠకు తాతగార్ని జాగ్రత్తగా చూసుకోమనిచెప్పి తాను కారు తీసుకుని సెకండ్‌షోకు చెక్కేశాడు.

ఆ రాత్రే పరాత్పరరావుగారికి స్ట్రోక్ వచ్చింది. బాధతో విలవిల లాడిపోయారు. నోరువిప్పి చెప్పలేని, ఎవరినీ పిలవలేని పరిస్థితి! క్రమంగా స్పృహకోల్పోతున్న స్థితిలో అనుకోకుండా లోపలికి వచ్చాడు డ్రైవర్ మణికంఠ. యజమాని పరిస్థితి గమనించి మిగిలిన స్టాఫ్‌ను అలెర్ట్ చేయడమేగాక తనకున్న కొద్దిపాటి పరిజ్ఞానంతో ఆయన ఛాతీమీద బలంగా గుద్ది, ఆగిపోతున్న గుండెను తిరిగి పనిచేయించాడు. క్షణాల మీద ఐసీయూకి తరలించి ప్రాణాలు కాపాడాడు. ఏమైతేనేం? పరాత్పరరావు గారు చచ్చిబతికారు. స్వర్గద్వారం దాకా వెళ్లి తిరిగి వచ్చారు.

స్పృహలోకి వచ్చిన తర్వాత పరాత్పరరావుగారికి తన ప్రాణాలను రక్షించింది తమ డ్రైవరేనని తెలిసింది. ఆ క్షణంలో అతనికి

ఏమిచ్చినా తక్కువే అన్పించింది. కొంచెం కోలుకున్నాక తనకున్న కోటానుకోట్లలో ఓ కోటిరూపాయలు ఆ బక్కజీవికి ఇద్దామను కున్నాడు. అనుకోవడమేకాదు.. ఆ విషయం మణికంఠను పిల్చి చెప్పాడు కూడా. పైకివద్దు వద్దన్నా లోపల సంతోషించాడు మణికంఠ. ఇంటికి వెళ్లి భార్యా బిడ్డలతో ఆ సంతోషాన్ని పంచుకున్నాడు. ఈ లోగా పరాత్పరరావుగారి ఇంట్లో ఈ విషయంపై రచ్చరచ్చ అయిపోయింది. కొందరు సంతోషించారు..

ముఖ్యంగా ఆగ్రహావేశాలతో రగిలిపోయారు పరాత్పరరావుగారి సంతానం.

తమ తండ్రికి మతిభ్రమించినట్లుందని కొడుకులు కూతుళ్లు కుతకుతలాడిపోయారు. కొంతమంది ఆస్పత్రిలో తండ్రితో ఇదేవిషయమై 'ప్రేమగా' గొడవ పడ్డారు కూడా.

'మీ ఆయుష్షు గట్టిది.. బతికారు.. ఆ సమయంలో వాడు రాకపోయినా బతికేవారు.. అంతోసిదానికి లక్షో అరలక్షో వాడి ముఖాన కొట్టక కోటిరూపాయలు ఇస్తాననడం ఏమన్నా బాగుందా?' నిలదీశారు కొడుకులు. నిజమే గదా అన్నట్లు చూశారు కోడళ్లూ కూతుళ్లూ. 'అవును మామగారూ' అన్నారు అల్లుళ్లు. ఆలోచనలో పడ్డారు పరాత్పరరావుగారు.

మర్నాడు పరాత్పరరావుగారు మణికంఠను పిలిపించి 'ఏమనుకోకు! కొద్దిపాటి ఇబ్బంది వచ్చింది.. అలాగని 'సాయం చేస్తానని' నీకిచ్చిన మాట తప్పను. అందుకే మొహమాటపడకుండా నీకేం కావాలో నువ్వే అడుగు.. ఇచ్చేస్తాను' అన్నారు అతి ఉదారంగా.

'మీరు చల్లగా ఉంటే చాలు నాకేమీ అక్కర్లేదు..' అన్నాడు మణికంఠ మనసులో ఒకింత బాధపడుతూనే.

'అలా అంటే కుదరదు నీకేం కావాలో అడగాల్సిందే' పట్టుపట్టారు యజమాని.

'తమరు దయచూస్తే ఓ కారు కొనుక్కుని కిరాయికి తిప్పుకుంటాను.. ఎన్నాళ్లీ డ్రైవర్ కొలువుచేసినా గొర్రెతోక ఆదాయమేకదా?' ఎలాగో గొంతుపెగుల్చుకుని చెప్పాడు మణికంఠ.

'శభాష్.. నీకో మంచి కారు.. అదీ కొత్తది కొనిపెడ్తాను.. హ్యాపీగా బతుకుదువుగాని..' అంటూ పరాత్పరరావుగారు మాటిచ్చేశారు.

కానీ ఆ సాయంత్రం మణికంఠ ఇంట్లో మళ్లీ సంబరం! యజమానిగారింట్లో పెద్ద రభస!

'కారంటే కనీసం ఐదులక్షలు! ఏదో ఓ సెకండ్ హ్యాండ్‌ది లక్షో రెండు లక్షలదో కొని వాడి ముఖాన పడేయవచ్చుగదా? ఏంటి నాన్నగారూ మీకీమధ్య బొత్తిగా మతిపోతున్నట్లుంది?' పెద్దకొడుకు 'అత్యంత ఆదరంగా' తండ్రిని నిలదీశాడు.

'మాటిచ్చేశాన్రా కాదంటే బాధపడ్తాడు' పరాత్పరరావుగారు పైకలా అన్నా కొడుకు చెప్పింది సబబే అన్పించింది ఆయన మనసుకు. నిజమే కిరాయికి తిప్పుకునేవాడికి కొత్తకారెందుకు అనుకున్నారాయన. అప్పటికి ఆయన ఆస్పత్రి నుంచి డిశ్చార్జయి వచ్చి పదిరోజులు దాటింది.

'మీరు ఊఁ అనండి మామగారూ.. మా ఫ్రెండ్ కారొకటి ఉంది అరవై వేలకు ఇచ్చేస్తానంటున్నాడు. చూడ్డానికి కొత్తదిలాగే ఉంటుంది.. అది మణికంఠకు ఇప్పించేస్తాను.. పైగా మీకు మాటరాకుండా అతనికి నచ్చచెప్పే పూచీ నాది' అని భరోసా ఇచ్చాడు రెండో అల్లుడు.

అంతా అతని వంక ప్రశంసాపూర్వకంగా చూశారు. పరాత్పరరావుగారు సరే అన్నట్లు తలూపారు.

మర్నాడు ఉదయం పరాత్పరరావుగారి కొడుకులు, అల్లుళ్లు మణికంఠను పిలిపించారు. 'చూడు మణీ! నాన్నగారు చెప్పారు.. నీకు కారొకటి ఏర్పాటుచేద్దాం



అన్నారు. అయితే కిరాయి తిప్పేందుకు కొత్తకారెందుకు చెప్పు? మా బావగారి ఫ్రెండుది ఓ కారుందట. గుడ్ కండిష న్‌లో ఉందట. లక్షన్నర చెప్తున్నాడు (అల్లుడు చెప్పింది దాని ఖరీదు అరవై వేలే) అది కొనిచ్చేస్తాం.. హ్యాపీగా బతు కుపో. ఓకేనా?' చిన్న యజమానులంతా అలా అనేసరికి ఇంకేం మాటాడలేకపో యాడు మణి. అలాగే సార్ అన్నాడు విన యంగా.

★ ★ ★

మరో వారం రోజుల తర్వాత-

ఓ సాయంత్రం వేళ.. ట్యాంక్‌బండ్‌పై ఆ కార్లో కిరాయికి వెళ్తున్న మణికంఠ స్టీరింగ్ రాడ్ స్ట్రక్ అయి రెండు ఆటోల్ని ఢీకొట్టాడు. కండిషన్‌లో లేని బండిని తోలుతున్న నేరానికి పోలీసులు అతన్ని అరెస్టుచేసి కోర్టుకు తీసుకువెళ్లారు. గాయ పడ్డ ఆటోడ్రైవర్లకు, దెబ్బతిన్న ఆటోలకు పరిహారం చెల్లించడానికి అతని భార్యమెళ్లో ఉన్న తాళిబొట్టుకు కాళ్లొచ్చాయి.

-చంద్రప్రతాప్

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**మేడూరి సత్యనారాయణ**

శాంతినగర్,
తిరువూరు
కృష్ణా జిల్లా
పిన్ : 521235

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం -7 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1ప్ర | వ | 2రు | డు | ■ | 3గా | ర్ద | 4భం | ■ | 5సి |
| భ | ■ | ద్ర | ■ | 6ఆ | లి | ■ | 7డ | 8ర | గ |
| 9వ | 10స | మ | యూ | రం | ■ | 11అ | నం | తం | ■ |
| ■ | 12వ | దే | ■ | 13భం | 14గం | ■ | ■ | 15భా | 16మ |
| ■ | 17రా | వి | 18శం | ■ | 19జే | గం | 20టి | ■ | రు |
| 21అ | త్రి | ■ | 22తా | 23క | టి | ■ | 24యో | 25ధు | డు |
| మ | ■ | 26దే | వ | శం | ■ | 27బా | ట | సా | ■ |
| 28రా | 29క | ■ | ■ | 30కం | ద | కం | ■ | ■ | 31ప |
| 32వ | ల | లు | 33డు | ■ | ■ | 34కో | డి | 35కూ | త |
| 36తి | ప | ■ | 37క | ర | వ | డం | ■ | 38పం | కం |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. సి. జి. యస్. రావు, హైదరాబాద్, 2. దైతా విజయకృష్ణ, హైదరాబాద్ 3. యు. యు. యు, ఎమ్మిగనూరు, 4. వి. వి. సత్య నారాయణ శెట్టి, తిరుపతి, 5. జి. యస్. య స్. జి. ఎల్. ఆచార్యులు, విశాఖజిల్లా 6. కె. వి. ఎస్. ఎన్. మూర్తి, విశాఖ, 7. మాడు గుల వెంకట సుబ్బలక్ష్మి, మారుతీనగర్, విజయవాడ, 8. అవ్వారి సామ్రాజ్యలక్ష్మి, మోతీనగర్, హైదరాబాద్, 9. పి. బి. సీతా దేవి, నరసాపురం, ప. గో. జిల్లా, 10. ఎం. వసంత, బోరబండ, హైదరాబాద్, 11. డా. యిమ్మిడిశెట్టి చక్రపాణి, అనకాపల్లి, 12. డా. జి. విమలారంగారావు, అన్నానగర్ వెస్ట్, చెన్నై, 13. కె. భానుమతీదేవి, వనస్థలిపురం, హైదరాబాద్, 14. పి. వంశీకిషోర్, హన్మ కొండ, 15. లోచర్ల ఉమామహేశ్వరరావు, చిట్టివలస, విశాఖ జిల్లా, 16. అ. నరసింహా వతారం, విశాఖపట్నం, 17. కె. స్వరలయ, ఉడ్‌నగర్, చీరాల, 18. జె. విజయలక్ష్మి, హైదరాబాద్, 19. వెలగలేటి అనూరాధ, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, 20. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 21. జి. సూర్యనారాయణ, బందలాయిచెరువు, కృష్ణా జిల్లా, 22. సి. విజయభాస్కర్‌రెడ్డి, ప్రొద్దు టూరు, 23. సిహెచ్. హర్ష, కరెన్సీనగర్, విజయవాడ, 24. సిహెచ్. ఇందిరా శ్రీరామ్, కరెన్సీనగర్, విజయవాడ, 25. పప్పు కామే శ్వరరావు, అమలాపురం, 26. రామకూరు నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 27. నందూరి నాగేశ్వరరావు, బేగంపేట 28. జె. వి. వి. సత్యనారాయణమూర్తి, బీజాపూరు, 29. కూనపరెడ్డి సత్యనారాయణ, ఆమందూరు, చిత్తూరు జిల్లా, 30. గుర్రాల జయశ్రీ, మారుతీనగర్, గుంటూరు, 31. యు. విజ యశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 32. ఇంద్రగంటి నరసింహమూర్తి, కాకినాడ, 33. పేరి కృతి, సికింద్రాబాద్, 34. ఎం. నాగలక్ష్మి, కర్నూలు, 35. నేమాన సుభాష్‌చంద్రబోస్, ఇలిసిపురం, శ్రీకాకుళం, 36. చాట్ల గంగ మణి. కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా, 37. బి. వి. పద్మావతి, సింగరేణి కాలరీస్, కొత్త గూడెం, 38. పి. రష్మి, తార్నాకా, సికింద్రాబాద్, 39. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 40. ఎం. రేఖారావు, బెంగ ళూరు, 41. ఎ. కాళేశ్వరరావు, హైదరాబాద్

# చతురంగం - 8 ఆధారాలు

## అడ్డం

1. వానర రాజ్యం (3)
4. ఔరంగజేబు చెల్లెలు, శివాజీ ప్రేమికురాలు (4)
8. యుద్ధభూమి (4)
11. తోక తెగిన చిలుక పలుకు (3)
12. తోక తెగిన అద్దె (2)
14. డబ్బు, సంగీత నటించిన ఇటీవలి సినిమా (2)
15. పగలుకు వ్యతిరేకం (2)
16. దుఃఖం (2)
17. గ్రహాల్లో ఒకటి తడబడింది (3)
19. దినం (2)
20. శ్రీకృష్ణుని ప్రియురాలు
21. క్రికెటర్ సెహ్వాగ్ ముద్దుపేరు (2)
22. శ్రీరామరాజ్యంలో సీత (5)
24. ప్రాణం, జంతువు, బతికి ఉన్న (2)
25. భాషకు రాత రూపాన్ని ఇలా అంటారు (2)
27. జెండా (3)
28. తెలుగులో స్టోరీ (2)
29. సేవకుడు, వైష్ణవ భక్తుడు (3)
30. సేన, సమూహం (2)
31. వాలి భార్య, అంగదుని తల్లి, నక్షత్రం, నటి (2)
32. నిలువు బొట్లను ఇలా అంటారు (3)
33. సాధమే తెలుగులో (2)
34. నూరు (2)
35. జిత్తులమారి జంతువు, కపటి (2)

## నిలువు

1. తెలుగులో గవాక్షం, ఎటు చదివినా అదే (3)
2. ఖరీదు, భూమి (2)
3. ఒడ్డు (2)
5. చివర ఎగిరిపోయిన శృంగార నటి (2)
6. కలహభోజనుడు (4)
7. దిన.. మాస పత్రికల్లాగే ఈ పత్రికలూ, కానీ తలకిందులు (2)
9. తలకిందులైన సరస్వతి వాద్యం (2)
10. దీపావళి టపాసుల్లో ఉండే పేలుడు స్వభావంగల ఘాటైన పొడి(3)
13. దుర్యోధనుడ్ని ఇలాగూ అంటారు (3)
16. నిశితంగా వెదుకు (3)
17. 'ర' గుణితంలో వరుసగా రెండక్షరాలు (2)
18. మంచివాడు, శోభన్‌బాబు నటించిన సినిమా (5)
19. దంచేది దీనితోనే (3)
20. అష్టదిగ్గజాల్ని పోషించిన రాజు (3)
21. 'మాయాబజారు'లో ఘటోత్కచుడు మెచ్చితే మెడలో ఇది తప్పదు (4)
23. మునులు (4)
26. కోకిల కూత (4)
29. నిష్పత్తిని ఇలా అంటారు (3)
30. శిక్ష (3)
33. ఇసుక దిబ్బ (2)

### నిబంధనలు

1. చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

**చతురంగం పంపాల్సిన చిరునామా :**

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, క్యాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 8

రూ.150/- బహుమతి

గడువు తేది : నవంబరు 18

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | ■ | 4 | 5 ష | 6 | 7 |
| | | 8 | 9 | | 10 | | 11 | | |
| 12 | 13 | ■ | | | 14 ధ | | | | ■ |
| | 15 | | ■ | 16 | | | 17 | | 18 |
| 19 | | ■ | 20 | | | 21 | | | |
| | | 22 | | | 23 | | ■ | 24 జీ | |
| 25 | 26 | | | | 27 | | | | |
| ■ | 28 | | | 29 దా | | | | 30 | |
| 31 | | | 32 | | | | 33 | | |
| | 34 | | | | | 35 | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (     ) చిరునామా : ----------------------------

------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 35



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

## ఉత్తమ వ్యాఖ్య :

నువ్వెట్టాగు జడవేసుకోవు
నేను వేసుకుంటే నీకెందుకే కుళ్లు...
దేభ్యం మొహం నువ్వూనూ...

– భాగ్యశ్రీ రాజేష్,
పొన్కల్, ఆదిలాబాద్ జిల్లా



## కాప్షన్ మీదే -34

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

మిమ్మల్ని చూసి మీరు..
మిమ్మల్ని చూసి మేము.. ఇదేకదా ఫ్యాషన్!
– సి హెచ్. నాగేశ్వరరావు, రాజాం

ఎంచక్కా నాలా జడేసుకుని
రిబ్బన్ కట్టుకోకుండా
ఏంటా జుట్టు గుర్రం తోక లాగ!
–కొట్రగడ్డ భాస్కరరావు, సికింద్రాబాద్

నీకది ఫ్యాషన్... నాకిది ఫ్యాషన్
– ఎన్.వై.జి.కె. చైతన్య,
పెనుగొండ, ప.గో. జిల్లా

జడలు తోకలైనాయి!
తోకలు జడలైనాయి!!
– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ.గో. జిల్లా

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78




1800-102-7346

For further details please contact corporate office & service centre: **Nikon India Pvt. Ltd.**, Plot No.17, Sector 32, Institutional area, Gurgaon- 122002, Haryana, Ph. No. +91 124 4688500, Fax No. +91 124 4688527, Service Ph. No. +91 124 4688514, **Service Email ID:** nindsupport@nikonoa.net, **Sales and support enquiries Email ID:** nindsales@nikonoa.net, **Hyderabad Service Centre:** Astro Camera Tech: 040-66460248, Email: nikon.act@gmail.com, **Nikon Collection Centre: Visakhapatnam** - Ganga Marketing & Services, Ph. No. +91- 9849004688, Email- gangavsp@sify.com, **Vijayawada** - Bhanu Electronics, Ph. No. 0866 6665756, **Email** - betsvij@gmail.com, **Distributors Address (A.P):** Ritvik Digitech Pvt Ltd, # 307, Windsor Plaza, Nallakunta, Hyderabad-500 044. Ph.no:66742927 /9246544778. Email ID: rakesh@ritvikdigital.com, **GREATER HYDERABAD: D-SLR ZONE:** Byas Foto World (Himayat Nagar)-9849384850, 23225457, IIIrd i (Banjara Hills)-65509216, 9849509216. **CENTRAL ANDHRA: COOLPIX ZONE: VIJAYAWADA:** Governerpet: Model Photographic Co. Pvt. Ltd.-9848120355/2575166 **NORTH ANDHRA: COOLPIX ZONE: VISAKHAPATNAM:** Goldie-0891 3098660/ 9346059998

croma Reliance digital HyperCITY BIG BAZAAR NEXT more. MEGASTORE

K&L Arms/11/11